

జననం: 2-10-1904 నిర్యాణం: 11-1-1966

"భారత ప్రజల ఉత్తమ సేవకుడు, శాంతిసౌభాగ్యాలకు అంకితమైన లాల్‌బహదూర్"

డా, రాధాకృష్ణన్

# ఆంధ్రప్రదేశ్

సంపుటి: 10 ] అక్టోబరు, 1966 [ సంచిక: 12

ఆశ్వయుజ-కార్తీక 1888 శా. శ.

ప్రధాన సంపాదకులు :
టి. రామచంద్రరావు

సంపాదకులు :
కప్పగంతుల లక్ష్మణశాస్త్రి

## ఈ సంచికలో



మొదటి చిత్రం : తామరకొలను
ఫోటో : ఎస్. ఆర్. కె. రావు

రెండవ చిత్రం : మంగళగిరి నృసింహస్వామి

మూడవ చిత్రం : చేనేత పారిశ్రామికులు

నాలుగవ చిత్రం : కాళహస్తి దేవాలయం
ఫోటోలు : ప్రధాన సంపాదకులు

* ఈ సంచికలోని రచయితల అభిప్రాయాలు ప్రభుత్వానికి సంబంధించినవి కావు.
* ఆంధ్ర ప్రదేశ్ పత్రికపై పాఠకులు తమ అభిప్రాయాలు తెలుపగోరుచున్నాము.

# ధరల పెరుగుదల



మనదేశంలో అత్యవసర సరుకుల ధరలు గత పదిహేను సంవత్సరాల నుంచి పెరుగుతున్న సంగతి అందరికీ తెలిసిందే. అయితే గడచిన కొన్ని ఏండ్లుగా ఈ పెరుగుదల చాలా హెచ్చుగా వుంటున్నది. ఇందుకు అనేక కారణాలు పేర్కొంటున్నారు. భారీ ఋణ మొత్తాలు శక్తికి మించిన అభివృద్ధి ప్రణాళికలపై ఖర్చయి ఆ ప్రణాళికలనుంచి ఇంకా ఫలితాలు అందడం ప్రారంభం కాకపోవడంవల్ల తాత్కాలికంగా స్తబ్ధత ఏర్పడి అభివృద్ధి మిథ్యగా పరిణమించిందని కొందరు అంటున్నారు. జనాభా తీవ్ర పెరుగుదలవల్ల అవసరాలకూ, సరఫరాలకూ మధ్య అంతరం విశాలం అవుతుండడమే దీనికి కారణమని మరికొందరి అభిప్రాయం. స్వదేశీ, విదేశీ పెట్టుబడిదార్ల చర్యల పర్యవసానమే ఈ పరిస్థితి అని కొంతమంది చెబుతున్నారు. వేతనాల పెరుగుదలకూ, ధరల పెరుగుదలకూ మధ్య ప్రత్యక్ష సంబంధం ఉన్నదని కొందరు అంటుంటారు. సామాన్యవ్యక్తిని కలవరపరిచే ఇలాంటి వాదనలు అనేకం యధేచ్ఛగా చేయడం జరుగుతున్నది. ధరల పెరుగుదల, జనాభాలో అధిక సంఖ్యాకులు ఎదుర్కోవలసి వస్తున్న ఒక క్లిష్టసమస్యేకాని అరిష్టమైనదికాదు. కొన్ని సంవత్సరాలుగా క్రమక్రమంగా పెరుగుతూ ప్రస్తుతం జటిల స్వరూపం దాల్చిన సమస్య యిది. కాబట్టి దీనిని శీఘ్రంగా పరిష్కరించడానికి సాధ్యపడదు. మామూలు పరిస్థితి నెలకొల్పడానికి బాధాకరమైన అనేక చర్యలు, త్యాగాలు అవసరం.

ద్రవ్యోల్బణకు, ధరల పెరుగుదలకు గురిఅయినది మన దేశం ఒక్కటేకాదు. రెండవ ప్రపంచయుద్ధం తరువాత ప్రపంచంలోని దాదాపు ప్రతిదేశంలోనూ ఈ పరిస్థితులు ఏర్పడి క్రమక్రమంగా పెంపొందాయి. అమెరికా, ఇంగ్లాండు వంటి బాగా అభివృద్ధిచెందిన దేశాలు సహితం ఈ పరిస్థితులకు లోబడివున్నాయి. కనుక మనం మన దేశంలోని పరిస్థితులవల్ల ఆందోళన జెందనవసరంలేదు. ఈ సమస్యను మనం అవసరమైతే అన్యదేశాల నుంచి ఉదాహరణలను స్వీకరించి ప్రశాంతంగా, ప్రయోజనాత్మకంగా ఎదుర్కోవాలి.

ప్రపంచ మంతటిలోకీ సంపన్నదేశమైన అమెరికాలో దాదాపు అన్నివస్తువుల ధరలు పెరుగుతున్నాయి. తమ సంక్షుభిత ఆర్థిక పరిస్థితి ద్రవ్యోల్బణకు లేక మాంద్యానికి లేదా ఈ రెండింటికి దారితీయకుండా వుండడానికై ఆ దేశపు పాలకవర్గం అత్యవసరంగా ఏవైనా చర్యలు తీసుకోవలసివచ్చింది. పన్నులు పెంచడం, ఖర్చులు తగ్గించడం ఇందుకు సర్వ సాధారణంగా సూచించబడే పరిష్కార మార్గాలు. కాని ఎన్నికల సంవత్సరంలో ఈ చర్యలు తీసుకోవడం మంచిది కాకపోవచ్చునని కొందరి అభిప్రాయం. కాని ధరలను అదుపులో పెట్టకుండా పెరగనివ్వడంవల్ల కూడా ప్రమాదం వుంది. అందుచేత అమెరికా అధ్యక్షుడు చాలా ధైర్యంగా, దేశ ఆర్థిక పరిస్థితికి ఎక్కువ ప్రమాదకరమైన ద్రవ్యోల్బణను అరికట్టడానికి నిశ్చయించారు. ఆయన ఇటీవల ఈ క్రింద పేర్కొన్న అయిదు అంశాల ప్యాకేజ్ కార్యక్రమాన్ని ప్రకటించారు:—

(అ) పారిశ్రామికాభివృద్ధిని ప్రోత్సహించే నిమిత్తం తనకు పూర్వంవున్న అధ్యక్షుడు ప్రవేశపెట్టిన ఏడుశాతం పెట్టుబడిపన్ను పరపతిని రద్దుచేయడం. యంత్రపరికరాలు ఇతర సాధన సామగ్రి ఖర్చులో ఏడుశాతం మొత్తాన్ని తమ ఆదాయపు పన్నులోనుంచి మినహాయించుకోవడానికి కంపెనీలను అనుమతించేందుకు ఈ పరపతి ఉద్దేశించబడింది.

(ఆ) ఆధునిక యంత్రాగారాలను కొత్తగా, ఇతోధికంగా నెలకొల్పడాన్ని ప్రోత్సహించడానికి ఉద్దేశించిన డిప్రిసియేషన్ రైట్ఆఫ్‌ను రద్దుచేయడం.

(ఇ) ఫెడరల్ వ్యవస్థ ఖర్చులలో కోత అమలుపరచడం.

(ఈ) బ్యాంకుల సహకారంతో తక్కువ వడ్డీ రేటుకు డబ్బు లభింపజేయడం.

(ఉ) ప్రభుత్వ సెక్యూరిటీల అమ్మకాన్ని వాయిదా వేయడం ద్వారా, మార్కెటునుంచి ఫెడరల్ వ్యవస్థ డిమాండును సాధ్యమైనంత గరిష్ఠస్థాయిలో తొలగించడంద్వారా ద్రవ్య విపణిపై ఫెడరల్ వ్యవస్థ ప్రభావాన్ని సడలింపజేయడం.

శతాబ్దికిపైగా ప్రపంచద్రవ్య విపణిపై ఆధిపత్యం వహిస్తున్న ఇంగ్లాండు కూడా యిటువంటి పరిస్థితినే ఎదుర్కొంటూ అవమూల్యన చర్యను తీసుకున్నది. దీనికి తోడు వేతన స్తంభన పద్ధతినికూడ అవలంబించింది

సంపత్సమృద్ధిగల యీరెండు దేశాలవలెగాక 1947 లో స్వాతంత్ర్యం సాధించిన మనం దూరప్రాచ్యంలో బడుగుజాతిగా మనుగడ ప్రారంభించాము. ఆర్థిక పురోభివృద్ధికి వీలుగా అప్పటి ప్రధాన మంత్రి పండితనెహ్రూ పంచవర్ష ప్రణాళికలను ప్రవేశపెట్టారు. 19 సంవత్సరాల స్వల్ప కాలంలోనే వ్యవసాయం, నీటిపారుదల, విద్యుచ్ఛక్తి, పరిశ్రమల రంగాలలో గణనీయమైన విజయాలను సాధించాము. ఈ ఫలితాలు స్పష్టంగా గోచరమవుతున్నప్పటికీ మన ఆధీనంలోలేని వివిధ పరిస్థితుల కారణంగా మనం యింకా బడుగుస్థితిలోనే ఉన్నాము. జీవనస్థాయి పెరిగినదనడంలో సందేహంలేదు. అయితే మనకు ఉన్న వనరులనుండే మన అవసరాలను పూర్తిగా తీర్చుకోవాల్సి ఉన్నది. ధరల పెరుగుదలను, ద్రవ్యోల్బణ పరిస్థితులను అరికట్టే దృష్టితో, ఎన్నికల సమయం ఆసన్నమైనా, కేంద్రప్రభుత్వం రూపాయి మారకం విలువ తగ్గింపువంటి తీవ్రమైన చర్యను ధైర్యంగా తీసుకున్నది. అయితే దీనికిదే సమస్యా పరిష్కారంకాదు. దీనితోపాటు ఇతర అనుబంధ చర్యలుకూడ తీసుకోవాల్సిఉన్నది. ఇదివరకే పేర్కొన్నట్లు ప్రస్తుత పరిస్థితివల్ల నిరుత్సాహ పడవలసిన అవసరంగానీ, అధైర్యపడవలసిన పనిగానీ యేమీలేదు. మనవంటి క్రమశిక్షణాయుతమైన జాతి యీపరిస్థితిని అధిగమించవచ్చు. ఈ సందర్భంలో తీసుకునే అవసరమైన చర్యలు దిగువ ఇవ్వబడినవి.

(1) సాధ్యమైనంత త్వరలో స్వయంసమృద్ధిని సాధించడానికి వీలుగా వ్యవసాయ, పారిశ్రామక ఉత్పత్తులను త్వరితగతిని అధికంచేయాలి.

(2) విలువైన విదేశీమారక ద్రవ్యసంపాదనకు మన ఉత్పత్తులను వినియోగించడానికి వీలుగా ఉత్పత్తులను అధికంచేయడమే పారిశ్రామికవేత్తల లక్ష్యం కావాలి.

(3) విదేశీవస్తువులపై ఆధారపడడాన్ని తగ్గించడానికి వీలుగా పరిశ్రమల ఉపయోగార్థం, స్వదేశీ వస్తువులను వినియోగించడంలోను, కనిపెట్టడంలోను మనశాస్త్రజ్ఞులు, సాంకేతిక నిపుణులు తమ నైపుణ్యాన్ని వినియోగించాలి.

(4) స్థానికంగా లభించే వనరులను వినియోగించజాలని వస్తువులను మాత్రమే దిగుమతిచేసుకోవడానికి పరిమిత కాలంవరకు అనుమతించాలి.

(5) మన పారిశ్రామిక వేత్తలు, వ్యవసాయదారులు, వ్యాపారస్థులు, బ్లాక్‌మార్కెటింగ్, దొంగరవాణా వంటి సంఘవ్యతిరేక చర్యలకుపాల్పడి అక్రమనిల్వలు చేయడాన్ని ఆపుచేయాలి.

(6) ప్రజలు పొదుపరితనాన్ని అలవరచుకొని విలాసవస్తువుల కొనుగోలుకై విరివిగా ధనం వ్యయంచేసే విపరీత తత్వాన్ని విడనాడాలి.

(7) ప్రజలు వస్తువులను వ్యర్థం చేయడాన్ని సాధ్యమైనంతవరకు మానుకోవాలి.

(8) కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు తమవ్యయాన్ని కనీసపుస్థాయికి తగ్గించాలి.

ఈ పద్ధతులు కొత్తవిగానీ, అసాధ్యమైనవిగానీకావు. ఇవన్నీ సమీకృతంగాకలిసి ప్రజలు, ప్రభుత్వాల బాధ్యతగా రూపొందినాయి. ఈ పద్ధతులను అమలుచేయడంలో సద్భావం, సహకారంలభించనిచో తక్కువవ్యవధిలో ప్రయోజనకరమైన ఫలితాలను సాధించ వీలుకలుగదు. పరస్పర సహకారం, సానుభూతితో ధరలపెరుగుదల సమస్య విజయవంతంగా పరిష్కరింపబడి అందరికీసుఖసంతోషాలు కలుగగలవని నేను ప్రగాఢంగా విశ్వసిస్తున్నాను.

జైహింద్!

ముఖ్యమంత్రి

# పొగాకు పంటలకు ఇంతకు ముందు లేని సరికొత్త రకమైన రక్షణ !



# రోగోర్®

## మొట్టమొదటి భారతీయ సిస్టమిక్ క్రిమిసంహారిణి




రోగోర్, అనేక పంటలకు ఇంతకు ముందు లేని సరికొత్త రకమైన రక్షణ నిస్తుంది. ఆకులు, వేళ్ల ద్వారా అది పీల్చుకోబడి మొక్క యొక్క పసరు ప్రవాహములోకి పోవును. అక్కడ అది రెండు వారములు వుంటుంది. ఈ సమయంలో మొక్క యొక్క పసరు త్రాగే ఏ చీడ క్రిములైనా నశిస్తాయి. రోగోర్ సురక్షితమైన క్రిమి సంహారిణి—మనుష్యులకు హానికరమైనది కాదు.

టాటా ఫైసన్ ఇండస్ట్రీస్ అత్యంత విస్తృతమై, అత్యధిక ప్రభావమైన క్రిమి సంహారిణులను చేయుదురని భారతీయ వ్యవసాయదారులకు పూర్తిగా తెలిసిన విషయమే. భారతదేశములో రోగోర్‌ను తయారు చేయుటకు వారు క్రొత్త ఫ్యాక్టరీని నిర్మించిరి.

రోగోర్ వాడండి—మొట్టమొదటి భారతీయ సిస్టమిక్ క్రిమి సంహారిణి—మీ పొగాకు పంటల మీద...అత్యధిక, మంచి పంటలను పొందుదురని నిశ్చయపరచుకోండి.

® రోగోర్ మాంటెకాటిని, మిలాన్, ఇటలీ, యొక్క రిజిస్టర్డ్ ట్రేడ్ మార్కు.

టాటా ఫైసన్ ఉత్పత్తి

**TATA FISON RALLIS**

టాటా ఫైసన్ ర్యాలీస్

Bensons/I-TFIL-29 TL

# మహాభారతము

కప్పగంతుల లక్ష్మణశాస్త్రి

## ఆస్తీకోపాఖ్యానము

పూర్వము జరత్కారుడను మునియుండెను. అతడు పగలంతయు సంచరించుచు ఎక్కడ ప్రొద్దుగ్రుంకునో ఆచోటు తన యిల్లుగా జేసికొని నివసించుచుండెను. కనుక అతడు 'యత్ర సాయంగృహుడు'అని పిలువబడుచుండెను. మహాతపస్సంపన్నుడు బ్రహ్మచారియునగు ఆ జరత్కారుడు నిరాహారుడై వాయు భక్షణముచేయుచు దేశమందంతటనుసంచరించుచుండెను. ఒకనాడు అతడు ఒక గుంటలో ఒక అవురుగడ్డివెన్నును బట్టుకొని తల క్రిందుగా వ్రేలాడుచున్న మునులను చూచెను ఆ అవురుగడ్డి వెన్నులన్నియు ఎలుకలుకొరికి ఒకటిమాత్రము మిగిలియుండెను. అట్లున్న ఆ మునులను జరత్కారుడు, "మహాత్ములారా! మీ రెవరు? ఈ విధముగా నుండుటకు కారణమేమి?" అని యడిగెను.

''మేము ఒకరాత్రి ఒక గ్రామమునందు మాత్రమే నివసించు(యాయావరులు) గృహస్థులము. వ్రతనిష్ఠతోనున్నాము. మావంశములో సంతతిలేదు. ఒక్కడు మాత్రము 'జరత్కారుడు' అనువాడు మిగిలియున్నాడు. వంశములో సంతానక్షయముచేత మాకు ఊర్ధ్వలోకములు లభించక అధోలోకములనుబట్టి పోవుచున్నాము. ఒక్కడుమాత్రము మిగిలియుండుటచేత మాకు వ్రేలాడుట కిప్పుడు అవురుగడ్డిలో ఒకవెన్ను మాత్రమే ఆశ్రయమైనది. జరత్కారుడు మూర్ఖుడై పెండ్లి యాడకున్నాడు. అతనికిగూడ సంతతిలేకున్నచో అతనితరువాత మాకు పిండోదకములను ఇచ్చు వారులేక ఈ ఒక్క వెన్నుగూడ తెగిపోయి యీ గర్తములోపడి నీచగతికి పోగలము. ఎంత పుణ్యముచేసిన వారైనను మనుష్య లోకములో సంతానహీనులకు స్వర్గాదిపుణ్యలోకములు లభించవు. నాయనా! నీవెవరు? బంధువువలె మాపై సానుభూతిని చూపుచున్నావు" అని వారు జరత్కారునితో ననిరి.

ఆ మాటలను విని జరత్కారుడు, ''మహాత్ములారా! మీరు నా తండ్రితాతలు. నేనే జరత్కారుడను. మీకు నేను చేయగల సేవను ఆజ్ఞాపించుడు. చేసెదను'' అని వారి అవస్థను చూచి చాల జాలిపడి చెప్పెను.

ఆ మాటకు పితృదేవతలు, "నాయనా! మనకులమును ఉద్ధరించగల సంతానముకొరకు ప్రయత్నించుము. 'అపుత్రస్య గతిర్నాస్తి' అను న్యాయముప్రకారము మన వంశములోని వారికి పుణ్యశ్లోకములు కలుగవు. నీవు వివాహము చేసికొని సంతతిని పడయుము. దానివలన నీకును, మాకును శ్రేయస్సు కలుగును. ఎన్ని ధర్మములను, తపస్సులను ఆచరించిన వారికైనను పుత్రవంతులకుగల పుణ్యలోకములు కలుగవు. నీకు ఇది మా యాజ్ఞ" అని చెప్పిరి.

దానికి జరత్కారుడు, ''నాకు పెండ్లి చేసికొనవలెననికాని, ధనమును సంపాదించవలెననికాని ఆశలేదు. ఇప్పుడు మీరు ఆజ్ఞాపించుచున్నారు కనుక మీ హితముకొరకు పెండ్లి చేసికొని సంతతిని కనెదను. కాని యిప్పుడుకాదు. నా పేరుగల కన్యక లభించినప్పుడు చేసికొనెదను. దరిద్రుడనగు నన్నుపిలిచి పిల్లనెవ రిచ్చెదరు? ఎవరైనను భిక్షమువలె నాకు నాపేరుగల కన్యనిచ్చినచో స్వీకరించెదను'' అని చెప్పెను.

తరువాత జరత్కారుడు తనపేరుగల కన్యకకొరకు దేశమందంతను వెదకుచు తిరిగెను. అట్టికన్యక యెక్కడను లభించలేదు. అప్పుడు అడవికి పోయి జరత్కారుడు తనపితృదేవతల మాటలను స్మరించి, కన్యకొరకు మూడు పర్యాయములు అరచెను అదివిని వాసుకి తనచెల్లెలిని వెంటబెట్టుకొని వచ్చి జరత్కారునికి సమర్పింప బోయెను. కాని ఆమె తనపేరుగలది కాదేమోయని అతడు పరిగ్రహించలేదు. అప్పుడు వాసుకి 'ఈమె పేరుగూడ జరత్కారువే. ఈమెను నీకొరకై సంరక్షించుచున్నాను. ఈమె నా చెల్లెలు' అని చెప్పి జరత్కారునికి భార్యగా ఆమెను ఇచ్చెను. జరత్కారుడు యథావిధిగా జరత్కారువును పెండ్లి చేసికొనెను.

ఆయిరువురికి మహాతపస్సంపన్నుడైన ఆస్తీకుడు పుట్టెను. అతడు తన మాతృవంశమువారైన సర్పములకు జనమేజయ సర్పయాగములో నాశము కలుగకుండ కాపాడెను. ఈవిధముగా జరత్కారు మహాముని పుత్రుని కని తన పితృపితామహాదులను తరింపజేసెను. యజ్ఞములుచేసి దేవతలను, బ్రహ్మచర్యవ్రతపాలనముచేత ఋషులను తృప్తిపరచెను. ఇట్లుదేవ ఋషి పితృ, ఋణత్రయమునుండి విముక్తుడై జరత్కారుడు, జరత్కారువుతోపాటు అంతమున స్వర్గసుఖమును చూరగొనెను.



## గరుడోపాఖ్యానము

కశ్యప ప్రజాపతికి కద్రువ, వినత అని యిరువురు భార్య లుండిరి. వారికి కశ్యపుడు ప్రీతితో చెరియొక వరమిచ్చెను. కద్రువ వేయిమంది నాగులను పుత్రులనుగా నిమ్మని వరము కోరెను. కద్రువపుత్రులకంటె అధిక బలశాలురైన యిరువురు పుత్రులను వినత కోరెను. కశ్యపుడు సంతోషముతో వరదానము చేసెను. ఇరువురు గర్భవతులైరి. ఇట్లు వారిని తృప్తిపరచి కశ్యపుడు తపస్సు కొఱకు వనమునకు పోయెను.

కొంతకాలమునకు కద్రువ వేయి గ్రుడ్లను, వినత రెండు గ్రుడ్లను ప్రసవించెను. ఆ వేయి అండములను పరిచారికలు వెచ్చని భాండములలో ఉంచి అయిదువందల సంవత్సరములు కాపాడిరి. అందుండి వేయి సర్పములు పుట్టెను. వినత రెండు గ్రుడ్లనుండి సంతతి ఇంకను కలుగలేదు. కద్రూసంతతికన్న తన సంతానము అధికబలశాలురు కావలె నని వినత కోరినందుచేత, ఆమె గ్రుడ్లు అవియుటకు వేయి ఏండ్లు అవసరము. ఐనను, సవతికి కలిగిన పుత్రసంతతికి అసూయపడి వినత తన రెండు గ్రుడ్లలో ఒకదానిని బలాత్కారముగా చిదిమెను. నడుముల వరకు సగము శరీరము పెరిగిన పుత్రుడు అందుండి బయలు పడెను. ఆ పుత్రునికి తల్లిపై కోపమువచ్చి "అసమగ్ర శరీరునిగా నన్ను చేసితివి కనుక నీవు అసూయపడిన సవతికి దాసివి కమ్ము" అని తల్లిని శపించెను. "అయిదు వందల సంవత్సరములు దాసీత్వము ననుభవించుచు ఈ రెండవ అండమును జాగ్రత్తగా కాపాడినచో దానినుండి పుట్టినకొడుకు నిన్ను దాస్యమునుండి విడిపించగలడు.'' అని శాపాంతము గూడ తల్లికిచెప్పెను. నన్ను వలెనే ఇతనినిగూడా లోభముచేత వికలాంగుని చేయకుము. ఈ అండము స్వయముగా అవిసి సర్వాంగపరిపుష్టుడగుపుత్రుడు కలుగువరకు మరియైదువందలయేండ్లు వేచియుండుము.'' అని తల్లికి ఉపదేశించెను. ఎఱ్ఱని కాంతిగలవాడు గనుక అతనికి 'అరుణుడు' అనుపేరువచ్చెను. నడుమువరకు సగము శరీరము గలిగి ఊరువులు (తొడలు) లేనివాడు గనుక 'అనూరుడు' అను మరియొక పేరుతో గూడ నతడు ప్రసిద్ధుడయ్యెను. అరుణుడు సమస్తలోకములకు అంధకారమును పోగొట్టుచు అమరుడై ప్రకాశించుచుండెను.

అట్టి సమయమునందే ఆసవతు లిద్దరు తమకు సమీపము నందు సంచరించుచున్న 'ఉచ్చైఃశ్రవము' అను అశ్వమును చూచిరి. అది, పూర్వము దేవదానవులు అమృతము కొరకై సముద్రమును చిలుకుచున్నపుడు పుట్టిన దివ్యాశ్వము. ఇంద్రునకు వాహనము.

ఈమాటవిని శౌనకుడు ''మహాత్మా! వారు అమృతము నెట్లు మథించిరి? మథించునప్పుడు అమృతమే కాక యీ యశ్వము మున్నగు ఇతరములు ఉద్భవించుటకు కారణమేమి?" అని ప్రశ్నించగా ఉగ్రశ్రవుడు ఇట్లు చెప్పెను ;—

## సముద్ర మథనము

పూర్వము దేవతలు మేరుపర్వతముపైన కూర్చొని అమృతమును సంపాదించు నుపాయము కొరకు ఆలోచించుచుండిరి. అక్కడికి శ్రీమన్నారాయణమూర్తి వచ్చి ఇట్లు చెప్పెను. ''దేవతలారా! మీరిట్లు చింతించి లాభములేదు. మీరు, రాక్షసులు చేరి సముద్రమును మథించుడు. సముద్రము నుండి అమృతమేకాక అన్ని ఓషధులు, రత్నములు (శ్రేష్ఠ వస్తువులు) ఉత్పన్నము లగును.

భగవంతుని ఆజ్ఞగొని వారు సముద్రమును మథింప గోరిరి. "అమృతములో తనకు కొంత భాగమిచ్చినచో చిలుకనిచ్చెదను" అని సముద్రుడనెను. దానికి దేవతలు అంగీకరించిరి. అనంతుని సహాయముతో తెచ్చిన మందర పర్వతమును కవ్వముగా చేసిరి. అది మునుగకుండుటకు దానికి ఆధారముగా నుండుమని కూర్మరాజును కోరిరి. వాసుకిని కవ్వపు త్రాడుగాచేసిరి. వాసుకి తోకను దేవతలు, విషమును గ్రక్కుచున్న పడగను రాక్షసులు పట్టుకొని చిలికిరి. తొలుత 'హాలాహలము' అను అతిఘోర





మయినవిషము పుట్టెను. దాని వేడిమికి తాళలేక దేవదానవులు దూరముగా తొలగిపోయి దుఃఖించి బ్రహ్మదేవుని వద్దకు పోయిరి. "దేవా! అమృతముకొరకు చిలుకగా ఘోరవిషము పుట్టెను దానిచేత లోకములన్నియు దహింపబడు చున్నవి. లోకరక్షణము చేయుము" అని బ్రహ్మను వేడుకొనిరి. అప్పుడు బ్రహ్మ లోకేశ్వరు డగుపరమశివుని ధ్యానించెను. వెంటనే శివుడు వచ్చి లోకహితార్థమై హాలాహలమును పానముచేసి కంఠమునందు నిలుపుకొనెను. దానిచేత అతని కంఠము నల్లనై యతడు 'నీలకంఠుడు' అని ప్రసిద్ధుడయ్యెను.

దేవదానవులు సంతుష్టులై తిరిగి సముద్ర మథనమున కారంభించిరి. ఆ కదలికకు మందర శిఖరమునుండి పూవులు రాలి వారి శిరములపై పడుచుండెను. చల్లని గాలివీచి వారి శ్రమను అణచుచుండెను. మథనమువలన జలచరములన్నియు నలిగి నశించుచుండెను. పర్వతాగ్రమునుండి అనేకపక్షులు రాలి జలములో పడి చచ్చుచుండెను. ఇట్లు ఎంత కాలము చిలికినను అమృతము పుట్టలేదు. అందరును మిక్కిలి అలసిపోయిరి. ఆపైన వారికి చిలుకుట సాధ్యముకాకపోయెను. శ్రీమన్నారాయణమూర్తి వారికి నూతన బలమును ప్రసాదించి తిరిగి మథింపుడనెను. వారు నూత్నోత్సాహముతో మథింపగా కొంతసేపటికి, నల్లని జ్యేష్ఠాదేవి పుట్టెను. ఆ తరువాత చల్లని చంద్రుడు, లక్ష్మీదేవి, మదిరాదేవి, తెల్లని 'ఉచ్చైఃశ్రవము' అను గుఱ్ఱము, దివ్య ప్రభలు గల కౌస్తుభరత్నము జనించెను. అది, లక్ష్మీదేవియు శ్రీమన్నారాయణమూర్తి వక్షఃస్థలమున కలంకారము లయ్యెను. తరువాత కల్పవృక్షము, కామధేనువు పుట్టెను. ఆ రెండును ఆశ్రితులకు అన్ని కోరికలను తీర్చునవి యయ్యెను. నాలుగు దంతములతో ఐరావతమహాగజము జన్మించెను. అది శ్వేత వర్ణముగలది. అది యింద్రునివాహనమయ్యెను. పిమ్మట అప్సరసలు పుట్టిరి.

అంతట తెల్లని అమృత కలశమును చేత ధరించి ధన్వంతరి అవతరించెను. వెంటనే రాక్షసులు "అమృతము మాకు అమృతము మాకు" అని యెగసి దానిని పట్టుకొనిరి. అప్పుడు శ్రీమన్నారాయణుడు మాయామోహినీరూపమును ధరించి వారి యెదుట సాక్షాత్కరించెను. మూఢులైనదానవులు మోహితులై అమృత భాండము నామెకిచ్చిరి నారాయణుని మాయ యగునా మోహిని వరసలుగా కూర్చున్న దేవదానవులలో దేవతలకు అమృతమును త్రాపెను. దానిచేత రాక్షసులు ఆక్రోశించిరి.

అంతట అనేకాయుధములనుగొని రాక్షసులు దేవతలపై దండెత్తిరి. అప్పుడు విష్ణువు అమృత భాండమును హరించి తన ధనుర్బాణములతో రాక్షసులను ఆపుచు, దేవతలకు అమృతమును త్రాపుచు వారిని యుద్ధమునకు సన్నద్ధులను చేయుచుండెను. అప్పుడు రాహు వనుదానవుడు దేవతల వేషముతో వారిలో చేరి అమృతము పుచ్చుకొనుచుండగా చంద్ర సూర్యులు సైగచేసిరి. విష్ణువు చక్రమును ప్రయోగించి వాని కంఠమును నరికెను. తల పైకెగిరెను. మొండెము భూమిపై పడెను. అమృతస్పర్శముచేత ఆ శరీర ఖండములు రెండును అమరములయ్యె. వానికి రాహుకేతువులని పేర్లువచ్చెను. తనను విష్ణువుకు ఎరుకపరచిన చంద్ర సూర్యులను రాహుకేతురూపములలో నున్న ఆ దానవుడు 'గ్రహణ' రూపములో సర్వదా నేటికిని బాధించుచున్నాడు.

ఆ తరువాత ఘోరముగా జరిగిన దేవదానవుల యుద్ధములో నరనారాయణులు దేవతలవైపు చేరి రాక్షసులను హతమార్చి ధర్మరక్షణము చేసిరి.

## వినత దాస్యము

సముద్రమథనకాలములో పుట్టిన 'ఉచ్చైఃశ్రవము' అను గుఱ్ఱమును చూచి కద్రువ వినతతో "ఈ అశ్వము ఏ వర్ణముకలదో చెప్పుము" అని అడిగెను. 'తెల్లనిది' అని వినత చెప్పెను 'కాదు నల్లనిది' అని కద్రువ చెప్పెను "దీనితోక నల్లనిది. అట్లు కాకున్నచో నేను నీకు దాసి నగుదును, అయినచో నీవు నాకు దాసివగుము" అని కద్రువ పందెమువేసెను. దానికి వినత అంగీకరించెను. తరువాత ఇద్దరు మరునాడు వచ్చి చూతమని యింటికిపోయిరి.

ఆ రాత్రి కద్రువ తన వేయిమంది సర్పకుమారులను పిలిచి "మీలో నల్లనిరూపముగలవారు ఆ గుఱ్ఱము తోకనుచుట్టి దానిని నల్లగా కనబడజేయుడు అట్లైన నాకు దాస్యము రాదు." అని చెప్పెను. దానికి అంగీకరించని కొడుకులను "మీరు జనమేజయుని సర్పయాగములో దహింపబడుదురు గాక" అని శపించెను.

అప్పుడు 'కర్కోటకుడు' మొదలగు నాగరాజులు తల్లి శాపమునకు భయపడి గుఱ్ఱముతోకకు చుట్టుకొని దానిని నల్లపరచిరి. మరునాడు కద్రూవినతలు అక్కడికి పోయి చూచుసరికి గుఱ్ఱముతోక నల్లగనుండెను. అందువల్ల వినత కద్రువకు దాసియయ్యెను. ఇట్లు అనూరుని శాపముచేత వినత సవతికి దాసిగా నుండెను,

## గరుడోత్పత్తి

ఇంట్లుడగా వేయేండ్లగడువు గడవగనే రెండవగ్రుడ్డు స్వయముగా అవిసి అందుండి గరుడుడు పుట్టెను. అతడు జ్వలించు

మన్న అగ్నివలె మహాతేజస్సంపన్నుడై చూచువారికన్నులకు మిరమిట్లు గొలుపుచు ఒక్కసారిగా ఆకాశమునకెగిరెను. అతనిని చూచి దేవతలందరు భయకంపితులైరి. గరుడుని అనేక విధముల స్తుతించిరి. గరుడుడు ప్రసన్నుడై తన ఉగ్రరూపమును ఉపసంహరించు కొనెను. అరుణుని తన వీపుపైన ధరించి తండ్రియింటి నుండి తల్లివద్దకు వచ్చుచు, దారిలో సముద్ర తీరమునందు అరుణుని ఉంచెను.

అప్పుడు సూర్యుడు తన ఉగ్రతేజస్సుచేత లోకములను దహించుచుండెను. దానికి కారణ మేమనగా, "అతడు దేవతలకు సహాయముచేయు నుద్దేశముతో, అమృతపాన సమయమునందు వారిలోచేరిన రాహువును విష్ణువుకుతెలిపెను. అందుచేత రాహువుకు కోపమువచ్చి సూర్యుని తఱచుగ మ్రింగుచుండెను. అట్లు మ్రింగుటను చూచుచుగూడ దేవతలు సానుభూతియైన లేక ఆనందించిచూచుచున్నారు" అని సూర్యునికి దేవతలపై కోపమువచ్చి ప్రపంచమును దహింపజేయు తేజస్సుతో వెలుగుచుండెను. దానిని భరించలేక మునులు, దేవతలు బ్రహ్మదేవుని ప్రార్థించి అగ్నిని ఉపసంహరింప జేయుమనిరి. ఆయన దానికి ఉపాయముగా "అరుణుని సూర్యసారథిగా చేయుడు. సూర్యుని తేజస్సును తొలుత అరుణుడు ఆకర్షించి వెలుగును. అంతటితో సూర్యుని తేజస్సు లోకులకు సహింపదగినదిగా నగును" అని చెప్పెను. వారును, అట్లేచేసిరి. దానిచేత సూర్యునితేజస్సుతగ్గి లోకములకు క్షేమము కలిగెను. అరుణుడును సూర్య తేజస్సుచేత దేదీప్యమానుడై వెలుగుచున్నాడు.

అరుణుడు సూర్యసారథియై పోవగానే గరుడుడు వేగముగా తల్లివద్దకుపోయెను. తల్లి సవతికి దాస్యముచేయుచు అనేక బాధలను అనుభవించుచుండుటనుజూచెను. కాని యేమియుఅనజాలక ఉండెను. ఒకనాడు కద్రువ కనపడగనే వినత ఆమెకు నమస్కరించి వినమ్రయై నిలుచుండెను. అప్పుడు కద్రువ "నన్ను నీవు మోసుకొని సముద్రమధ్యము నందున్న నాగ ద్వీపమునకు కొని పొమ్ము. గరుడుడు నా పుత్రులనువహించి తీసికొనిపోవును" అని వినతను ఆజ్ఞాపింపగనే ఆమె కద్రువను భుజముపై నెక్కించుకొని నడువజొచ్చెను. గరుడుడు నాగులను మోసికొని మార్గములో సూర్యమండలమును చుట్టి పోవుచుండెను. రవితేజమును సహించ లేక సర్పములు తపించిపోయెను. కొడుకులదురవస్థకు కద్రువ దుఃఖించి యింద్రుని ప్రార్థించెను, అతడు వర్షము కురియించి నాగుల తాపమును అణచెను. తరువాత గరుడుడు వారిని తిరిగి మోసికొని సముద్ర మధ్యద్వీపమునకు గొనిపోయెను. వారు అచ్చట వనమునందు హాయిగా కొంతసేపు విహరించి, 'తమను సుందరమైన మరియొక ద్వీపమునకు గొనిపొమ్మని' గరుడుని ఆజ్ఞాపించిరి. అప్పుడు గరుడుడు తన తల్లినిచూచి "అమ్మా! నేనేల యీ సర్పములయాజ్ఞకు లోబడవలెను? దీనికి కారణ మేమి?' అని యడిగెను. దానికి ఆమె జరిగిన సంగతియంతయు నతనికి తెలిపి 'నాయనా! నేను సవతికి దాసిని, నీవు నాపుత్రుడవు గనుక నీకును దాస్యముతప్పదు" అని చెప్పెను. ఆమాట విని గరుడుడు మిక్కిలి దుఃఖించి "మీకు నేనేమిచేసినచో ఈ దాస్యము నుండి మేము విముక్తులమగుదుము" అని సర్పములను అడిగెను. దానికి వారు "అమృతము తెచ్చియి"మ్మనిరి. దానికి అంగీకరించి గరుడుడు తల్లివద్దకు పోయి "అమ్మా! నాకు అమృతమును తెచ్చు బలమువచ్చుటకు తగిన ఆహారమును సూచించుము" అనెను. "నాయనా! సముద్రమధ్యములో నిషాదులపురము కలదు. వారినందరిని నీవు పట్టి భక్షింపుము. మంచి తేజోబల సంపన్నుడవగుదువు. బ్రాహ్మణుని మాత్రము భక్షింపకుము. నీవు జీర్ణముచేసికొనలేవు" అని వినత అనెను. "చేపలవారిని తినునప్పుడు బ్రాహ్మణుని నేనెట్లు గుర్తుపట్ట గలుగుదునో తెలుపు" మని గరుడుడు అడిగెను. దానికామె 'ఏ వ్యక్తిని మ్రింగునప్పుడు నీ గళమునందు అతడు గాలమువలె అడ్డపడి దహించునో అట్టివాడు బ్రాహ్మణుడని గ్రహించి విడిచివేయుము" అని చెప్పి ఆశీర్వదించి పంపెను. గరుడుడు పోయి నిషాదులను భక్షింప జొచ్చెను. అందొక బ్రాహ్మణుడు తన భార్యతోపాటు గరుడుని నోటిలోపడి అతని కుత్తుకను గాలమువలె బాధించి దహింప జొచ్చెను. గురుడు డతడు బ్రాహ్మణుడనితలచి వానిని తొలగి పొమ్మని వేడుకొనెను. ఆ బ్రాహ్మణుడు "నా భార్య నిషాద స్త్రీ. ఆమెనుగూడ నాతోపాటువిడిచినచో నేను పోయెదను. లేకున్న నీ కంఠమునకు ఇట్లే అడ్డుపడి నిన్ను బాధించుచుందును" అని చెప్పగనే గరుడుడు అతనిని భార్యతోపాటు విడిచెను.

ఇట్లు చేపలవారిని భక్షించి గరుడుడు ఆకాశ మార్గమున పోయి తండ్రియగు కశ్యపుని దర్శించెను. అతడాశీర్వదించి "నాయనా! మీరందరు కుశలురా? ఎక్కడకు పోవుచున్నావు?" అని అడిగెను. గరుడుడు జరిగిన సంగతిచెప్పి "తండ్రీ! నాకింకను ఆకలి తగ్గలేదు. కనుక అమృతము తెచ్చుటకు తగిన శక్తిని గలిగించు ఆహారమును నాకు ప్రసాదించుము" అని వేడుకొనెను.

కశ్యపుడు పుత్రుని కరుణించి, "నాయనా! పూర్వము విభావసుడు అనుపేరుగల ఒకముని యుండెను. అతని సోదరుడు 'సుప్రతీకుడు' అనువాడు. అతడు సోదరునినుండి ధనమును పంచుకొనదలచెను. సోదరులకు భాగము పంచుకొనుట తగదని విభావసుడనెను. సుప్రతీకుడు అంగీకరించక వివాదము చేసెను. విభావసుడు కోపముతో 'నీవు ఏనుగువు కమ్ము' అని శపించెను. సుప్రతీకుడును 'నీవు తాబేలువు కమ్ము' అని విభావసునకు ప్రతి శాపమిచ్చెను. ఆ గజకచ్ఛపములు సర్వదా పోరాడుచు ఈ సమీప మునందలి సరస్సులో నున్నవి. ఆ రెంటిని నీవు భక్షించినచో మహా బలసంపన్నుడవై యెవరికిని అజయ్యుడవయ్యెదవు" అని కశ్యపుడు చెప్పగనే గరుడుడు తన నఖములతో ఆ రెండు జంతువులను గ్రుచ్చి పైకెత్తి ఆకాశమున కెగరెను. వాటిని పెట్టుకొని తినుటకు తగిన విశాల ప్రదేశము వెతుకజొచ్చెను. వనములో 'రౌహిణము' అను నొక మహావృక్షమును చూచెను. దాని కొమ్మ ఒకటి అనేక యోజనముల పొడవు, వెడల్పుగలిగి యుండెను. దానిపైన కూర్చొని గజకచ్ఛపములను తినదలచి వ్రాలగనే ఆ కొమ్మ యితని భారమునకు విరిగెను. అది క్రింద పడుచుండగా దానిని పట్టుకొని తలక్రిందుగా వ్రేలాడుచు తపస్సు చేయుచున్న వాలఖిల్యాది మహామునులనుచూచెను. అవి పడినచో

వారు నశింతురని భయముచేత ఆ మహాశాఖను తన ముక్కుతో కరచి క్రిందపడకుండ పట్టుకొని ప్రపంచమంతయు తిరుగుచు గంధమాదన పర్వతమునందు తపస్సుచేయుచున్న తండ్రి కశ్యపుని వద్దకువచ్చెను. మహాబలుడై రెండుచేతులతో గజకచ్ఛపములను, ముక్కుతో మహావృక్షశాఖను కరచుకొనివచ్చుచున్న పుత్రునిచూచి సంతసించి, దానికి వ్రేలాడుచున్న వాలఖిల్యాదులను కశ్యపుడు ప్రార్థించి వారు దానిని విడిచిపోవునట్లుగా చేసెను. వారును గరుడుని ఆశీర్వదించి తపస్సు చేసికొనుటకు హిమాలయమునకు పోయిరి.

తండ్రియాజ్ఞచేత గరుడుడు ఆశాఖను అట్లేకరచుకొని 'నిష్పురుషము' అను పర్వతమునకుపోయి అక్కడ ఆ శాఖను పడవైచి గజకచ్ఛపములను భక్షించి అధిక తేజోబలములు కలవాడై స్వర్గమునకెగసెను. మహాతేజస్సుతో వచ్చుచున్న ఇతనిని చూచి దేవతలందరు మిక్కిలి భయపడిరి. ఇంద్రుడు యితడెవడని బృహస్పతిని విచారించెను. ఆయన "ఇదియంతయు నీవుచేసిన అపరాధమునకు ఫలమే. ఇతడు వాలఖిల్యుల తపోమహిమచేత కశ్యపునకు పుట్టిన మహాతేజశ్శాలి. నీకంటె బలవంతుడు'' అని చెప్పెను. అతడు గొప్పగా పైకి ఎగురుచుండెను గనుక "గరుడుడు"అను పేరుతో దేవతలు పిలిచిరి. అతనితో యుద్ధము చేయుటకు దేవతలందరు సన్నద్ధులై యుండిరి.

శౌనకుడు, "పూర్వము ఇంద్రుడేమి తప్పుచేసెను? కశ్యపునకితడెట్లు వాలఖిల్యుల మహిమతో పుట్టెను? ఆ కథ చెప్పుము" అని సూతపుత్రుని అడిగెను. అతడిట్లు చెప్పదొడగెను.

పూర్వము కశ్యపుడు పుత్రులకొరకు 'పుత్రకామేష్టి' అను యాగమును చేయతలపెట్టెను దేవతలు, ఋషులు సహాయము చేసిరి. వాలఖిల్యాది మునులతో కలిసి ఇంద్రుడు యజ్ఞార్థమై సమిధలు తెచ్చుచుండెను. అతడు మహాబలిశాలి గనుక పెద్ద కట్టెల మోపును తెచ్చుచు ఒక్కొక కట్టెనే మోసికొని తడబడుచు వచ్చుచున్నమహాతపస్సంపన్నులగు వాలఖిల్యాదులను చూచి పరిహసించెను. వారు కోపించి యింద్రుని కన్న బలవంతుడగు మరియొక యింద్రుని పుట్టింపదలచి మహాయజ్ఞమును చేయుటకు ఆరంభించిరి. ఇంద్రుడు భయపడి కశ్యపుని శరణువేడెను. అతడు వాలఖిల్యులను శాంతింపజేసి యజ్ఞమును ఆపి ఇంద్రుని ఆశీర్వదింపుడని వేడుకొనెను. వారును శాంతించి మాసంకల్పము వ్యర్థముకాదు కనుక ఇతని కంటె అధిక బలశాలి 'పక్షీంద్రుడు' పుట్టును. నీవు పుత్రకామేష్టి చేయుచున్నావు గనుక ఆతడు నీకు పుట్టుగాక'' అని చెప్పిరి. ''ఆ విధముగానే గరుడుడు కశ్యపపుత్రుడుగా జనించి నీపై దండెత్తుటకు వచ్చినాడు. ఇతని జన్మమునకు నీవు వాలఖిల్యాదులను దూషించుటయే కారణము. కనుక ఇకనైనను మహాత్ములను పరిహసించి దూషించకుము" అని బృహస్పతి యింద్రునికి గరుడోత్పత్తి ప్రకారమును చెప్పెను.

## అమృత హరణము

తరువాత గరుడుడు దేవతలతో యుద్ధమునకు ఆరంభించెను. అమృతరక్షకుడైన 'భౌమనుడు' అనువానిని హతమార్చెను. తన రెక్కలచేత, ముక్కుచేత దేవతలను చీల్చుచు స్వర్గమంతయు గగ్గోలుపరచెను. వాయువును ఓడించెను. దిక్పాలకులను ఇతరదేవతలను ఓడించెను. ప్రళయకాలరుద్రునివలె అతి భీకరముగా గరుడుడు యుద్ధముచేసి సముద్రములోదూరి అమృత కలశమును సమీపించెను. దాని చుట్టు పదునైన అంచులుగల చక్రము తిరుగుచు ఎవరిని దానివద్దకు రానీయకుండెను. సూక్ష్మ శరీరముతో గరుడుడు ఆ చక్రము సందులోనుండి దూరి క్రిందికి పోవగా అక్కడ అతిభయంకరములైన రెండు సర్పములు అమృతమును కాపాడుచుండెను. ఆ సర్పములను చీల్చి క్రిందికి పోయి అమృత కలశమును హరించి విష్ణువు సన్నిధికి వచ్చెను. ఆయన యితని పరాక్రమమును ప్రశంసించి వరమువేడుమనెను. "నేను నీకంటె పైభాగమున నుండునట్లును, అమృతపానముచేయకున్నను అజరామరుడనై యుండునట్లును వరమిమ్ము" అని వేడెను. ఆయన ప్రసాదించెను. గరుడుడు విష్ణువుతో "నీవు భగవంతుడవైనను నీకు వరమిచ్చెనదను, కోరుకొనుము" అని అడిగెను. అప్పుడు విష్ణువు "నీవు నాకు వాహనముగా నుండుము. నీవు కోరిన వరము ప్రకారము నీవు నాపైన నాధ్వజములో నుందువు. నేను కోరిన వరము మేరకు నా అడుగున నాకు వాహనముగా నుందువు". అని చెప్పెను. దానికి గరుడుడు సంతుష్టుడై అమృత భాండముతో ఆకాశమునందు ఎగిరిపోవుచుండగా ఇంద్రుడు వజ్రాయుధముతో అతని రెక్కను గొట్టెను. అదిచూచి గరుడుడు ''ఇంద్రునితో నీ ఆయుధము నన్నేమియు చేయజాలదు. అయినను ఈ వజ్రాయుధము దధీచి మహాముని యెముకచే చేయబడినది గనుక ఆ మునీశ్వరునిగౌరవార్థము, త్రిలోక పతియగు నీకు అవమానము కలుగకుండుటకుగానున్న ఈ నారెక్కను విడిచెదను. దీని అంతమును ఎవరును కనుగొనజాలరు" అని చెప్పి రెక్కను విడిచెను. దానిని చూచి దేవతలందరు అతని రెక్కల బలమును స్తుతించి అతనికి "సుపర్ణుడు" (దృఢమైన రెక్కలుగల వాడు) అని నామకరణముచేసి పొగడిరి. అప్పుడు ఇంద్రుడు అతని బలమునుజూచి అతనితో స్నేహమును కోరెను. గరుడుని బలము యొక్క ప్రమాణమును తెలియగోరెను. అప్పుడతడు సంతోషించి యింద్రునితో స్నేహముచేసి 'ఆత్మస్తుతి చేసికొనగూడదు, కాని మిత్రుడవు. అడిగితివి. గనుక వస్తుస్థితిని చెప్పుచున్నాను. ''గిరి సాగర విపినములతో గూడిన సర్వలోకములను నేను ఒక రెక్కతో వహించగలను. ఇదినాబలము" అని చెప్పెను. ఇంద్రుడు సంతసించి గరుడుని మిత్రునిగా భావించి 'నీకు అమృతముతో అవసరములేకున్నచో నాదగ్గరనే ఉండనిమ్ము. నీవు దీనిని ఎవరికిచ్చెదవో, వారు దీనిని త్రాగి మమ్ము బాధించెదరు. స్నేహధర్మమును పురస్కరించుకొని అమృతమును దేవలోకమునుండి తీసికొని పోవద్దు." అని ప్రార్థించెను. గరుడుడు "దీనితో నాకుపని లేదు. ఒక కార్యము కొరకు కొని పోవుచున్నాను." అని సంగతి యంతము తెలిపి, "అమృతమును సర్పములు త్రాగకుండ చేసెదను. నేను దీనిని వారి యెదుట ఉంచి మాదాస్యవిముక్తి చేయించుకొనగానే నీవు హరించి తెచ్చుకొనుము." అని ఉపాయము గరుడుడు చెప్పెను.



ఇంద్రుడు సంతసించి వరము కోరుమనెను. గరుడుడు తనకు సర్పములు ఆహారముగునట్లు వరమిమ్మనెను. ఇంద్రుడు వర మిచ్చి అమృతకలశమును కొని పోవుచున్న గరుడుని అనుసరించి పోయెను.

గరుడుడు అమృత భాండమును కొనిపోయి తల్లికి నివే దించగా ఆమె మిక్కిలి సంతోషించి కుమారుని బలమును మెచ్చు కొని ఆశీర్వదించెను. గరుడుడు అమృతము కద్రువ యెదుట దర్భలపై నునిచి "మీరు స్నానముచేసి పవిత్రులై వచ్చి దీనిని త్రాగుడు. మీమాట నెరవేర్చితిని. నా తల్లికి, నాకును ఇంతటితో దాస్యవిముక్తి కలిగినది. ఇంక మేముపోయెదము." అని చెప్పి తల్లితో దాస్య విముక్తుడయ్యెను. సర్పములు స్నానా ర్థమై యేగెను. ఇంద్రుడు అమృతకలశమును హరించి తీసుకొని పోయెను. సర్పములు తిరిగి వచ్చి అమృతమును కానక దుఃఖించి అమృతముంచిన దర్భలు నాకెను. తీక్ష్ణములగు దర్భల అంచులతో సర్పముల నాలుకలు కోసికొని రెండుగా చీలెను. అప్పటి నుండి సర్పములకు "ద్విజిహ్వలు" అని పేరువచ్చెను. అమృత స్పర్శచేత దర్భలు నాటినుండి పవిత్రములయ్యెను. అందుకే నేడును శుభాశుభ కర్మలయందు దర్భలను వాడుచున్నాము. "ఈ గరుడోపాఖ్యానమును విన్నవారికి స్వర్గసుఖమబ్బును" అని సూత పుత్రుడు శౌనకునకు చెప్పి తరువాతి వృత్తాంత మిట్లు చెప్పదొడగెను :—

సర్పరాజైన శేషుడు ధర్మప్రవృత్తి కలవాడై గంధమాదన పర్వతమునకుపోయి బ్రహ్మనుగూర్చి ఘోరతపస్సు చేసెను. ఆ దేవుడు ప్రత్యక్షమై వరము వేడుమనెను. "నాకు సోదరులతోను, తల్లితోను ఉండుటకు ఇష్టములేదు. వారు అధర్మపరులు, కనుక మార్గాంతరమును ఉపదేశింపుడు. మహా బలశాలియగు గరుడునితో మైత్రి సంధింపదలచియున్నాను." అని వేడుకొనెను. బ్రహ్మ దేవుడు ప్రసన్నుడై "అట్లేకానిమ్ము. నీవు అత్యంత ధర్మబుద్ధి గలవాడవగుదువుగాక. సర్వదా యీ భూభారమును వహించి యుండుము. దానివలన నాకుగూడ భూభరణ క్లేశము కొంత తగ్గును నీకు మేలగుగాక" అని వరమిచ్చి అంతర్ధానముచెందెను. నాటినుండి బ్రహ్మ ఆనతిచేత ఆదిశేషుడు సహస్ర ఫణములపైన భూమిని వహించి సమస్త ప్రపంచమునకు ఆధార భూతుడుగా నున్నాడు. అతనికి గరుడుడు అండగా నుండగలడని కూడ బ్రహ్మ వరమిచ్చెను.

ఇట్లు శేషుడు అధర్మపరులైన సోదరులను వీడి సుఖముగా భూమిని భరించుచు లోకసేవచేయుచుండెను. ఆ తరువాత సర్ప ములు నాగలోకమునకు వాసుకిని రాజుగా పట్టాభిషిక్తుని చేసెను.

వాసుకి, తల్లి యిచ్చిన శాపమునకు చింతించి దానిని తొలగించుటకు సోదరులతో మంత్రులతోను ఆలోచనలు సలిపెను. "గుడ్డును తోకను నల్లచేయుమని చెప్పుట అన్యాయము. అట్లు చేయనందున తల్లి జనమేజయ సర్పయాగమున మనమందరము నశించునట్లు శపించుట ఎంతో అన్యాయము. ఇట్టి తల్లి లోకములో నుండదు. ఈ అపాయమునుండి మనము తప్పించు కొనుటకు ఏలాగైనను జనమేజయుని సర్పయాగమునకు భంగము కలిగించవలెనని అనేక విధములుగ వారు ఆలోచించిరి. మనము బ్రాహ్మణ వేషములో పోయి యజ్ఞముచేయకుమని జనమేజయుని ప్రార్థింతమని కొందరు, అతనికి మంత్రులముగా చేరి యజ్ఞమును ఆపుటకు ఉపదేశింతము అని కొందరు, యజ్ఞము చేయించు పురో హితుని, ఋత్విక్కులను మనము కరచి చంపుదము అని మరి కొందరు, అది తప్పు. బ్రాహ్మణ వధ చేయకూడదు. దానివలన జగత్తునకే నాశము సంభవించును అని కొందరు, హోమాగ్నిని ఆర్పుదము, యజ్ఞశాలలోనిప్రేక్షకజనమును కరచిచంపుదము, హవ్యద్రవ్యమును మన విషముచే, మూత్రపురీషములచే, అయోగ్యము లొనరింతము. లేక మనమే ఋత్విక్కులముగా కుదిరి యజ్ఞవిఘ్నము చేయుదము. అతడు జలక్రీడ చేయుచుండగా తీసి కొని వచ్చి బంధించుదము. లేక అతనినే కరచి చంపుదము. అని అనేకులు సర్పరాజులు తమ తమకు తోచిన విధముగ యజ్ఞ భంగోపాయములను వాసుకికి చెప్పిరి.

వారి మాటలు విని వాసుకి, "మీరు చెప్పిన దంతయు నా బుద్ధికి నచ్చుటలేదు. మనము కశ్యపుని ప్రసన్నునిగ చేసి యీ కార్యము సాధించిన బాగని తోచుచున్నది. ఐనను నాకేమియు పాలు పోకున్నది." అని అనెను. ఆ మాటలువిని ఏలాపుత్రుడు అను సర్పరాజు ఇట్లనెను. "మనకు దైవమే యీ బాధను కలిగించి నాడు కనుక దైవమునే ఆశ్రయించి దీనిని తరించవలెను. మన తల్లి శాపమిచ్చునప్పుడు నేనొక మాట విన్నాను. దేవతలందరు బ్రహ్మవద్దకు పోయి సర్పములను శాపమునుండి కాపాడుమని వేడిరి. అప్పుడు బ్రహ్మదేవు డిట్లనెను:— అనేక సర్పములు విషముతో అధర్మముగా లోకులకు అపకారము చేయుచున్నవి గనుక అట్టివాటికి నాశము తప్పదు. ధర్మపరులైన పన్నగులకు

నాశము కలుగదు. జయమేజయుని యాగమునందు సర్పనాశము సంభవించుచున్నప్పుడు యాయావరకులములో పుట్టిన జరత్కారునికి సుతుడైన ఆస్తీకుడు ధర్మాత్ములైన సర్పములకు యాగములో రక్షణము కల్పించగలడు (జరత్కారునకు, వాసుకి చెల్లెలైన జరత్కారువునకు వివాహము జరిగినట్లు పూర్వమే తెలుపబడినది.) తనకు ఇష్టముకాని పని జరిగిననాడు భార్యను విడిచి పోయెదనని జరత్కారుడు ఒడంబడిక చేసికొని యుండెను.

జరత్కారువు, పతికి అనుకూలముగా పరిచర్యలు చేయుచు కాలము గడుపుచుండెను. ఆమెకు గర్భధారణము జరిగెను. ఒకనాడు జరత్కారుడామె తొడపై తలమోపి నిద్రించి యుండెను. కొంతసేపటికి సూర్యుడస్తమించెను. సాయం సంధ్యావందనాది ధర్మ కార్యములకు లోపము సంభవించుచున్నదని ఆమె అతనిని మేల్కొలుపదలచెను. 'అట్లు చేయుట అతనికి అప్రియమై తనను విడిచిపోవునేమో యని భయపడెను. ఇట్లు ఆమె ఆందోళనపడుచు తుదకు భర్తకు కోపము వచ్చినను సరియే కాని ధర్మమునకు లోపము రాకూడదని అతనిని మేల్కొలిపెను. అతడు లేచి మిగుల కోపముతో "నాకు అవమానము చేసితివి. నీవద్ద ఉండను. పూర్వ నిర్ణయము ప్రకారము నిన్ను విడిచి పోయెదను. సంధ్యాకాలమునందు నిద్రించినచో ధర్మలోపమగునని నీవు భయపడి నన్ను లేపితివి. నేను మేల్కొనకుండగా సూర్యుడు అస్తమించగలడా ? అంతటి శక్తి అతనికిలేదు." అని చెప్పి ఆమె యెంత ప్రార్థించినను అతడు వినిపించుకొనలేదు. అప్పుడామె " నేను ధర్మ మార్గమునందే యుండి ఇంతగా పరిచర్య చేసి నిన్ను సేవించితిని. నన్ను నీకిచ్చి వివాహము చేయుటవలన గలుగు ఫలము సిద్ధించలేదు. మనకొడుకు నా మాతృవంశీయులైన సర్పములను జనమేజయ యాగమునుండి రక్షించుటకు గదా మావారందరు ఈ మన వివాహముచేసిరి. అస్పష్ట గర్భముతోనున్న నన్ను విడిచిపోవదగునా ?" అని ప్రార్థించెను. ఆ మాటకు జరత్కారుడు " నీ గర్భమునందు అగ్ని సమాన తేజస్సుగల కొడుకు పెరుగుచున్నాడు అతడు మీవారి యిష్టార్థమును తీర్చగలడు." అని చెప్పి ఆమెను విడిచి తపస్సునకు వెడలి పోయెను.

తరువాత జరత్కారువు వాసుకివద్దకు పోయి జరిగిన వృత్తాంతమును చెప్పి దుఃఖించెను. గర్భములో శిశువు ఉన్నాడను సంగతి తెలిసి వాసుకి శాంతించెను. ఆ శిశువే 'ఆస్తీకుడు'. అతడు సర్పములను జనమేజయ యాగమునుండి రక్షించునని పూర్వము బ్రహ్మ చెప్పియుండెను. పుత్రుడు 'అస్తి' (ఉన్నాడు) అని తండ్రి చెప్పిపోయినాడు గనుక ఆ శిశువునకు 'ఆస్తీకుడు' అని పేరు పెట్టి జాగ్రత్తగా వాసుకి పెంచుచుండెను.

## పరీక్షిత్తు చరిత్ర :

జనమేజయునికి మంత్రులు పరీక్షిత్తు వృత్తాంతమును ఈ విధముగా చెప్పిరి :-

పరీక్షిత్తు మూర్తీభవించిన ధర్మమోయనునట్లు రాజ్యపాలనము చేయుచుండెను. అతడు కురువంశమంతయు పరిక్షీణమైన తరువాత జనించినవాడు కనుక 'పరిక్షిత్తు' అను పేరును గలిగి యుండెను. అశ్వత్థామ 'బ్రహ్మశిరస్సు' అను నస్త్రమును పాండువంశ నాశార్థమై పరిక్షిత్తు తల్లియగు 'ఉత్తర' గర్భమునకు ప్రయోగించినప్పుడు కృష్ణభగవానుడు గర్భమును రక్షించి తనను కాపాడెను. తాను పుట్టగనే తనను కాపాడిన భగవంతుని నలువైపుల పరీక్షించి చూచెను గనుక 'పరీక్షిత్తు' అని మరియొక పేరును గలిగియుండెను.

అరువది సంవత్సరముల యీడువచ్చు వరకు రాజ్యమును పాలించెను. అతనికి వేటయందు వ్యసన ముండెను. ఒకనాడు వేటలో ఒక మృగమును బాణముతో కొట్టెను. అది దెబ్బతిని పరుగిడిపోయెను. దానిని వెతకుచు పరీక్షిత్తు కాలినడకతో అడవి తిరిగి పరిశ్రాంతుడయ్యెను. మృగము కనపడలేదు. ఆకలి దప్పులచే బాధపడెను. ఒక మునిని చూచెను. అతని పేరు 'శమీకుడు'. మృగము సంగతి ఆ మునిని అడిగెను. అతడు బదులు చెప్పలేదు పరీక్షిత్తుకు కోపమువచ్చి చచ్చిన పామును ధనుస్సు కొనతో తీసి అతని మెడపైన వేసిపోయెను. ధ్యాన నిమగ్నుడై యున్న ఆ ముని అది యేమియు నెరుగక ఊరకుండెను

కొంతసేపటికి శమీక మహామునికి గోవునందు పుట్టిన కుమారుడు మహాతపశ్శాలి యగు 'శృంగి' వచ్చి తండ్రికి జరిగిన అవమానమును మిత్రులవలన వినెను. వెంటనే తండ్రి కడకుపోయి చూచి సర్పమును తీసివేసెను. మహా కోపముతో 'నాటికి యేడవ నాడు తక్షక సర్పదష్టుడై ఆ రాజు చచ్చిపోవుగాక, అని శాపమిచ్చెను తండ్రి తపస్సమాధినుండి లేచిన తరువాత జరిగిన వృత్తాంతము చెప్పెను శృంగిచేసిన పనిని తండ్రి అభినందించలేదు. " నాయనా! తపస్సంపన్నుడవైన నీ కింత కోపము తగదు కోపము తగ్గి శాంతుడవగుటకు నీవు తపస్సు చేయుము. శమముచేతనే బ్రహ్మపదము నందగలవు. మనము ఆ రాజు **పరిపాలనలో** క్షేమముగా తపస్సు చేసికొనుచున్నాము. అతడు ధర్మరక్షకుడు. మన యాశ్రమమునకు వచ్చినవానికి ఆతిథ్య మీయనిదోష మటుండగా అతనికి శాప మిచ్చుటయా ? నీవు తప్పుచేసితివి. అతడు పోయినచో మరల అంతటిధర్మాత్ముడైన రాజు మనకు లభించునా ? మృత సర్పమును నాపైన వేసినంత మాత్రమున నాకు లోప మేమి ? అని అనేకవిధములుగ శృంగిని మందలించి శమీకుడు 'గౌరముఖుడు' అను శిష్యుని పరీక్షిత్తు కడకు పంపెను. అతడు పోయి కుశలప్రశ్న పూర్వకముగా రాజునకు జరిగిన వృత్తాంతమును నివేదించి మరణనివారణోపాయమును చూచుకొనుమనియు, బాలుడు తెలియక చేసినపొరపాటునకు అన్యథా భావించకుమనియు గురవాజ్ఞగా చెప్పెను. రాజు మిక్కిలి వ్యథచెంది, చేయునదిలేక పశ్చాత్తాపపడి గౌరముఖుని సత్కారపూర్వకముగా వీడుకొలిపి తనకు గలుగు మరణమునకు నివారణోపాయమును మంత్రులతో చింతించెను. మంత్రుల సలహా ప్రకారము ఒంటిస్తంభము మేడ కట్టించి అందులో తాను నివసించుచుండెను దానిచుట్టు రక్షణమును జాగ్రత్తగా కల్పించెను. మహా వైద్యులను ఓషధులతోపాటు సర్వదా తనయొద్ద నుంచుకొనెను. ఎవరికికూడ లోపల ప్రవేశము లేకుండ జేసెను.



ఆరుదినములిట్లుగడచెను. ఏడవ నాడు 'కాశ్యపుడు' అను బ్రాహ్మణుడు ఈ వృత్తాంతమును విని రాజుకు చికిత్స చేసి ధనము, ధర్మము సంపాదించుకొనుటకు హస్తిపురికి వచ్చుచుండెను. అతడు గొప్ప విషవైద్యుడు. బ్రాహ్మణ వేషముతో రాజును కరచి చంపుటకు వచ్చుచున్న తక్షకుడు దారిలో కాశ్యపుని చూచెను. ఎక్కడికి పోవుచున్నావని ప్రశ్నించెను. కాశ్యపుడు "తక్షక విషాగ్నిచే దగ్ధుడు కానున్న రాజును బ్రతికించుటకు పోవుచున్నాను" అనెను. "నేనే తక్షకుడను. నా విషమును శాంతింపజేయు శక్తి యెంతటి విషవైద్యునకైనను ఈ పదునాల్గు లోకములలో లేదు. వృథా ప్రయాసపడకుము" అని తక్షకుడు చెప్పెను. "ఎట్టి విషమైనను నా శక్తికి అణగిపోవలసినదే" అని కాశ్యపుడనెను. అతనిని పరీక్షింపదలచి తక్షకుడు ఆసమీపమున నున్న యొక పెద్ద వటవృక్షమును కఱచి భస్మముచేసెను. వెంటనే ఆ బూడిదను ప్రోగుచేసి కాశ్యపుడు మంత్రించెను. మంత్ర ప్రభావముచేత అది యెప్పటివలె పచ్చని మఱ్ఱిచెట్టు అయ్యెను. తక్షకుడు ఆశ్చర్యము, భయము కలవాడై 'ఓ బ్రాహ్మణా! నీవంటి మునీంద్రుని అవమానపరిచి, యొక మునీంద్రునిచే శపింపబడిన రాజును నీవు రక్షింపకూడదు. నీకు ధనాశయున్నచో రాజువలన నీవు సంపాదించదలచుకున్న ధనమునకంటె ఎక్కువగా నిచ్చెదను. తిరిగిపొమ్ము.' అని తక్షకుడనెను. కాశ్యపుడు దివ్యదృష్టితో చూచి ఆ రాజుకు ఇంతకన్న ఆయుష్యము అధికము లేదని తెలిసికొనెను. బ్రహ్మ నిర్మితమైన ఆయుస్సుకంటె ఎక్కువ యీయజాలనని నిశ్చయించుకొని ఆ బ్రాహ్మణుడు తక్షకునినుండి అధికధనమును పొంది తిరిగి తన యింటికి పోయెను.

తక్షకుడు పంపిన నాగరాజులు బ్రాహ్మణ వేషములను ధరించి ఫల పుష్పములు రాజునకు ఆశీర్వాదరూపముతో నిచ్చుటకు ఆ భవనములోకి పోయిరి. తపస్వులు కదా యని వారి నెవరును అడ్డగించలేదు. వారు ఆశీర్వదించి యిచ్చిన పండును పరీక్షిత్తు తినెను. అందులో తక్షకుడు పురుగుగా చేరియుండెను. పండు విప్పగానే సర్పాకారముతో బుస్సుమనుచు తక్షకుడుపైబడి రాజును కఱచెను. పరీక్షిత్తుతోపాటు ఆ భవనముగూడ విషాగ్నిచేత దగ్ధమయ్యెను" అని మంత్రులు చెప్పిన కథ విని జనమేజయుడు తీవ్ర కోపముచేత ఎట్లైనను సర్పయాగము చేసి నాగకులమును తక్షక సహితముగా దహించవలెనని నిశ్చయించుకొని దానికి తగు సన్నాహములను చేయించి యాగమారంభింపబోయెను.

అప్పుడొక వాస్తుశాస్త్రజ్ఞుడు జనమేజయుని సమీపించి "రాజా! నీవు ఏ ప్రదేశమును, ఏ కాలమునందు యజ్ఞశాల కొరకు కొలిపించి శాలను నిర్మించినావో ఆ లక్షణములను, కాలమును బట్టి యీ యాగము నిర్విఘ్నముగా నెరవేరదు. నడుమనే యొక బ్రాహ్మణుని మూలముగా నిది యాగిపోవును" అని చెప్పెను. అది విని రాజు "నా యాజ్ఞలేక యెవరినిగూడ యాగశాలలోనికి విడువవద్దు" అని ద్వారపాలకులను ఆజ్ఞాపించి యజ్ఞమును ఆరంభించెను.

మహా విద్వాంసులు, కర్మఠులు, మునీశ్వరులునైన అనేక ఋత్విక్కులు మంత్రపఠనము చేయుచు సర్పములను ఆహ్వానించుచు హోమము చేయుచుండిరి. అనేక సర్పములు బ్రాహ్మణ మంత్రములకు లోబడి హోమకుండములో పడి చచ్చుచుండెను. తక్షకుడు ఇంద్రుని శరణుజొచ్చి అతనివద్ద దాగియుండెను. ఈ సంగతి తెలిసి ఋత్విజులు "సహేంద్ర తక్షకంస్వాహా" అని పఠించి తక్షకునితోపాటు ఇంద్రునిగూడ ఆహ్వానించిరి. ఇరువురును హోమములో హవ్యములు కావలసివచ్చెను. దూరమునుండి చూచి యింద్రుడు బెదరి తక్షకుని విడిచి తిరిగిపోయెను. తల్లి జరత్కారువు కోరికపై ఆస్తీక మహాముని జనమేజయుని సర్పయాగమును మాన్పించుటకు యాగశాలకు వచ్చుచు తక్షకుని అవస్థచూచి "అచ్చటనే నిలు నిలు" మని అంతరిక్షమునందే తక్షకుని ఆపి యాగశాల చేరెను. ద్వారపాలకులు రాజాజ్ఞ ప్రకార మతనిని లోపలకి పోనీయలేదు. అప్పుడు ఆస్తీకుడు ద్వారమునందే నిలచి అనేక విధములుగ జనమేజయుని, ఋత్విజులను, యాగమును, తద్విధానమును స్తోత్రము చేసెను. దానికి సంతుష్టుడై జనమేజయుడు ఋత్విక్కుల సమ్మతిపైన ఆస్తీకుని లోపల ప్రవేశింప జేసెను. ఆస్తీకుని వరము వేడుమని రాజు కోరెను. "సర్పయాగమును ఆపుము" అని వరము కోరెను. "ఇంకనేమైనను ధన ధాన్యాదులు అనేకములు కోరుము. ఇది వద్దు." అని యెంత చెప్పినను ఆస్తీకుడంగీకరించలేదు. దానికి రాజు మాటతప్పక అతనికి వరమిచ్చి యాగమును ఆపెను.

తక్షకుడును, ఇతర వాసుక్యాది సర్పములును ఆస్తీకునిచేత ఈ విధముగా రక్షింపబడి సంతోషించిరి. ఈ కథ విన్నవారికిని, ఆస్తీకుని స్మరించిన వారికిని సర్పభయము ఉండదు, అని సర్పరాజులు ఆస్తీకునికి వరమిచ్చి వెడలిపోయిరి.

( సశేషము )



శ్లో॥ స్వేచ్ఛాభంగురమేఘభాగ్యతటితః శక్యా న రోద్ధుం శ్రియః
ప్రాణానాం సతతప్రయాణపటహశ్రద్ధా న విశ్రామ్యతి।
త్రాణం యేఽత్ర యశోమయే వపుషి వః కుర్వంతి కావ్యామృతైః
తానారాధ్య పదే నిధత్త సుకవీన్ నిర్గర్వముర్వీశ్వరాః॥

—బిల్హణ మహాకవి

"ఓ రాజుల్లారా! నశ్వరములైన మెఱపులవంటివి సంపదలు. మీ ప్రాణము లెప్పుడును పయనించుచుండును. కనుక మీ కీర్తి శరీరమునందు మిమ్ము తమకావ్యామృతములచేత శాశ్వతముగా నిలుపగల కవీశ్వరులను సేవించి మీరు గర్వము వీడి వారిని ఉన్నత స్థానమునందు అలంకరించుడు."

శ్లో॥ అరత్నాలోకసంహార్యం, అవార్యం సూర్యరశ్మిభిః,।
దృష్టిరోధకరం యూనాం యౌవనప్రభవం తమః॥

—దండి మహాకవి

"మానవులకు యౌవనదశయందు కలిగిన అంధకారము (అజ్ఞానము) వారి జ్ఞానదృష్టిని నిరోధించును. అది రత్నకాంతుల చేత నశించదు, సూర్య ప్రకాశముచేత అడ్డగింపబడదు.

తే॥ గీ॥ ఈశుఁ దలఁచుమహాత్ములహృదయములును గాడ నోపనిమృదుపుష్పకాండనికర
మతని భేదింప నోపునే యంగజన్మ! తమ కసాధ్యుల సాధింపఁ దలఁపఁ దగునె!

—నన్నెచోడదేవ

కం॥ జనపతి పర్జన్యుగతిన్। దనభూపప్రజఁ బ్రోవవలయుఁ, దగఁ బ్రోవఁడయేన్
దనుఁ బాసి పోవు నాప్రజ ఘనసీరసనరసిఁ బాయుఖగములభంగిన్.

—కాకతి ప్రతాపరుద్రదేవుడు

మ॥ కలయన్ గాష్ఠయుగంబుఁ గూర్చి తరువంగాఁ బుట్టి తత్సాధనం
బుల రెంటిన్ దహియించువహ్నిగతిఁ దాఁ బొల్పొందఁ గాయంబు సం
ధిల సత్కర్మముతో మథింపఁగ భవచ్చిద్భక్తిసద్వహ్ని యు
జ్జ్వల మై కాయముఁ గర్మమున్ జెరచుఁ దత్త్వం బెన్న సర్వేశ్వరా!

—యథావాక్కుల అన్నమయ్య

"రెండు కొయ్యలను (రావి-జమ్మి) చేర్చి తరిమెనబట్టగా అగ్ని పుట్టును. అది తనకు జన్మకారణమైన ఆ రెండు కట్టెలను దహించును గదా! ఆ విధముగానే ఓ సర్వేశ్వరా! ఈ శరీరమును సత్కర్మలతో మథింపగా నీ భక్తియనుఅగ్ని పుట్టి ఈ శరీరమును కర్మలను నశింపజేసి పునరావృత్తిరహితమైన నీయైక్యమును నిక్కముగా ప్రసాదించును గదా!"

కం॥ తా నరులు పచ్చుతెరువున మానుగఁ గల చెరువులందు మడువులయందున్
బూని ఘనగరళతరళము గా నొనరింపంగవలయుఁ గడువేగమునన్

—క్షేమేంద్రుడు

"శత్రువులు వచ్చుదారిలో చెరువులలో మడుగులలో నూతులలో విషము కలిపి యుంచుట దండనీతి. అది శత్రునాశోపాయములలో నొకటి."

సీ॥ అవగాహనమునకు నరిగినగజములమదములు కూడిననదులు గాఁగ ;
ఝషక–కుళీర–కచ్ఛప–మకరాదిసత్వములమొత్తము పర్వతములు గాఁగఁ ;
ప్రాకారమణిగణప్రతిబింబనికరంబు విలసిల్లుబహురత్నవితతి గాఁగ ;
రంగత్తరంగపరంపరపైఁ దేలుకలహంసములు శంఖకులము గాఁగఁ ;

ఆవె॥ గరముఁ బొలుపు మిగులఁ బరిఖ విశాలగంభీర మగుచుఁ బరపుఁబేర్మిఁ జేసి
యఖిలభూమిచక్ర మనుతలంపునఁ బుర వరముఁ జుట్టి యున్నశరధివోలె. —తిక్కన సోమయాజి.

పురము అత్యంత విశాలముగ నుడుటచేత సకల భూమండలమో యనునట్లు ఒప్పియున్నది. "పురమును చుట్టియున్న కందకము విశాలముగను లోతుగను నుండి మిగుల నందముగా సముద్రమును పోలియున్నది. ఆ అగడ్తయందు మునుగుటకు వచ్చిన గజముల మదజల ప్రవాహములు సముద్రమునందు చేరునదులుగను; అందలి చేపలు, ఎండ్రకాయలు, తాబేళ్లు, మొసళ్లు మొదలగు జలచరములు సముద్ర మధ్యమునందలి పర్వతములుగను; పట్టణపుమేడలకు పొదిగినమణులకాంతులు జలములో ప్రతిబింబించగా అవి సముద్రమునందలి రత్నములుగను; అలలపై తేలి క్రీడించు హంసలు సముద్రమునందలి శంఖములుగాను, పురపరిఖ ఒప్పియున్నది.

చ॥ వలసినవంకలన్ గురియువర్షసమాగమమేఘ మేగి, త
న్మలినత దాతయం దవగుణంబును సహ్యమె ; వృష్టి లేక ని
ర్మల మగుచోఁ దలంపఁగ శరద్ఘన మేటికి ; నట్లయోగిమై
వెలయని వానివెల్లఁదన మేమిప్రయోజన మర్థికోటికిన్. —ఆంధ్ర భోజుడు.

ఆ॥ వె॥ వర్ధమాను లైనవారికి నాపద హీనజనులకంటె నెక్కుడండ్రు
కచవితానమునకుఁ గాక ఖండన మెందు రెప్పవెండ్రుకలకుఁ జెప్పఁబడెనె ? —అప్పనమంత్రి.

కం॥ పసరముఁ బసరము, పులిఁ బులి, బిసరుహసంభవునిసృష్టిపెంపెంత మహిన్
బసరముఁ బులిఁ జేయుఁ బులిన్ బసరముగాఁ జేయునృపతిబల మది గాదే. —శివదేవయ్య.

కం॥ స్నేహలతలు సద్గుణసందోహజలంబుననె పెరుగు దుర్గుణయుక్త
స్నేహితులవలన మాత్ర స్నేహముఁ జెడు నండ్రు రాజసిద్ధాంతవిదుల్. —బద్దెనకవి.

కం॥ నైజగుణం బగుతమమదిరాజస మప్పటికిఁ గప్పి ప్రజతో నయ్యో
యోజం బరికింపనియా రాజులు సాధు లని నమ్మ రా దెప్పటికిన్. —మంచనకవి.

## శరద్వర్ణనము

ఉ॥ క్షోదితమౌక్తికవ్రజరజోభరపాండురచంద్రికల్ దివిన్
బ్రోదిగఁ బర్వి యొప్పె జలముక్తతిబంధవిముక్తచంద్రమున్
సాదృతిఁ జూచుకోర్కినిఁ బయోంబుధి పొంగుచు వచ్చె నాఁగఁ బు
త్రాదులబంధముక్తి నరయన్ జనకుల్ సనుదెంచకుందురే ?

ఉ॥ శారదలక్ష్మి తత్క్షణలసన్నవకైరవలోచనాఢ్యయై
కైరవబంధుమండలముఖంబు, వినీలపయోదమాలికా
కారనిచోలమాల దొలఁగన్ గడువెల్లనికాంతితోడ నొ
ప్పారుచు నున్నవిభ్రమవియన్ముకురంబునఁ గాంచె నాఁ దగెన్. —ఆంధ్ర బిల్హణ.

"ముత్యములపొడివలె నున్నతెల్లని వెన్నెలలు ఆకాశమునందు వ్యాపించి యుండగా కారుమేఘములనెడుచెరనుండి విముక్తుఁడైనతన కొడుకు చంద్రుని చూచుకోర్కెతో తండ్రి యగుపాలసముద్రుడు సంతోషముతో పొంగి వచ్చెనా యనునట్లున్నది. నిక్కమేకదా! పుత్రులకు బంధవిముక్తి గలిగినప్పుడు తలిదండ్రులు వారిని చూడ వత్తురుగదా!"

శరదృతులక్ష్మి, అప్పుడే వికసించిన తెల్లకలువ లనెడు కన్నులతో ప్రకాశించుచు, చంద్రమండల మనెడు తనముఖమును, నీలమేఘములనెడు తెరతొలగిపోవగా స్వచ్ఛమైన కాంతితోఒప్పుచున్న ఆకాశమనెడు అద్దమునందు చూచుచున్నదా! యనునట్లుఒప్పెను.

# గృహిణి

పిలకా గణపతి శాస్త్రి

'ఇక నేనుమాత్రం ఎందుకు ? వెడతాను!' పార్థసారథి తటాలున లేచి నిలుచున్నాడు.

సరోజ నాలుగయిదు క్షణాలపాటు నిశ్చలంగా అతని వైపు చూసింది.

'ఏమండీ ! నామీద కోపం వచ్చిందా?' బ్రతిమాలు కుంటున్న ధోరణిలో ప్రశ్నించింది.

'కోపం ఎందుకు ?'

'పాట మీదగ్గర నేర్చుకోనన్నానని!'

పార్థసారథి దానికేవిధంగాను ప్రతి సమాధానం చెప్పలేదు. అది తనకేమి పట్టనట్టు క్షణ కాలం అలాగే నిలుచున్నాడు. అంతలోనే సరోజ అందుకుంది.

'నా తప్పే కనబడిందిగాని చీటికిమాటికి మీరు పాటల్లో వంకలు దిద్దడం బాగుందా ?'

'నాకు లేనిపోని ఇచ్ఛకాలు, ముఖస్తుతులు చేత కావుమరి!'

సరోజ క్షణకాలం మాట్లాడకూరుకుని సమాధానం చెప్పింది.

'పోనీలెండి!. ఊరికే వేళాకోళానికన్నాను! ఇంత మాత్రానికే కోపగించుకోవాలా? ఇంక మీ దగ్గరే నేర్చుకుంటాను లెండి!'

'కాని నాకు బొత్తిగా తీరికలేదు' పార్థసారథి ముభావంగా అన్నాడు.

సరోజ రవంత సేపాలోచించి కొంటెగా కవ్విస్తూ అడిగింది.

'అసలు సంగతి అదికాదులెండి. ఇంటి దగ్గర మీ ఆవిడ ఇక్కడికి వెళ్ళవద్దని పోరు పెడుతున్నారు ! అవునా ?'

'నీ కెలాగ తెలిసింది' నిలువునా నిర్ఘాంతపడి అడిగాడు పార్థసారథి.

'ఒకరు చెప్పాలేమిటి ? నేనామాత్రం గ్రహించుకోలేననుకున్నారా?'

'కాదులే ! ఎవరో చెప్పారు ! అవునా ?' పార్థసారథి చిరునవ్వు చిందిస్తూ అడిగాడు.

'అవును! నిజమే! మా పనిమనిషి చెప్పింది!'

'దాని కెలాగ తెలిసింది ?'

'మీ ఇంట్లో పనిమనిషి దాని చెల్లెలు.'

'ఓహో ! అదాకథ ! కాని దానిమాట నిజంకాదు. అనవసరంగా మా ఆవిడమీద లేనిపోనివేవో కల్పించి చెప్పింది. అంతే !'

'నిజమేనా !'

'నిజమే ! నాకంత అబద్ధం చెప్పవలసినంత అవసరం ఏమి వచ్చింది ?'

'అయితే ఎల్లుండి మీ ఆవిడగారిని పేరంటానికి పిలవాలని అనుకుంటున్నాను. ఆవేళ మాచెల్లాయి సరస్వతి పుట్టిన రోజు. రమ్మన్నారా ? '

'దానికేం, రా ! నేనేమన్నా వద్దన్నానా ? '

ఆ సమాధానంమీద సరోజ కొంచంసేపు అతనివైపు కొంటెగా చూసింది.

' కాదు లెండి ! రాను లెండి ?'

' ఏం ? ఎందుచేత ?'

' మీ ఇంటికి వచ్చి, మిమ్మల్ని ఇబ్బందిలో పెట్టడం నా కిష్టం లేదు. ?'

' సరిపోయింది ! అన్నీ నువ్వే కల్పించుకుంటే ఇక నేనేమనగలను ! సరే ! నీ ఇష్టం ! '

అలాగని నెమ్మదిగా తప్పించుకున్నాడేగాని పార్థసారథి తిరిగి ఇంటికి రమ్మని బలవంత పెట్టలేదు. అక్కడినించి కదలి గుమ్మం వైపు రెండు మూడడుగులు వేశాడు. సరోజ అతని వెంట వెళ్లి ఎంతో ఆతురంగా అడిగింది.

' రేపు రిహార్సల్ కి వస్తున్నారా ? '

## జరిగిన కథ

పార్థసారథికి నాటకాల పిచ్చి. ఆ నాటకాల్లోపడి రాత్రిళ్ళు ఆలస్యంగాకూడా యింటికి వచ్చేవాడు. ఆ విషయమై భార్యా భర్తల మధ్య పొరపొచ్చాలు కూడా వస్తుండేవి. రాఘవనాట్య కళా మండలి ద్వారా పార్థసారథి నాటకాలు వేస్తుంటాడు. ప్రస్తుతం కృష్ణ తులాభారం రిహార్సలు జరుగుతున్నది. సరోజ అనే ఆమె కూడా అందులో ఒక పాత్రధారిణి. సరదాకు సరోజ పార్థసారథివద్ద పాట నేర్చుకోనని రాఘవ అనే మరొకతని దగ్గర నేర్చుకుంటానని అన్నది.

'వస్తే మాత్రం లాభమేమిటి? పట్టుమని పది నిమిషాల పాటయినా కొనసాగడం లేదు. అసలీవేళ ప్రారంభమే కాలేదు!'

పార్థసారథి ముఖకవళికలో చిరాకు చిటపట లాడింది. సరోజ అది పసికట్టి, మధ్య మధ్యన లేనిపోని గొడవలేవి లేకుండా రిహార్సల్ కొనసాగించగలనని గట్టిగా నచ్చ జెప్పింది. తప్పకుండా రావలసినదని ప్రాధేయ పడింది. దానిమీద పార్థసారథి అంటీ అంటనట్టుగా సమాధానం చెప్పి గిరుక్కున వెనక్కి తిరిగి వీధిలోకి వెళ్ళిపోయాడు.

* * * *

పార్థసారథి ఆ మరునాడు సాయంత్రం యథాప్రకారంగా రిహార్సల్ కి హాజరయ్యాడు. ఆవేళ రావలసిన వాళ్లందరు వచ్చారు. మొత్తంమీద రిహార్సల్ బాగానే జరిగింది. కాని ఇంటికి తిరిగి వచ్చినప్పటి నుంచి పార్థసారథి మనస్సులో పెద్ద గుంజాటన బయలుదేరింది.

ఆ మరునాడు మధ్యాహ్నం నిద్రముగించిన తరువాత పార్థసారథి హార్మోనియంతో కొంతసేపు సంగీత సాధన కొనసాగించాలని అనుకున్నాడు. అంతలోనే బాబు అతని దగ్గరికి వచ్చి హార్మోనియంమీద చిట్టి చేతులుపెట్టి వింత ప్రశ్నలేవేవో అడగడం ప్రారంభించాడు. పార్థసారథి వాణ్ణి దగ్గరికి తీసుకుని ముద్దుపెట్టుకుని వాటికి తగిన సమాధానాలేవో కొన్ని చెప్పాడు. ఆ పసివాడికింకా మూడేళ్లు నిండలేదు. ఉండి ఉండి వాడు ఏవేవో కొత్త ప్రశ్నలడుగుతూనే ఉన్నాడు. పార్థసారథి విసుక్కోకుండా వాటికేవేవో సమాధానాలిస్తూనే ఉన్నాడు

కాని అతని మనస్సు మాటి మాటికి గడిచిన నాటి సాయంకాలం జరిగిన సంఘటనలే నెమరు వెయ్యడం మొదలుపెట్టింది. రిహార్సల్ పూర్తి అయిన తరువాత ఇంకా కొంతసేపుండవలసినదని రాఘవని సరోజ రెండు మూడు సారులడిగింది కొంచెం బెట్టు సరి చేసి అంగీకరించిన తరువాత మరి తాను చేసిన వాగ్దానం మాటే తల పెట్టక అతని దగ్గర కూర్చుని నాటకం పాటలు కొన్ని బాగా శ్రద్ధ పట్టి నేర్చుకుంది. పార్థసారథి ఆ వింత ధోరణిఅంతా జాగ్రత్తగా ఒక కంట గమనిస్తూనే ఉన్నా అది తన కేమి పట్టనట్టు నటించి; కులాసాగా కొన్ని చలోక్తులు విసిరాడు. మధ్య మధ్యన పాట బాగావచ్చిందా? అని సరోజ అతన్ని కవ్వించినట్టు అడిగింది. పార్థసారథి పై పైకిపాట చాలా బాగున్నదని మెచ్చుకుని ఇంచు మించుగా ఆకాశానికెత్తి వేశాడు. కాని ఆనాడు సరోజలో కనిపించిన కొత్త మార్పు మాత్రం అతనికెంతో మనన, ఆశ్చర్యం కలిగించింది.

దాదాపు రెండేళ్ళ క్రితమువరకు సరోజ పేరే పార్థసారథికి తెలియదు. ఒకనాడు ఏదో మాటల సందర్భంలో రాఘవద్వారానే అతనికామె సంగతి తెలిసింది. అప్పటికి సరోజ ఆ పట్టణం హైస్కూలులో స్కూలు ఫైనలు దాకా వచ్చింది. ఆ రోజుల్లో ఆమె తల్లి రంగనాయకమ్మకి ఆ మాత్రం చదువు చెప్పించే తాహతు కూడాలేదు. ఒకసారి ఆ ప్రస్తావన తెచ్చి ఏదయినా కొంతసాయం చెయ్యవలసినదని రాఘవ పార్థసారథికి సిఫారసు చేశాడు. ఆ పైన కొంత కాలంనించి తాను కూడా యథాశక్తిగా సాయ పడుతున్నట్టు సూచించాడు. అది ఆమె చదువుకునే హైస్కూల్లో కృష్ణ తులాభారంలో సత్యభామ వేషం వేసి చక్కగా నటించిననాడు జరిగిన సంఘటన.

మొత్తంమీద ఆనాటి అభినయం ప్రేక్షకులందరు బాగున్నదని మెచ్చుకున్నారు. పార్థసారథినది మరింతగా ఆకర్షించింది. నాటకం ముగిసిన తరువాత రాఘవ అతనికామెతో పరిచయం కలిగించాడు. క్రమ క్రమంగా అది మరికొంత సన్నిహితమయిన తరువాత, ఒకనాడు పార్థసారథి, రాఘవతో కలిసి సరోజ ఇంటికి వెళ్ళి పర్సులోనించి కొత్త నూరు రూపాయల నోటు తీసి రంగనాయకి చేతికందించి సరోజ నింకా చదివించవలసినదని ప్రోత్సహించాడు.

మొట్ట మొదట ఆమె ఆ నోటు పుచ్చుకోడానికెంతో మొహమాట పడింది. కాని రాఘవ, పార్థసారథి కాదు కూడదని బలవంత పెట్టిన తరవాత, ఎట్టకేలకంగీకరించింది. అదే సమయంలో రాఘవకూడా తను కొంత సహాయం చెయ్యబోతున్నట్టు వాగ్దానం చేశాడు. రంగనాయకి తొణికిసలాడుతున్న గద్గదికతో, తడబడుతున్న మాటలతో ప్రత్యేకించి పార్థసారథికెంతో కృతజ్ఞత వెల్లడించింది. ఆ సమయంలో సరోజ కనుగొలుకులలో అతని యెడల ఇనుమడించిన కృతజ్ఞత, అభిమానము ఒండొంటితో మేళవించి నర్తించాయి.



అలాగ మరి కొంతకాలం దాకా పార్థసారథి ఆమె చదువు కోసమని కొంత ధనసహాయం చేశాడు. కాని స్కూలు ఫైనలు పూర్తి అయిన తరవాత సరోజ ఒక ఏడాది వఱకు మాత్రమే ఇంటరు చదువు కొనసాగించింది. ఆ పైన చీటికీ మాటికి ఎదురు పడిన ఆర్థికమయిన ఇబ్బందుల వల్లనేమి, చదువుమీద శ్రద్ధ సన్నగిల్లడం వల్లనయితేనేమి రాఘవ ప్రోత్సాహము వల్లనైతేనేమి అది కట్టిపెట్టి గయోపాఖ్యానము, రాధాకృష్ణ, కృష్ణ తులాభారము మొదలయిన నాటకాలలో చిన్న చిన్న వేషాలు వెయ్యడం మొదలు పెట్టింది.

ఆ విధంగా రంగస్థలం మీద అడుగు పెట్టి నప్పటినించి ఆమె పట్టినదంతా బంగారమే అయింది. క్రమ క్రమంగా సరోజ ఆ పట్టణంలో ప్రసిద్ధనటిగా కొంత పేరు సంపాదించుకుంది.

అదే సమయంలో రాఘవ,పార్థసారథి ఆమె తమ రాఘవ నాట్యకళా మండలికెంతో వన్నె తేగలదనినిశ్చయించుకున్నారు. అప్పటినించి సరోజ ఎక్కువగా ఆ మండలి నాటకాల లోనే పాల్గొన్నది. క్రమ క్రమంగా తన పరిస్థితి బాగా మెరుగయిన కొద్దీ రంగనాయకి ఆ పట్టణంలో ఒక పెద్ద ఇల్లేదయినా కొనుక్కోవాలని ఉబలాట పడింది. ప్రయత్నించగా ప్రయత్నించగా మెరక వీధిలో చిన్న మేడ ఒకటి అమ్మకానికి వచ్చినట్టు తెలిసింది. అది ఎలాగయినా కొనుక్కోవాలని సరోజ ఎంతయినా ఉబలాటపడింది.

అందుకోసమని పార్థసారథి ఆరువేల రూపాయలదాకా సాయంచేశాడు. దానికి బదులుగా తల్లిపేర కొన్న ఆమేడ అతనిపేర తనఖా పెట్టబోతున్నట్టు సరోజ చెప్పింది. కాని పార్థసారథి దాని కెంతమాత్రము అంగీకరించలేదు. వద్దు వద్దని ఎంతో బలవంతం చేశాడు. కాని సరోజ వినలేదు. దానిమీద పార్థసారథి చాలా నొచ్చుకున్నాడు. అయినా ఆమె అది బలవంతంగా అతని లాల్చీ జేబులో ఇరికించింది. పార్థసారథి మరింతగా బాధపడి తిరిగి అది ఆమె పక్కనున్న బల్లమీదికి విసిరివేసి దురుసుగా అక్కడినుంచి వెళ్ళిపోయాడు. ఆమేడ కొనడానికి తానుకూడా కొంత సాయపడగలనని రాఘవ అన్నాడు కాని, చిట్టచివరికి ఏదో ఇబ్బంది వచ్చిపడిందని చెప్పి సమయానికి ఆదుకోలేక పోయినందు కెంతో నొచ్చుకున్నాడు.

ఆ తరుణంలో సరోజ వేలువిడిచిన మేనమామ వెంకటకృష్ణయ్య కొంచం సాయంచేసి ఆ మేడ రంగనాయకికి స్వాధీనం చేయించాడు. కాని అతడు చేసిన ధనసహాయం చాలా తక్కువ. ఆ సమయంలో పార్థసారథి అంత పెద్ద మొత్తంతో ఆదుకోకపోతే అసలా మేడ కొనడమే జరిగి ఉండేదికాదు. అంతేకాదు. సరోజ స్కూలు ఫైనల్‌లో అడుగుపెట్టి నప్పటినించి పార్థసారథి ఆమె కుటుంబాని కెన్నో విధాల ఆసరా ఇచ్చాడు.

అందుచేత అతనికెంతగా ఆలోచించినా తనమీద సరోజ కంతటి విసుగు, చిరాకు కలగడానికేమికారణమో బోధపడలేదు. పాటలు చెప్పేటప్పుడు మాటి మాటికి తప్పులు పట్టడమే దానికొక కారణమయినట్టు సరోజ మాట్లాడింది. కాని పార్థసారథి కది నిజమయిన గట్టికారణంగా కనపడలేదు! ఒకవేళ సరోజ మనస్సు రాఘవమీదికి తిరిగిందేమో! ఈ మధ్యన ఇద్దరి మధ్య ఏకసక్కాలు వేళాకోళాలు ఎక్కువయ్యాయి. నిజమే! దీనికదే కారణం అయిఉంటుంది! సందేహంలేదు! పార్థసారథి మనస్సులో ఆ అనుమానం మరికొంత బలపడింది. కాని దానికొక గట్టిదాఖలా ఏది కనిపించడం లేదని తిరిగి కొంచెం సంతృప్తి పడ్డాడు. అంతలోనే ఆ అనుమానం మనస్సులో పురుగు దొలిచినట్టు వేధించడం మొదలుపెట్టింది.

ఆ సంగతులన్నీ తలుచుకుని పార్థసారథి అంతగా బాధపడడానికొక పెద్ద కారణం లేకపోలేదు. సరోజ పరిస్థితిని బట్టి చూస్తే చదువుకునే రోజుల్లోను, ఆ తరవాత అతడంత బాగా సహాయం చేసిఉండకపోతే ఆమెకామాత్రం పేరు ప్రతిష్ఠలు గాని, తన కాళ్ళమీద నిలబడగల నన్నంతటి ధీమాగాని వచ్చి వుండేవి కావు! సరోజ తండ్రి చిన్నప్పటినించి చాలా కష్టపడి చెమట ఓడ్చి అతికష్టంమీద పైకివచ్చిన వ్యక్తి. అయితే అతడు సాల్ట్ సబిన్స్పెక్టరు ఉద్యోగంచేస్తూ, ఒకనాడు అకస్మాత్తుగా వచ్చిన గుండెపోటువల్ల కొన్ని గంటలలోనే మరణించాడు. అప్పటికి సరోజ చెల్లెలు సరస్వతికింకా ఏడాదికూడా పూర్తిగా నిండలేదు. ఆ సమయంలో రంగనాయకి అతి ధైర్యంమీద గుండె చిక్కపట్టుకుని అతికష్టంమీద సంసార యాత్ర కొనసాగించింది. అప్పటి ఇబ్బందుల్లో ఒక్క వెంకటకృష్ణయ్యతప్ప రవంత సాయంచేసే వాళ్ళెవరు కనుచూపు మేరలో కనిపించలేదు. అతడుమాత్రం ఎంత కాలమని సాయపడగలడు? ఆపత్సమయంలోవచ్చి ఆదుకుని చేతనయినంతవరకు సాయపడి కొన్నాళ్ళపాటుండి తిరిగి తనదారిని తాను వెళ్ళిపోయాడు.

అయినా రంగనాయకి అధైర్యపడలేదు. ఆమె కంతకు మునుపే హార్మోనియంమీద కొంత నైపుణి అలవడింది. అందుచేత కొందరు కలవారి ఇళ్ళల్లో సంగీతపాఠాలు చెప్పింది. వాటివల్ల క్రమక్రమంగా కొంతసొమ్ము చేతికివచ్చినా కుటుంబ పోషణ సంతృప్తికరంగా సాధ్యపడలేదు. ఆపైన కొంత అలవాటయిన కుట్టుపనితో సంపన్నుల ఇళ్ళల్లో దుస్తులు కుట్టడం ప్రారంభించింది. దానివల్ల కూడా బండిబాగా సాగలేదు.

ఆ తరవాత ఏవేవో నాటకాలలో పరిచారిక, చెలికత్తె మొదలయిన వేషాలుకూడా కొన్ని వేయడం మొదలుపెట్టింది. దానా, దీనా రంగనాయకి పరిస్థితి కొంచెం బాగుపడింది. ఆపైన కొద్దో, గొప్పో భర్త ప్రావిడెంటు ఫండు చేతికందడం మూలాన ఆమె ఎన్నడులేమి అనుభవించలేదు. రంగనాయకి మంచి గుండెదిట్టవున్న మనిషి. కనక ఎన్నెన్ని ఇబ్బందులెదురు పడినా అధైర్యపడక గుట్టుగా కాలక్షేపంచేసింది.

ఆ రోజుల్లో ప్రచారంలో ఉన్న సంఘ సంస్కరణోద్యమాల యెడల, స్త్రీ విద్య యెడల ఆమెకెంతో అభిమానం కలిగింది. మొట్టమొదటినించి పొద్దస్తమానము పొయ్యి దగ్గర పడి ఉండడం రంగనాయకి కెంతమాత్రము నచ్చలేదు. స్త్రీలు అన్ని రంగాలలోనూ పురుషులతోబాటు సరిసమానంగా చొరవగా ముమ్ముందుకు చొచ్చుకునిపోవాలని ఆమె అభిలాష. కనకనే చిన్నప్పటినించి సరోజకెంతో కష్టపడి చదువు చెప్పించింది. మగ పిల్లవాడు కలగకపోయినా తనకేలాంటి లోపమురాదని ఎంతో ధైర్యపడింది. అందువల్ల సరోజ మధ్యలో చదువు మానివెయ్యడం ఆమె కెంతమాత్రము నచ్చలేదు. కాని క్రమక్రమంగా నాటకాలలో కాలు నిలవదొక్కుకోవడం జరిగిందికదా అని కొంతవరకు సంతృప్తిపడి సంతోషించింది.

(సశేషం)

# విజయదశమి

ముదిగొండ శివప్రసాద్

ఒక పండుగయొక్క ప్రధానోద్దేశం గత వైభవస్మృతి, భావి కర్తవ్య నిర్ణయమూ, మన విజయపథగమనమే. అయితే ఆ దృష్టిలో చూస్తే భారతీయుల పర్వదినాలన్నిటిలోకీ 'విజయదశమి' మహా పర్వదినం. సీమోల్లంఘనం మనజాతికి సంఘటన ద్వారా నిర్మించిన వజ్రకవచం.

మనది జన్మసిద్ధంగా వీరజాతి. ఆర్తత్రాణ పరాయణత్వంలో మనం ప్రదర్శించే వీర్యమే అరి జనభయంకరులమై నిలువడంలోనూ ప్రదర్శించిన జాతి ఇది. కాబట్టే మన కావ్యాలలో వీర రసం ప్రధాన రసమైనట్లే, ఋతువులలో శరత్తు ప్రముఖమైనదైనట్లే, ఉత్సవాలలో విజయదశమి ప్రముఖ స్థానాన్ని ఆక్రమించుకున్నది.

విజయదశమి ఉత్సవం ఆశ్వయుజ శుద్ధ దశమినాడు వస్తుంది. "ఆశ్వినస్య సితే పక్షే దశమ్యాం తారకోదయే. స కాలో విజయో నామ సర్వకామార్థసాధకః" అన్న శ్లోకాన్ని అనుసరించి సర్వకామ సాధకమైన ఈ ఉత్సవం శుద్ధదశమి సంధ్యాకాలంలో వస్తుందని తేలుతున్నది. అప్పుడు శ్రవణానక్షత్రంకూడా రావాలి. అదే విజయదశమి. ఆనాడు సాయంత్రం జమ్మిపూజ చేస్తారు. 'శమీ శమయతే పాపం శమీ శత్రువినాశనీ. అర్జునస్య ధనుర్ధారీ రామస్య ప్రియదర్శనీ. శమీ శమయతే పాపం శమీలోహిత కంటకా. ధారిణ్యర్జున బాణానాం రామస్య ప్రియదర్శినీ. కరిష్యమాణ యాత్రాయాం యథాకాలం సుఖంమయా, తత్రనిర్విఘ్న కర్త్రీ త్వం భవ శ్రీరామపూజితే' అన్న" వాక్యాలనుబట్టి శమీవృక్షం పాపాలను హరించి, శత్రువులను నశింపజేస్తుందని, అర్జునుని ధనస్సును ధరించినదదేనని, శ్రీరామునికి ప్రియదర్శనం కల్గించిందదేనని, 'యాత్ర' చేయువారికి ఇది సౌఖ్యప్రదాయిని అనీ సుస్పష్టం అవుతున్నది. దీనినిబట్టి ఏవేవో పురాణగాథలు మనకు మోల రేఖామాత్రంగా గోచరిస్తున్నాయి.

శ్రీరాముడు ఎన్నిసార్లు చంపినా రావణుని తలలు తిరిగి రావడానికి కారణం తెలియక శక్తిపూజ చేశాడట! అప్పుడు శక్తి జాగృతమయింది. ఆ దినం ఆశ్వయుజ శుద్ధ పాడ్యమి. తర్వాత శక్తి సహాయంతో రాముడు రావణ సంహారంచేసి ససైన్యంగా అయోధ్యకు బయలుదేరాడు. ఆ బయలుదేరినదినం విజయదశమి. ఆనాడు సాయంత్రం శ్రీరాముడు శమీపూజ చేసి, పుష్పకం ఎక్కాడట! ఈ రీతిగా ఈ దినం పర్వదినం 'విజయ' దినం అయింది.

ఇక భారతగాథ మిక్కిలి ప్రసిద్ధమయిందే! అజ్ఞాత వాసానంతరం ఉత్తరగోగ్రహణ సమయంలో అర్జునుడు శమీపూజ జరిపి ఆయుధాలను స్వీకరించి కౌరవ సేన నోడించాడు. ఆ దినం ఆశ్వయుజ శుద్ధ దశమి — కాబట్టే నేటికీ శమీపూజ మనకు ఆచారమయింది. విజయునివలె 'విజయ' కాంక్ష మన మధురోహగా మారింది.

అలా క్రమంగా చారిత్రక కాలంలోకూడా రాజులు దండయాత్రకువెళ్ళేముందు శమీపూజజరిపి, తర్వాత తమ కార్యక్రమం ప్రారంభించేవారు. కీ॥ శే॥ కాటూరివారు తమ శరదృతువు అన్న వ్యాసంలో ఏతదృతు రామణీయకత్వాన్ని వర్ణించడంతోపాటు ఎలా దండయాత్రలకు శరత్తు అనుకూలమైనకాలమో వివరించారు. వానలతో, వరదలతో కదలనలవికాని వర్షాకాలం దాటిపోగానే వాతావరణమంతా ప్రశాంతత నందుతుంది. గర్భిణీస్త్రీలవలె తటాలనొరసికొని నదులు ప్రవహిస్తుంటాయి. ఆకాశం మత్తుగా పుచ్చపువ్వువంటి వెన్నెలతో విచ్చుకొని వుంటుంది. ప్రకృతి మొత్తం పచ్చగా పచ్చలుపొదిగిన చాందినీవలె మెరుస్తూవుంటుంది. ఈ శుభ సమయంలో అటకలపై నుండి కత్తులు దింపుతారు క్షత్రియులు. (గత పాకిస్తాన్ యుద్ధంకూడా సెప్టెంబరు, అక్టోబరులలో జరగడం ఈ సందర్భంలో గమనార్హం). సమర సన్నాహాలు విజృంభిస్తాయి ధర్మా ధర్మశక్తుల మధ్య సంఘర్షణ పెరుగుతుంది. చివరకు ధర్మానికే విజయం లభించి తీరుతుంది. ఈవిధంగా విజయశమి శమీపూజతో ఈ యుద్ధయజ్ఞ సన్నాహానికి అంకురార్పణం జరగడం ప్రాచీనులమతం.

కాబట్టే పాడ్యమితో శక్తి పూజ ప్రారంభమౌతుంది. ఈ శక్తినే పూర్వం 'అపరాజిత' అనేవారు. "దశమ్యాం చ నరైః సమ్యక్ పూజనీయాఽపరాజితా. మోక్షార్థం విజయార్థం చపూర్వోక్త విధినా నరైః నవమీ శేషయుక్తాయాం దశమ్యామపరాజితా. దదాతి విజయం దేవీ పూజితా జయవర్ధనీ" అన్నస్కాందపురాణ వాక్యాలవల్ల దశమినాడు అపరాజిత పూజను జరపడంతో ఆదేవి విజయాన్ని ఇస్తుందని వ్యక్తమౌతున్నది. చాణక్యుని అర్థ శాస్త్రంలో కూడా ఈ దేవి పూజాప్రసక్తి ఉన్నది. భారతీయులు సర్వ విషయాలకు సాంకేతిక స్వరూపాన్నిచ్చిన మేధానిధులు. కాబట్టే సమర విజయానికి వారు 'అపరాజితా' శక్తిగా రూప కల్పనచేసి ఆ అపరాజిత తత్వాన్ని ఆరాధించారన్నది సువ్యక్తం.

ఇక ఈ శమీవృక్ష పూజకు కారణం ఏమిటి? ఇదికూడా ఈ సందర్భంలో కొద్దిగా విచారిద్దాం. వైద్య శాస్త్రాల్లో శమీ వృక్షానికి మంచి ప్రశస్తివుంది. అందువలన ఈ 'పూజ'కు కారణం అది కావచ్చునని కొందరిమతం. మరికొందరు, శబ్ద కల్పద్రుమంలో అపరాజిత అన్న అర్థం 'శమీవృక్ష'పరంగా వాడబడింది కాబట్టి తొలుత శక్తిని పూజించే ఆచారం క్రమక్రమంగా శమీ పూజగా పరిణామం చెందిందని చెపుతారు. (మధుపర్కము అంటే పెండ్లి సమయంలో బెల్లాన్ని పెట్టడం. కాని నేడు వస్త్ర విశేషంగా ఆ శబ్దం పర్యవసించింది)—ఇంకకొందరు అర్జునుని గాథను ఉదాహరించి ఆ జమ్మిచెట్టు పూజను నేటివరకూ అనుకరించడమే ఈ సంప్రదాయానికి అర్థం అని చెపుతారు. ఇలా ఇంకా చాలా వ్యాఖ్యానాలు పండితులు చేస్తున్నారు— కాని సర్వ సమగ్రమైనదీ, సర్వ జనాంగీకార యోగ్యమైనది మాత్రం వీటిల్లో

# బ్రూక్ బాండ్ రెడ్ లేబిల్‌తో ఊగండి




## లక్షలాది ప్రజలు ఆనందిస్తున్నారు.

వివేకవంతులు, రుచి తెలిసినవారు బ్రూక్ బాండ్ రెడ్ లేబిల్ గురించి గ్రహించగలిగారు. అది శ్రేష్ఠమైనది. మీకు నిజమైన రుచిని ఇవ్వగలిగిన టీ. తాజాగాను, రుచిగాను వుంచగల గాలి చొరరాని ప్యాకెట్లలో బ్రూక్ బాండ్ రెడ్ లేబిల్ మీకు చేరుతోంది. ఎన్నో కప్పుల కమ్మని టీని ఇవ్వగలదు. లక్షలాది ప్రజలు ఆనందిస్తున్నారు. మరి మీరో?

JWT BB 2951


ఏదీ లేదనీ, ఈ 'శమీ' ప్రాధాన్య కారణం ఇంకా 'వెతుక వలసినదే' (మృగ్యమే)ననీ కొందరి భావం.

ఏది ఏమైనా పాడ్యమినాడు కలశస్థాపన చేయడం, వివిధ మతస్థులు తమతమ ఆరాధనా విధానాల కనుగుణంగా ఉపాస్య దైవాలను కొలవడం; చివర సరస్వతీ పూజ, ఆయుధపూజ, జరిపి విజయదశమితో వ్రత సమాప్తి చేసి సమారాధన జరపడం మనకు నేటికీ తెలిసిన విషయమే.

దశమి పెద్దలతోబాటు పిల్లల పండుగకూడాను. 'దసరాను' 'సరదా'గా వాళ్ళు భావిస్తారు. పాశ్చాత్య నాగరికతవల్ల మన విద్యావిధానం చాలావరకు భ్రష్టమైనప్పటికీ నేటికీ అక్కడక్కడ పల్లెటూళ్ళలో కోతులు కొమ్మంచులు, గడలు, బాణాలు పట్టుకొని 'అయ్యవారికి చాలు అయిదు వరహాలు' అంటూ రక్తబీజునివధ మొత్తం కథాగానం చేస్తూ ఇంటింటికీ తిరిగి పప్పు బెల్లాలు తెచ్చుకుంటూ వుంటారు. కొత్త గుడ్డలు, పిండివంటలు, కోతులు, పూలబాణాలు, మాత్రమే కాకుండా తిరణాలలు, ఊరేగింపులు ఉత్సవాలు కూడా ఈ సందర్భంలో ఆ అమాయిక హృదయాల నెంతో మురిపిస్తాయి.

ఇంత మధురమైన ఉత్సవం కాబట్టే జాతీయ కవులనిది ఉద్రూతలూగించే స్ఫూర్తి కేంద్రమై నిలిచి వీర రసప్లావితమైన కావ్యగానం చేయించి. సాహిత్యంతో ఓతప్రోతంగా నిలిచి పోయింది. రాష్ట్రగానాన్ని చేసిన జాతీయ కవులంతా విజయ దశమి తర్వాతే మరొక ఉత్సవాన్ని తమ కావ్యానికి ఇతి వృత్తంగా ఉపయోగించుకున్నారు. ఆధునిక 'సమర గీతికలు' కూడా విజయ దశమినే ఇతి వృత్తంగా తీసికొని జాతీయులను సమరోన్ముఖులను చేశాయి.

దేశం నేడు క్లిష్ట పరిస్థితిలో ఉండగా—మన 'సీమోల్లంఘనం' జరుగగా—తిరిగి మరొక విజయదశమి వచ్చింది. విందులతో వినోదాలతో జరిపేటందుకు కాక, వీర రసపూరితమైన కర్తవ్య నిష్ఠతో, బాహ్యాంత స్సంఘర్షణలనుండి వ్యష్టినీ, సమాజాన్నీ రక్షించుకొనేటందుకూ ఉపయోగ పడవలసిన ఉత్సవమిది. అది జరిగితే ఈ పర్వం చరితార్థమైనట్లే భావింపవచ్చు.

ఒడ్డుల నొరసెడి గర్భిణీనదులు
నాగములై రాష్ట్రశివుని గొలిచెను
అంబరమున హంస వాహము పైన
బ్రహ్మవచ్చె తన సృష్టిని చూడగ.
జాతీయత సంరక్షించుటకై
తళుక్కుమని క్షత్రియాసి మెరసెను
నరులను నారాయణు చేయుటకై
నవరాత్రము లారంభ మయ్యెను.

( మహాసర్గ )

# భాగ్యచక్రం

ఆరెకపూడి కౌసల్యాదేవి

హుందాగా నడుస్తూ, క్రమ క్రమముగా కనుమరుగౌతున్న అతడిని చూస్తూన్న జయమదిలో అనేక ఆలోచనా తరంగ మాలికలు లేచి అల్లుకొన సాగాయి సుందర రూపుడు, సుందర హృదయుడు! ఇంత మంచి, ఉన్నతవ్యక్తితోడి జీవితం పల్లెటూరిలో నైతేనేం? బావను తృణీకరించడంలో నేనేమైనా తెలివితక్కువ పనేచేశానా?

*　　*　　*　　*

సాయంత్రం శ్రీనగేష్‌వచ్చి ''ఇవ్వాళ మీరు మా యింటికి రావాలి''అని అడగగానే తన తక్షణ అంగీకారం తెలియజేశాడు శ్రీపతి.

ఆ యిద్దరూ కలసి వెళ్ళిపోతూంటే అమితంగా విస్మయం చెందింది జయశ్రీ. మధ్యాహ్నం వచ్చినప్పుడు నన్నుకూడా రమ్మని ఆహ్వానించాడే! ఇప్పుడసలు నావైపైనా చూడకుండా వెళ్ళిపోతున్నాడు; ఎంత గర్వం! ఎంత అహంకారం! అప్పుడడిగినప్పుడు తక్షణ అంగీకారం తెలుపలేదని కాబోలు! ఏం! ఇప్పుడింకోసారి అడిగితేనే నామర్యాదా? ఇంకోసారి అడిగితే నేను మాత్రం అంత మొండిగా రాననేస్తానా?

జయశ్రీ తనలోతాను అలా రోషంతో, అవమానంతో కుమిలిపోతుండగానే ''అమ్మాయిగారూ?''అని పిలుస్తూ ఓ నలభై యాభై యేళ్ళ పుణ్యస్త్రీవచ్చి, లోపలికి రావడానికి అనుజ్ఞ కోరుతూన్నట్లుగా ద్వారందగ్గర నిల్చున్నది.

"రా లోపలికి. ఏం కావాలి?" ప్రశ్నించింది జయశ్రీ.

''డాక్టరుబాబుగారి అమ్మగారు మిమ్మల్ని తీసుకు రమ్మన్నారండి.''

"మా అత్తయ్యగారా?'' సంతోషంగా, ఆశ్చర్యంగా చూచింది జయశ్రీ. ''పద. సిద్ధంగానేవున్నాను.''అంటూ ఆమెను అనుసరించింది. కాని లోలోపల చాలా పశ్చాత్తాపపడింది తన తొందరపాటుకు. 'బావనూ, అతడి ఉదాత్తతనూ నేను ఎప్పటికప్పుడే పొరపాటుగా అంచనా వేసుకుంటున్నాను. పరాయిదాననైనా నావిషయంలోనే అతడింత ఉత్తమంగా,ఉదాత్తంగా ప్రవర్తిస్తూంటే ఇక ఆత్మీయులైనవారి విషయంలో ఎంత ఘనంగా వుంటాడో! అతడి అర్ధాంగిఅయిన అంగన అదృష్టవంతురాలు, నిస్సందేహం!"

సింహద్వారం దగ్గరకువచ్చి మరింత ఆశ్చర్యపోయింది జయశ్రీ, గుమ్మంముంగిట నిలబడివున్న అందమైన ఒంటెద్దు సవారీ బండినిచూచి.

"బండికూడా ఎందుకు? దగ్గరేగా?" అన్నది.

"అవుననుకోండి. కాని నడిచి తిరగడం బాగుండదండి. మీరేమో ఘరానాయింటి కన్యలు."

సంభాషణ మార్చాలనిపించింది జయకు. "నీకేంపని, మా అత్తయ్యగారియింట్లో?" అనడిగింది.

"ఓపనంటూ లేదమ్మా, అమ్మగారేం చెపితే అదేచేస్తూ, వారికి చేతిసాయంగా వుంటూ ఎప్పుడూ అక్కడేవుంటాను.

---

**జరిగిన కథ**

వైద్య విద్యా పట్టభద్రుడయిన శ్రీనగేశ్ సేవాతత్పరత అతనిమామ శ్రీపతికి నచ్చదు. శ్రీపతి కుమారుడు శ్రీవారి వివాహం, సమయానికి కట్నం అందని కారణంగా ఆగిపోతుంది తిరిగి వస్తూండగా కారు ప్రమాదంలో చిక్కుకుని శ్రీపతి గారికి మతిస్థిమితం తప్పుతుంది. శ్రీనగేశ్ గ్రామంలో పెట్టిన ఆసుపత్రి-భాగ్యచక్రం చాలా అభివృద్ధి చెందుతుంది. దానిని చూచేందుకు శ్రీలక్ష్మి రాగా ఆమెకు తన ఆసుపత్రి పెట్టుటకు దారితీసిన సంఘటనలను శ్రీనగేశ్ తెలియజేసాడు. శ్రీలక్ష్మి తిరిగి వెళ్ళిపోతుంది. ఆ తరువాత శ్రీపతి యింటికి వస్తాడు శ్రీనగేశ్. శ్రీపతిని, జయశ్రీని తనయింటికి ఆహ్వానిస్తాడు.

అందుకే వారి తరపున నన్ను పంపించారు. అమ్మగారి కెక్కడికీ వెళ్లే అలవాటులేదు. లేకుంటే వారేవచ్చివుండునని చెప్పమన్నారు."

"నీ పేరేమిటి?"

"మంగమ్మ."

బండి 'భాగ్యచక్రం' ముంగిట ఆగింది. కాలి నడకన వచ్చిన మామా మేనల్లుళ్ళుకూడా అప్పుడే అక్కడకు జేరుకున్నారు.

"రా జయా!" అని జయశ్రీని ఆహ్వానిస్తూ "ఇది నా హాస్పిటలండి." అన్నాడు శ్రీనగేష్, శ్రీపతితో.

"ఆహాఁ." మామూలుగా ఊఁకొట్టాడు శ్రీపతి.

"రండి. లోపలికిపోయి చూద్దాం." అన్నాడు తిరిగి.

ఆసుపత్రి భవన ద్వారంపై బంగారుకాంతులీనుతూ సగర్వంగా మెరుస్తూన్న 'భాగ్యచక్రం'అన్న నామధేయాన్ని మరీ మరీ కండ్లు చికిలించిచూస్తూ తల గోక్కుంటూ నిలబడ్డాడు శ్రీపతి.

"ఏమిటండి అలా చూస్తారు?"కుతూహలంగా ప్రశ్నించాడు శ్రీనగేష్.

"ఆఁ..... ఆఁ...... ఏంలేదు. ఏమో?" అంటూ పరధ్యానంగా లోనికినడిచాడు శ్రీపతి.

ఆసుపత్రి వరండాలలో నడుస్తూ, అమూల్యమైన అభిప్రాయాలను వ్యక్తం చేయసాగాడు శ్రీపతి. "వెధవ ఆసుపత్రులూ, నర్సులూ, ఏమిటో చిరాకు నాకు – వీళ్ళ హడావుడిగా తిరగడం చూస్తే."

శ్రీనగేష్, జయశ్రీ ముఖ ముఖాలు చూచుకున్నారు.

ఆ మాటలువిన్న ఇద్దరు ముగ్గురు నర్సులు అర్థంగాక అయోమయంగా చూచారు.

ఒకొక్క విభాగాన్నే వివరంగా చెప్తూ చూపించసాగాడు శ్రీనగేష్.

"అఁ. ఏమిటో!" చప్పరించేశాడు శ్రీపతి. "ఆసుపత్రులూ డాక్టర్లూ—పెద్ద ఆర్భాటమేకాని, నిజంగా చచ్చేవాళ్ళని ఎవరాపగలరోయ్! ఏదో ధనార్జనకు మార్గాలు యివి. అంతే."

శ్రీనగేష్ అప్పటికీ మాట్లాడలేదు.

శ్రీపతి అలా నోటికొచ్చినట్టు మాట్లాడ్తూనే వున్నాడు. "వెధవ రంగు నీళ్లు గొంతుకలో పోయడానికి పెద్ద తెల్లగౌన్లూ, తెల్ల కిరీటాలూ పెట్టుకున్న నర్సులు." అంటూ విసుక్కున్నాడు, మందు గ్లాసుతో ఎదురైన ఓ నర్సును చూచి.

ముగ్గురూ మెంటల్ పేషెంట్సు వున్న ఒక వార్డులో ప్రవేశించారు.

అందులో ఉన్న ఒక రోగి శ్రీపతి దృష్టిని ఆకర్షించాడు.

ఆ రోగి చేతులు రెండూ కలిపి ఒక ఊచకు కట్టి అతడి నొక కటకటాల గదిలో బంధించారు. ఎదుట కనిపిస్తూన్న ఒక ఉన్నత భవనాన్ని చూస్తూ పట్టుదలతో గాలిలో ఎగురుతున్నా డా వ్యక్తి. అతడిని తదేక దీక్షతో చూస్తున్నాడు శ్రీపతి.

"ఏమిటోయ్? ఎందుకలా ఎగిరెగిరిపడ్తావ్?" అధికారంగా అడిగాడు శ్రీనగేష్.

ఆ వ్యక్తి ఒక్కసారి తన ఉద్యోగాన్ని తాత్కాలికంగా ఆపుజేశాడు. ఆగంతకులను పరీక్షగా చూచాడు. "మీరా డాక్టరు బాబూ, యాలో అనుకున్నాను లెండి." అంటూ ఓ పిచ్చి నవ్వు నవ్వాడు.

"ఆ చేతులు చూశారా? నువ్వు ఎగురుతూంటే కట్లకు ఎలా కోసుకుపోతున్నాయో! కుదురుగా వుండు." ఆజ్ఞాపించాడు శ్రీనగేష్.

ఆరోగికి కోపం వచ్చింది. "మనుసులు ఉన్నచోటే వుండిపోతే పైకెలా ఎల్తారు? చూసారా? ఆ ఎదట మేడ? దానికీ నాకూ పోటీ. ఎవరినడిగి కట్టేడా మేడ, నాకంటె ఎత్తుగా. అందుకే నేను దానికంటె ఎత్తుగా ఎగురుతాను." తిరిగి తన ఘనతకు తానే నవ్వుకున్నాడు.

"పాపం! పిచ్చివాడు!" సానుభూతి కురిపించాడు శ్రీపతి. అది శ్రీనగేష్కూ జయశ్రీకీ కూడా ఆశ్చర్యమే అయ్యింది.

మరో గదిలో ఓ మతి భ్రమించిన వ్యక్తి నోటికొచ్చిన మాటలన్నీ చేర్చి, తోచిన వరసలో పాడుకుంటూ ఆనందిస్తున్నాడు.

ఒకడెందుకో తనలోతానే దుఃఖిస్తూ కూర్చున్నాడు.

ఇంకొక వ్యక్తి ఎవరో చాలా చదువుకున్నట్లున్నాడు, వాలకం చూడగానే. ఒక సుద్దముక్కతో నేల, గోడలూ అంతా ఆల్జీబ్రా ఈక్వేషన్స్‌తో నింపేస్తున్నాడు. మనుష్యులు వస్తూన్న సవ్వడి విని తలెత్తి "ఇలా రండి డాక్టర్‌గారూ." అని పిలిచాడు సీరియస్‌గా. "ఏ స్క్వేర్ ప్లస్ బీ స్క్వేర్ ప్లస్ సీ స్క్వేర్ మైనస్......" ఒక వంక తన అభిమానమైన ఈక్వేషన్స్ వల్లెవేస్తూనే వున్నాడు.

"ఏం? ఏం కావాలి?" అడిగాడు శ్రీనగేష్.

"ఇలా చూడండి. ఈ లెఖ్ఖ రైటో కాదో కాస్త చూచి చెప్పండి."

"రైటే, అద్భుతంగా వుంది. మీ తెలివి అద్వితీయం."

డాక్టర్ మెచ్చుకోలు విన్న పేషెంటు ముఖం వికసించింది.
"ఇతడు మేథమేటిక్స్ ఎమ్మెస్సీ. పాపం! ఎమ్మెస్సీ పరీక్షలలో......"

"పోనిద్దూ_వెధవగోల." విసుక్కొంది జయశ్రీ! 'పద బాబూ! పోదాం. ఈ వెధవ పిచ్చిగోల చూచినకొద్దీ కంపర మెత్తుతోంది."

"బాగా చెప్పావ్. ఇక్కడ యింకాస్సేపుంటే మన మతి పోయేటట్టువుంది." అంటూ బిగ్గరగా నవ్వాడు శ్రీపతి.

మతిమాలిన తండ్రీ, మతివున్న కూతురూకూడా ఒకే అభిప్రాయం వెలిబుచ్చడం ఆశ్చర్యమైంది, శ్రీనగేష్‌కు.

"నడవండి. మీకు విసుగ్గావుంటే వెళ్ళిపోదాం." అన్నాడు పైకిమాత్రం ప్రకాశంగా!

"అబ్బ, ఎలా వేగుతున్నావ్ బావా, ఇందరు పిచ్చివాళ్ళతో? మా నాన్న ఒక్కరితోనే నాకు విసుగెత్తి ఎక్కడికైనా పారి పోవాలన్పిస్తున్నది. నీ ఓర్పు మెచ్చుకోతగ్గది." అన్నది జయశ్రీ నగేష్‌తో రహస్యంగా.

నగేష్ నిశితంగా చూస్తూ గంభీరంగా అన్నాడు. "అలాగే ప్రతి ఒక్క డాక్టర్‌కూడ అనుకొంటే పేషెంట్లగతి ఏమౌనో ఒక్కసారి ఆలోచించు."

ఆ విసురు సూటిగా తనకేవచ్చి తగలడంతో జయశ్రీ ముఖం కొంచం వాడినా, వెంటనే తేరుకుంది. గ్రహించనట్టుగా నటిస్తూ సంభాషణ మరో ప్రక్కకు మళ్ళించింది.

"అయితే ఈ పల్లెటూళ్ళోకి యిన్ని రకాల పేషెంట్సు ఎలా పోగడ్డారు బావా?"

"అందులో అంతవిశేష మేమీలేదు. నేటి మానవులకు తిండీ, నీరూ, గాలీ, ఎంత అవసరమో వైద్యమూ అంత అవసరమే. చీటికి మాటికీ ఎన్నెన్నో మైళ్ళు ప్రయాణంచేసి, ఎంతో డబ్బు ఖర్చుఅయిపోయి పట్టణాలకెగబడే ప్రజ, సమీపంలోనే_దగ్గరలోనే ఆ వైద్య సౌకర్యం దొరుకుతూంటే ఇక్కడికే వస్తారుగా? వైద్యం ఖర్చును మించిన ప్రయాణ ఖర్చు పెట్టుకోవడం వారికిమాత్రం ఆనందమా?"

"అంతేనంటావా?" ఇంకా జయశ్రీకి సందేహ నివృత్తి కాలేదు.

"సందేహమా చూస్తున్నావుగా, నా హాస్పిటల్‌లో జనాన్ని. ఇక్కడ నేను ప్రాక్టీస్ పెట్టినదగ్గర్నుంచీ ఈ చుట్టు ప్రక్కల పదిహేను, ఇరవై గ్రామాల నుండి ఎవ్వరూ పట్నాలకు పోవడం లేదంటేనమ్మ. దైవకృపవల్ల నేనుపట్టిన ప్రతి కేసూ యింతవరకూ జయప్రదమౌతూనే వున్నదికూడా. ఇక్కడ హాస్పిటల్ పెట్టడంతో జనం ఎక్కువవ్వడంతో కొన్ని యిళ్ళు లేచి గ్రామం పెద్దదయింది. మెల్ల మెల్లగా ఆనాటి కానాడు సోడాకొట్లు, కిరాణాకొట్లు ఎక్కువౌతున్నాయి ఊళ్ళో. పనులు లేక కటకటలాడే పేద ప్రజకు రకరకాల ఉపాధులుకూడా లభిస్తున్నాయి. అలాగే ఇంకా అభివృద్ధి ఔతుంది. పల్లెలో రాబడి వుండదేమోనని భయపడే డాక్టర్లకు నా ఆసుపత్రే ఆదర్శమని నేను సగర్వంగా చెప్పగలను."

అలా మాట్లాడుకుంటూనే శ్రీనగేష్ గృహాన్ని సమీపించారు. వారికోసం ఎదురు చూస్తున్నట్టుగా శ్రీదేవి గుమ్మంలోనే నిలబడి వున్నది.

దీర్ఘకాలానంతరం సోదరుని చూచుకున్న శ్రీదేవి కొంతసేపు కళ్ళప్పగించి చూస్తూ శిలలా నిలబడి పోయింది.

ఏదో అనిర్వచనీయమైన బాధాపరితప్తతతో, సిగ్గుతో తలవాల్చి నిలబడి పోయింది జయశ్రీ.

శ్రీనగేష్ జాగ్రత్తగా శ్రీపతిని పరీక్షిస్తూ నిల్చున్నాడు.

ఇల్లంతనూ, శ్రీదేవినీ పరీక్షగా మార్చి మార్చి చూస్తూ ఏదో ఆలోచించసాగాడు, శ్రీపతి గంభీరంగా.

"వీరు మా అమ్మగారండి. పేరు శ్రీ దే వి." అన్నాడు నగేష్ శ్రీపతితో.

"అలాగా? సంతోషం!" అన్నాడేకాని ఆపేరు అతడిలో ఏదో సంచలనం తెచ్చినట్టే కన్పట్టింది శ్రీనగేష్‌కు.

"ఎలావుంది హాయిల్లు?" అడిగాడు శ్రీనగేష్ శ్రీపతిని.
"ఇంటికేం? దివ్యంగావుంది."

"దామ్మా. ఇలా కూర్చుందాం." అన్నది శ్రీదేవి.

జయశ్రీ నెమ్మదిగా వెళ్ళి మేనత్త ప్రక్కన కూర్చుంది. తనను చూడగానే, దీర్ఘకాలానంతరం పిచ్చి అన్నగార్ని చూడగానే శ్రీదేవి కదలి కదలి ఏడుస్తూ విచారం వ్యక్తీకరిస్తుందనీ, ఇంతకాలం వచ్చి తమను చూడనందుకు పలువిధాల క్షమాపణలు కోరుకుంటుందనీ భావించిన జయశ్రీ అంచనా పొరపాటైంది. సాధారణుల ఊహాపోహలకు అందని వ్యక్తిత్వం శ్రీదేవిది. అతి సాధారణంగా యోగక్షేమాలూ, శ్రీపతి యొక్క ప్రస్తుత పరిస్థితినీ మాత్రం కనుక్కున్నది శ్రీదేవి.

"మాటలూ, ప్రవర్తనా అంతా చాలతెలివిగానే ఉన్నాయే!" అన్నది శ్రీదేవి, కొంత తడవు శ్రీపతిని పరీక్షగా చూచిన అనంతరం. సన్నగా నిట్టూర్చింది జయశ్రీ. "ఔను. ఆ ఒక్క విషయంలో మినహాగా నాన్న తెలివికి మరే లోపమూ లేదత్తయ్యా." అన్నది విచారం వ్యక్తం చేస్తున్న కంఠంతో.

వంట మనుష్యులు కాఫీ ఫలహారాలు తెచ్చి అందిస్తూంటే ఆశ్చర్యంగా చూచాడు శ్రీపతి. మళ్ళీ ఇంటినంతనూ, శ్రీదేవిని

పరీక్షగా చూచాడు. ''ఏమండీ! మిమ్మల్ని, మీయింటినీ అంతేనూ ఇదివరలో ఎప్పుడో చూచినట్లూ, ఎరిగున్నట్లూ అన్పిస్తోందేమిటి నాకు ?'' అన్నాడు హఠాత్తుగా శ్రీదేవితో.

శ్రోతలు ముగ్గురూ ఉలిక్కిపడ్డారు. శ్రీపతిలో తా మాశించిన మార్పు కొలది మాత్రంగానైనా కన్పిస్తూన్నందుకు అందరి ముఖాలూ ఆనందంతో వెలిగిపోయాయి.

తిరిగి తానే అన్నాడు శ్రీపతి ''మీ పద్ధతులూ, మీగృహమూ అంతా పట్టణ వాసాలలో మాదిరిగా వున్నది కాని, ఎక్కడా పల్లె పోకడలే లేవండీ!''

శ్రీనగేష్ యుక్తిగా అన్నాడు, ''మాకు కూడ మిమ్మల్ని పూర్వం ఎప్పుడో చూచినట్లే అన్పిస్తూన్నదండీ, గుర్తు చేసుకోండి, ఒకవేళ ఎప్పుడైనా పాత పరిచయం వున్నదేమో?''

చాలా సేపు ఆలోచించిన శ్రీపతి, ''అయితే మీ నాన్నగారి పేరేమిటి ?'' అన్నాడు శ్రీనగేష్‌ను.

శ్రీనగేష్ చెప్పాడు: ''ఆయనపేరు శ్రీకంఠంగారు. నేను ఆయనదగ్గఱ వుండేవాడనుకాదు. ఇక్కడ మాతాతగారి దగ్గఱ పెరిగేవాడిని. నన్ను చూడడానికివస్తూ ఒకసారి దారిలో గుఱ్ఱం మీదినుండి పడి చచ్చిపోయారు।''

శ్రీదేవి అన్నది: ''ఒక్క కొడుకని ప్రాణాలన్నీ అతడి మీదనే నిలిపి వుండేవారు. తీరా అతడు ఎదిగివచ్చి ప్రయోజకుడయ్యే నాటికి చూచుకోలేక పోయారు.'' ఆమెకంఠం గాద్గదికమైంది.

ఈ సంగతులన్నీ వినడంలో శ్రీపతికి గతం లీలగానైనా జ్ఞాపకం రాగలదనే శ్రీనగేష్ ఆశ అడియాసే అయ్యింది. ఉన్నట్లుండి శ్రీపతి వదనంలో రౌద్రం తాండవించింది. తీవ్రమైన స్వరంతో అన్నాడు శ్రీనగేష్‌తో; ''అవునోయ్, మీసుఖాలూ, యిష్టాలే మీవికాని మీకు పెద్దవాళ్ల ప్రేమలతో పనేమిటి ? నువ్విక్కడ తాతగారింట్లో పెరుగుతున్నావ్ ? అక్కడ తండ్రి చచ్చాడూ ? అప్పుడు వెళ్ళావా ? ఏమిటిక నువ్వు కన్నతండ్రిని ఉద్ధరించినది ?''

ఆ ధోరణికి అలవడివున్న జయా, శ్రీనగేష్‌ల కేమీ ఆశ్చర్యం కలుగలేదు కానీ, శ్రీదేవి కొంచెం కంగారు జెందింది.

''అదే అత్తయ్యా వచ్చినచిక్కు। ఇంతవఱకూ యింత తెలివిగా మాట్లాడారా ? అంతలో అట్లా వచ్చేసింది ధోరణి. అది తగ్గించడానికే బావ తాపత్రయం.'' తగ్గుస్వరంలో జయశ్రీ మేనత్తకు విషయం వివరించింది.

''ఓ।'' అప్పటికి కుదుటపడింది శ్రీదేవి మనస్సు.

''ఎలాగైనా అసంభాషణ మళ్ళించివేయి బావా.'' అన్నది జయశ్రీ శ్రీనగేష్‌తో.

నగేష్‌మాత్రం అలాగే తొణకకుండా 'కీ' యిచ్చి వదలిపెట్టిన బొమ్మలాగా వాగుతూన్న మేనమామను పరీక్షగా తిలకించుచూ కూర్చున్నాడు.

''ఈ కాలపు యువకుల కిదే రోగం. నాకొడుకుల్ని చూచారా ? నామాట పెడచెవిని బెట్టి ఢిల్లీలో ఉద్యోగం చేస్తున్నారు। నేనేమైనా, కడకు చచ్చినా వాళ్ళకు బెంగవుండదు. వస్తారంటారా నేనుఛస్తే ?'' అంటూ శ్రీదేవిని సమాధానం చెప్పమన్నట్లుగా ఆమెవైపు చూచాడు.

ఆమె తికమక పడింది.

తల్లి కలవరపాటును చూచిన నగేష్, ''అమ్మా. వారికి మన యిల్లు చూపెట్టు.'' అంటూ ''రండి'' అన్నాడు రావుతో. అంటూనే తిన్నగా పూలమొక్కలున్న దొడ్లోకి దారి తీశాడు, సంభాషణకు ఆరంభంలోనే బ్రేక్‌పడడంతో, వాగ్ధోరణి మరచిపోయి శ్రీనగేష్ననుసరించాడు శ్రీపతి.

''హమ్మయ్య!'' తేలికపడ్డ హృదయంతో అన్నది జయశ్రీ. ''ఆ మాత్రంతోనే ఆగారు. ఇప్పుడెంత హంగామా చేస్తారోనని భయపడ్డాను.''

వాత్సల్యంతో పెదతరహా ఉట్టిపడేట్టు అంది శ్రీదేవి; ''భయపడకమ్మా, తగ్గిపోతుందిలే. అబ్బాయి పట్టిన కేసులన్నీ బాగుపడడమే చూచాను నేనింతవరకూ.''

పూలమొక్కల దగ్గఱకూర్చున్న శ్రీపతివదనం తిరిగి ప్రసన్ననిలయమై, బాగామాట్లాడడం చూచి అందరూ ముఖముఖాలు చూచుకున్నారు.

''రండి ఇల్లుకూడా చూపివచ్చి కూర్చుందాం.'' అన్నది శ్రీదేవి తెలియక.

''చూడవచ్చులే'' అంటూ సైగచేసి వద్దని వారించాడు శ్రీనగేష్.

మరిమాట్లాడకుండా శ్రీదేవి జయశ్రీ అక్కడే కూర్చున్నారు.

కొద్దిసేపు ఆమాటా ఈమాటా మాట్లాడుకునేసరికి డాక్టర్ కోసమై ఎవరోవచ్చారు ఆక్రోశిస్తూ, ''బాబూ నా బిడ్డ చచ్చిపోతోంది. బ్రతికించాలి.''

వెంటనే లేచినిల్చున్నాడు శ్రీనగేష్. ''ఏమిటి జబ్బు ? ఏడవకు ఇప్పుడేవస్తాను.''

''ఏంచేయిబాబూ. మసూచికంపోసింది. దానికివైద్యం ఎందుకురమ్మని ఊరుకున్నాం. ఇప్పుడేటో పిల్లకళ్ళు తేలేస్తున్నది.''

''పదపదత్వరగా'' మరినిలబడలేదు శ్రీనగేష్. వెళ్లిపోతూనే అన్నాడు శ్రీపతి, జయశ్రీలతో ''మీరు కొంచంసేపు కూర్చుని

వెళ్ళండి. అవతల ప్రాణాలతోపని!'' అంటూనేవున్నాడు. మరు క్షణంలోనే వీధిలోకి వెళ్ళిపోయి కనుమరుగయ్యాడు.

విధినిర్వహణలో సర్వాన్నివిస్మరించిన అతిడి గాంభీర్యాన్నీ ప్రాణరక్షణకై స్వార్ధరహితంగా ప్రవర్తిస్తూన్న అతడి అమోఘ సుస్వభావాన్ని విస్మయ విస్ఫారిత నేత్రాలతో తిలకిస్తూన్న జయశ్రీతో అన్నది శ్రీదేవి; ''ఇదేపరసతల్లీ ఎదుటివాడికష్టం తనదేఅనుకుని నిల్చున్న పాటున పరుగెత్తడం, నిప్పుల్లోదూకడం కూడాచేస్తాడు. ఎటువంటి జబ్బైనా, ఎలాంటి అంటురోగమైనా వెళ్ళిపోవడమే కాని వెనుదీయడం, ఏమాత్రం ఆలోచించడంలేదు. డాక్టర్లకు అటువంటి చొరవా, త్యాగమూ, తెగింపూ అవసరమే కాని, మరీ అంతగా తనను తాను విస్మరించడం మంచిదికాదు. చెప్పి చెప్పి నా నోరు నొప్పి వచ్చిందేకాని, వాడిలో మార్పులేదు. కట్టుకున్నది వుంటే, కాస్త దానిమాట విను నేమో?.......''

ఇంకా ఆమె మాటలు పూర్తికానే లేదు.

''ఆఁ. పిచ్చి!'' అని తేలికగా ఆమె మాట తీసేస్తూ లేచి నిల్చున్నాడు శ్రీపతి. ''పెద్ద ఆర్భాటాలు కానీ, లేని ఆయువునెవడు పోస్తాడు? నర్సులూ, డాక్టర్లూ ఎవళ్లూ ఏంచేయలేరు. అంతా మిధ్య.'' అని కుమార్తె వైపు తిరిగి ''లేఅమ్మాయ్. ఇక వెళ్దాం'' అన్నాడు.

ఆ మాటకు శ్రీదేవికి కోపం వచ్చిందేమోనని భయపడి అటు చూచింది జయశ్రీ. కాని అటువంటి దేమీ లేదు శ్రీదేవి ఒక చిన్న నవ్వునవ్వి ఊరుకుంది.

''వెళ్ళొస్తానత్తయ్యా.'' తప్పనిసరిగాలేచి తండ్రి నను సరించింది జయశ్రీ.

''ఎప్పుడైనా వస్తూండండి.'' వీధి గుమ్మంవరకు సాగనంపింది శ్రీదేవి.

వచ్చేప్పుడు బండిలో తీసుకువచ్చిన ఆ స్త్రీ మంగళా ప్రత్యక్షమైంది. ఆమెచే శ్రీదేవి బొట్టు పెట్టించి, పూలమాల యిప్పిస్తూంటే ఆ మర్యాదలకు ఎంతైనా ఆశ్చర్యపోయింది జయశ్రీ. తిరిగి ఆమెకూడ తమతోపాటు బండి ఎక్కివస్తూంటే మాత్రం మరి ఋన్నకుండ లేకపోయింది. ''ఆమెను శ్రమపెట్టకత్తయ్యా. మేము వెళ్తాంలే'' అన్నది.

''అయితే నేమమ్మా? రానీయ్. మిమ్మల్ని దిగవిడచి మళ్లీ బండిలోనే వచ్చేస్తుంది. బండివెంట ఓ నౌఖరుకూడా వస్తున్నాడు. మీనాన్నను కాస్త జాగ్రత్తగాచూస్తాడు, దారిలో గొడవలేకుండా'' అన్నది శ్రీదేవి మెల్లగా.

బండిలో వుంచబడిన ఫలాలనూ, కాయగూరలనూచూచి మరింత ఆశ్చర్యపోయింది జయశ్రీ. శ్రీపతికి మాత్రం ఈ గొడవ లేమీ అంతగా పట్టలేదు. ఏమిటో గొణుక్కుంటూ, విసుగ్గా నొసలు చిట్లిస్తూ, తల సవరించుకుంటూ వెళ్లిపోయాడు, శ్రీదేవితో కనీసం వెళ్తున్నా మన్న మాటైనా చెప్పకుండా.

ఇల్లు జేరేవరకూ జయశ్రీ మనస్సులో ఎన్నో ఆలోచనలు వలయాలు చుట్టాయి. 'ఏమైనా ఈ అత్తయ్యనూ, బావనూ నేను సరిగా అర్థం జేసుకోలేక పోయాను. జ్ఞాన మెరిగిన తర్వాత అంతగా రాకపోకలు లేకా, పట్నవాసాలు మరిగి నేను ఈ బావనూ, బావ ఆదర్శాలనూ అసహ్యించుకున్నాను కానీ, ఏలోటూ లేక, ఆనందంగా గడిచేది పల్లెవాసమైతేనేం?'

అందుకే ఇంకా అత్తయ్యను గురించి, బావను గురించీ మాటలలో వివరంగా తెలుసుకోవాలనే ఆకాంక్షతో మంగమ్మను బండిదిగి లోపలికివచ్చి కొంత సేపు కూర్చుని వెళ్లమని మర్యాదకు అన్నట్లు అన్నది.

కాని మంగమ్మ అంగీకరించలేదు. ''అమ్మగారు నాకోసం చూస్తూంటారు. వారికి సాయం పూజా సమయమైంది. అబ్బాయి గారు వచ్చేసరికి స్నానానికి నీళ్ళు కాచివుంచాలి. వంటపూర్తి చేయాలి.''

''ఈ శీతాకాలంలో కూడా సాయంత్రం స్నానమేమిటి?''

నవ్వింది మంగమ్మ, ''ఎటు వంటి వాతావరణంలోనైనా నాసరే రోగుల యిండ్లకు వెళ్లివస్తే స్నానంచేయనిదే ఒప్పుకోరు అమ్మగారు.''

''అయితే తప్పకుండా తల్లిమాట పాటిస్తారన్నమాట-పసిబిడ్డలాగ!''

మళ్లీ నవ్వింది మంగమ్మ. ''అలాగనకండమ్మా పసిబిడ్డ కాదు-పరమ యోగ్యులు అబ్బాయిగారు. వారేమిటి-అమ్మగారూ అంతే. తల్లికి తగిన బిడ్డ. కుమారునిపై తల్లికి ప్రేమ. తల్లిపై పుత్రునికి ప్రేమ. ఇద్దరికీ ఒకరిపై ఒకరికి గౌరవం. ఇటువంటి వారు అరుదుగావుంటారమ్మా.''

ఏవో ఆలోచనలలో మునిగిపోయి జయశ్రీ పరధ్యానంగా నిలబడిపోయింది. బండి కదలిపోయింది, ''వెళ్తున్నానండి అమ్మాయిగారూ,'' అని మంగమ్మచెప్పిన మాటలు జయశ్రీ కర్ణపుటాలను సోకనే లేదు.

రాత్రి స్నానానంతరం భోజనానికి వచ్చికూర్చున్న కుమారునికి వీవన విసరుతూ దగ్గఱ కూర్చుంది శ్రీదేవి.

''పాపం చాలా గడుకేసమ్మా. బ్రతికించగలననే ధైర్యంగా వున్నది'' అన్నాడు నగేశ్ అన్నం కలుపుకుంటూ.

''కాస్త భోజనమైనా కుదురుగా చెయ్యిబాబూ. ఇక్కడకూడా ఆ రోగాలూ రొష్టులూ సంగతిదేనికి?''

కొంత సేపు ఎవరూ మాట్లాడలేదు.

''వారిని తీసుకువచ్చి నేను వెళ్లిపోయినందుకు మామయ్యా, జయా ఏమీ అనుకోలేదామ్మా?'' అనడిగాడు శ్రీనగేశ్ తలెత్తి.

"ఏమీ అనుకోలేదు, అమ్మాయి అన్నీ తెలిసినదేగా?" అంటూ శ్రీపతి మాటలను క్లుప్తంగా చెప్పింది శ్రీదేవి.

"ఫర్వాలేదమ్మా, ఆయనకూ తగ్గ గలదనే నా నమ్మకం."

"కాని, అబ్బాయ్. మరీ నీ మొండితన మేమిటో నా కర్థం కాకుండా వున్నది. ఎటువంటి రోగం దగ్గర కైనా నిల్చున్న పాటున పరిగెడతావే. నిద్రాహారాలు మాని వైద్యమూ చేస్తావు, సేవాచేస్తావు ఇవన్నీ చాలక ఈ గొడవ ఒకటా? మొన్న కూతురిపీకే నొక్కిన వాడు, హెచ్చు తగ్గులు వస్తే నిన్ను వదలిపెడతాడా?"

పకపకా నవ్వేశాడు శ్రీనగేశ్. "బాగున్నాయమ్మా నీభయాలూ అనుమానాలూను! ఆ రోజు కారోజు నీదృష్టికి నేను మరీ పసి వాడినై పోతున్నాను కదూ? అయినా, ఊరికే పైపైకి అలా అంటావు కాని, నీ అన్నగారికి నయంకావాలని నీకు మాత్రం లేదూ?"

"ఏమో బాబూ? నీ విషయం నువ్వుకాస్త ఎప్పుడైనా ఆలోచించు కుంటావా?"

నిండుగా నవ్వాడు శ్రీనగేశ్, "చల్లని తల్లివి, అహర్నిశలూ నన్ను నీ మాతృప్రేమ పహరా కాస్తూంటే నాకేం భయమమ్మా. ఇక నా విషయమై నేను ఆలోచించు కోవడం దేనికి?"

చిరుకోపం నటించింది శ్రీదేవి. "ఇలాగేనన్ను మాటలతో మరపించుతూ రోజులు గడిపేయి. పెద్దదాన్ని. ఎప్పుడు 'హరీ' మంటానో తెలియదు. అప్పుడు నిన్నెవరు చూస్తారు? పసివాడు మురళి నెవరు చూస్తారు? నీజీవితానికి సుఖమక్కర లేదా?" ఆపుకోజాలని ఆవేశం అశ్రురూపం దాల్చింది.

తలెత్తకుండా మౌనంగా భోజనంచేస్తున్న శ్రీ నగేష్‌నుండి ఒక్క బలమైన నిట్టూర్పు మాత్రం వెలువడింది.

"ఎన్నాళ్ళు అలావుంటావ్? నువ్వు ఎలాటి పిల్లకావాలంటె అటువంటి పిల్లను వెదకి రప్పిస్తాను."

శ్రీనగేష్ మౌనం విడువలేదు.

"మాట్లాడవేమిటి? మౌనమే మందనుకుంటున్నావా?"

భోజనం ముగించి, చేయి కడుక్కుంటూ అన్నాడు శ్రీనగేష్ "ఇక నాకు అటువంటి ఆశలు లేవమ్మా. ఈదౌర్భాగ్య జీవితం యిలా గడచిపోనీయ్."

శ్రీదేవి వదనం క్రోధోద్దీప్తమైంది. "ఇదుగో, ఇదేఆఖరు సారి నీకుచెప్పడం. మరొకసారి నాచెవిన ఆమాట పడడానికి వీలు లేదు. నీకేం, లక్షణంగా రాకుమారుడిలాగా! ఏంతక్కువని కాంచన పుష్పాలతో పూజిస్తూ ఏభాగ్య శాలిని ఎదురు చూస్తూన్నదో నీకోసం ఎవరికి తెలుసు? ఇక నిన్నెప్పు డడిగినా యిదేసమాధానం చెప్తున్నావు గనుక మరి నిన్ను అడగవలసిన అవసరమే లేదు. నాకు నచ్చిన పిల్లను కుదిరిస్తాను. లక్షణంగా చేసుకోవడమే నీవంతు." ఫర్మానా జారీచేసేసి హుందాగా లేచి వెళ్ళుతూన్న తల్లిని చూస్తూ నిర్లిప్తంగా నవ్వుకున్నాడు శ్రీనగేష్.

•

హాల్లో కూర్చొని, రస్సెల్ సైకాలజిగ్రంథం చేతబట్టిన అతనికి ఈ రోజు ఎప్పటి మాదిరిగా పఠనంపై మనస్సు లగ్నం కాలేదు. గత వర్తమాన విశేషానేకం మనస్సులో మెదులుతూండగా పరధ్యాన్న వశపరచు కొన్నది అతడిని. ఇంతకు ముందే తల్లిమాటలలోని 'కాంచన పుష్పాలు' అనేపదం వినగానే హఠాత్తుగా అతడికి కాంచన ప్రతిమవంటి శ్రీలక్ష్మి గుర్తుకు వచ్చింది. 'సౌమ్యమూర్తి!' అనుకున్నాడు. అవును. అందుకే అమ్మను ఆకర్షించింది. బహుశః ఆమెకు లోలోపల ఏదో అభిప్రాయం, ఆశవున్నట్లున్నాయి శ్రీలక్ష్మిపై. అందుకే ఆమెనంత ఆదర సత్కారాలతో ముంచెత్తి సాగనంపింది. కాని...... ఆతర్వాత అంతవిసుగుదల కనపరచిందేమిటి? మళ్ళీ ఆవిషయం తనకూ గుర్తు లేదు. అమ్మకూడా ఆప్రసక్తి ఏమీ తీసుకురాలేదు; .............ఇంతకూ...... శ్రీలక్ష్మిని శ్రీపతిగారు ఆ రోజున చూడనేలేదు. చూచివుంటే ఆయన మనస్సులోని భావాలలో కదలికలు ఎట్లుండేవో!' మెరుపువంటి తన ఆలోచనకు తానే మురిసి పోయాడు శ్రీనగేష్.

ఆలోచిస్తూ పేజీలు తిరగేస్తూన్న అతడికి తల్లి వచ్చిఎదురు కుర్చీలో కూర్చోవడంతో యోచనా భంగమైంది.

"ఏమిటమ్మా?" అన్నాడు పుస్తకం ప్రక్కన పెడుతూ.

"ఆఁ ఏంలేదూ................" ఆవదనంలో అంతకు ముందు కలిగిన అప్రసన్నతా రేఖలు ఛాయా మాత్రంగాకూడ జాడలేవు. "జయశ్రీ చాలా చక్కటిది, అణకువైనదీ సుమా! వెనుక ఏదో చిన్నతనంవల్ల అలా తెలివితక్కువగా ప్రవర్తించిందేమో!"

శ్రీనగేష్ మౌనంగా కుర్చీతో వెనక్కువాలి కళ్ళుమూసుకున్నాడు.

"చాలా తెలివైనదీ, ఛలాకీ అయినదీ, నాకు కావలసిన చదువున్నదీ; అందమున్నదీ. ఇంకేంకావాలీ?"

"ఆస్తికూడావుంది." అలా కళ్ళుమూసుకు పడుకునే తల్లికిమరొక విషయం జ్ఞాపకం చేశాడు శ్రీనగేష్.

"చాల్లేరా, నీహేళన!" నవ్వేసింది. శ్రీదేవి. "నాకీ అమ్మాయి అన్నివిధాలా నచ్చింది. మేనకోడలే అనుకో. అయితేనేం, వెనకటిలా కాక యిప్పుడు ఒప్పుకుంటుంది. మనిషిచాలా మారినట్టు కన్పిస్తూంది. అదీకాక, పాపం ఆ పిచ్చితండ్రి మినహా మరెవ్వరున్నారు? జీవితానికో గమ్యం, రక్షణ అవసరమేనని ఈపాటికి ఆమెకూడా గుర్తించి వుంటుంది."

"...............".

"మంచిరోజు చూచి కదుపుతాను. అమ్మాయితోనే ముందు మాట్లాడి ఆపైన తండ్రితో చెప్పవచ్చు. అయినా ఆ అమాయకుడికి అంత ఆలోచనా, అనుజ్ఞయిచ్చే అర్హతా ఏమున్నాయిలే పాపం!"

"..............."

"అదేమిరా?" చోద్యంగా చూచింది శ్రీదేవి. "నేనెన్ని వాగినా మాట్లాడవేమిటి? జయశ్రీని అడుగుతాను. ఏమంటావ్?"

"ఏమంటాను—నాఖర్మంటాను! రెండోపెళ్ళివాడు నాకక్కర లేదని చెప్పుదెబ్బ కొట్టినట్లు సమాధానం చెప్తుంది. అడుగు అంత సరదాగావుంటే." విసుగ్గా కుర్చీలోంచి లేచిపోయి కోటు తొడుక్కుంటూ అన్నాడు; "ఏదో విధంగా అవివాహితలైన ఆడపిల్లలు మనింటికి రావడం — వాళ్ళగురించి నువ్వు రకరకాల ఊహలు పెంచుకుని, నా ప్రాణాలు తీయడం ఇక ఇలాగే సాగుతూంటే ఈ పెద్యానికి — ఏదో ఓనాడు ఈ లోకానికికూడా ఓనమస్కారం పారేయ వలసివస్తూంది." అంటూనే లేచి పడగది లోకిపోయి పడుకున్నాడు. మరి తర్కానికి అవకాశ మీయకుండా.

"నీఖర్మకాదు. అంతా నాఖర్మ." వెనుకనుంచి తల్లి శ్రీదేవి అన్నమాటలు అతడికి వినిపించకపోలేదు.

(సశేషం)



# కూలివాడు

తెలగతోట రామకృష్ణకవి

జేనెఁడుపొట్ట నింపుకొనుచేఁత నెఱుంగక నిత్యయాచనాం
భోనిధి నున్నితేలుపరిపూర్ణ దరిద్రుఁడ! కూలివాఁడ! క
ష్టనకు సైఁచునీసహనసంపద పుట్టెఁడుభస్మరాశి యై
నానుచు నున్న దీతెనుఁగునైష్ఠికసాదరదృష్టివృష్టిలోన్.

సుఖము విడనాడి నీ విల్లు చూడ కున్న
నిఖిలలోకమ్ము హాయిగా నిద్రవోవు,
తనువునుం దాఁచి నీ విల్లు దాఁట కున్న
అడుగు సైతంబు నడువంగఁ బుడమి వణఁకు

చెమట వెలార్చి రేపగలు చేసి యదేపనిగా శ్రమంబు; దై
న్యము విడిపోని నీయుదర మాఁకటిచిచ్చునఁ గాలు చున్న స్వా
ర్థ మభిలషింప; వాసపడి తాకవు కూలికిఁ బైన గాసు; నీ
సమధికతృప్త జీవనము క్ష్మాపతి కున్నదె? పోటిచేసినన్.

కొలము బైన్ సవరించునీపనులు నిగ్గుం దేఱి దేశంబులోఁ
జిరసౌఖ్యంబుసుగష్టముం గలిసి రాజీపడ్డ వీనాఁడు; స్వో
దరమాత్రుండవు కాని నీకృషి కృతార్థం బయ్యె; నీసేవలో
బరిడీ కన్పడ దింతయేనియును బాబూ! నానమస్కారముల్.

నీకష్టంబున కర్హమైన భృతినిన్ నేమంబుగా నిచ్చువాఁ
డే కన్పట్టఁ; డదేమిపాడియొ? దయాహీనంబుగా నిన్ను నెం
దాఁకంగూడను నిల్పఁజూచును పొగడ్తల్ సల్పుచున్ భృత్యకా!
తూకంబెచ్చఁగఁ గోలుపోయితివి నెత్రుంజచ్చె దేహంబులో.

కదలించునీచేతికష్టార్జితంబును బుడమి దోఁపుడుచేసి బొజ్జపెంచె;
చిందించునీవేఁడిచెమ్మటబొట్టులో మునుకవేసినచీమ ముక్తిఁ గాంచె;
చరియించునీకాలిచలువజాడలనీడ సోకినగటిక మస్తుగ ఫలించె;
ప్రకటించునీపరోపకృతిఁ గాంచినకాకి నీతిపాఠ మొకింత నేర్చుకొనియె;

సహనసంపన్న! నీత్యాగము హావణించి
నిఖిల జనతకుఁ బరితృప్తి నివ్వటిల్లె;
జరిగిపోనీక నీభావిసౌఖ్యపథము
దాఁచుకొను మన్న ధైర్యసంధానఫణితి.

నగమైపోయిన నీనిరామిషవపుస్సారంబు కాసంత నె
వ్వగతో నాఁకటి కోడెపెద్దపులి తెప్పంగొట్ట కొక్కింతయున్
దిగ్రమింగన్ గనిపెట్టియున్నది సముద్వేగంబుఁ గల్పించి తృ
ప్తిగఁ గష్టార్జిత మాని దేశమున శాంతిన్ నిల్ప దీక్షించుమా!



# "ఆంధ్రప్రదేశ్‌లో స్వాతంత్ర్యోద్యమం"

సంపాదకులు : ఆచార్య ఎం. వెంకటరంగయ్య

## ఆంధ్రప్రదేశ్‌లో స్వాతంత్ర్య ఉద్యమానికి చెందిన రాష్ట్ర సంఘంవారిచే ప్రచురించబడినది

*సంపుటి :–I* *1800 నుండి 1905* *(ఈ కాలంలో జరిగిన ఉద్యమం సంఘటనలకు సంబంధించిన వివరాలు యిందులో వున్నాయి)*

*ధర : రు. 12-00*

*సంపుటి :–II* *1906 నుండి 1920* *(ముద్రణలో ఉన్నది)*

*సంపుటి :–III* *1921 నుండి 1931* *(ఆంధ్ర రత్న దుగ్గిరాల గోపాలకృష్ణయ్య నిర్వహించిన విప్లవోద్యమం, అల్లూరి సీతారామరాజు వీరోచిత గాథలతోసహా యీ కాలంలో జరిగిన ఉద్యమాల సంఘటనలకు చెందిన వివరాలు యిందులో ఉన్నాయి)*

*ధర : రు. 21-00.*

*1, 3 సంపుటాల ప్రతులు దిగువచోట్ల విక్రయానికి లభిస్తాయి.*

ఆంధ్రప్రదేశ్ ప్రింటింగ్, పబ్లికేషన్స్ బ్యూరో
బషీర్బాగ్, హైదరాబాదు-29. ఫోను నెం. 34707

# మన విద్యుచ్ఛక్తి ప్రాజెక్టులు

వి. పార్వతీశం

భారతదేశంలో లభ్యమయ్యే బొగ్గు, లిగ్నైట్, యురేనియం, చమురు, స్వాభావికమైన పరిశుద్ధమైన వాయువులు వంటి ప్రాథమిక శక్తి ఉత్పాదకముల నుండి అయినా విద్యుచ్ఛక్తిని ఉత్పత్తి చేసుకోవచ్చు. మనకు అందుబాటుగా బొగ్గు నిధులు సుమారు 6,00,000 లక్షల టన్నులవరకు మన భూగర్భంలో నిక్షిప్తమై వున్నాయని అంచనా. వీనిలో చాలా భాగం బీహారు, పశ్చిమ బెంగాలు రాష్ట్రాలలోనే వున్నాయి. అస్సాం, మధ్యప్రదేశ్, మహారాష్ట్ర, ఒరిస్సా, ఆంధ్రప్రదేశ్ రాష్ట్రాలలో ఓమాదిరి నిక్షిప్తంవుంది. అదిగాక మద్రాసు, రాజస్థాన్, గుజరాతు, జమ్మూ—కాశ్మీరులలో సుమారు 20,000 లక్షల టన్నుల లిగ్నైట్ నిధులు వున్నాయని అంచనా.

జలవిద్యుచ్ఛక్తికి కూడా అధిక ప్రాముఖ్యత వున్నది. బొగ్గు, చమురు, స్వాభావిక, పరిశుద్ధ వాయువులు, అణుయింధనాలు మొదలైన వాటితో విద్యుచ్ఛక్తిని ఉత్పత్తి చేసినప్పుడు ఆయా మూలకములు తరిగిపోవడంవల్ల – అంటే మండిపోవడంవల్ల – విద్యుచ్ఛక్తి లభ్యమౌతుంది. జలవిద్యుచ్ఛక్తి విషయంలో అలా కాదు. ప్రవాహ జలాలలో అపరిమితమైన విద్యుత్తు వుంది. దేశంలోని నదీజలాల ద్వారా లభ్యంకాగల విద్యుచ్ఛక్తిని గూర్చి ఒక పద్ధతిలో వినియోగంలోకి తీసుకొచ్చే బృహత్ప్రయత్నాన్ని 1953 లో కేంద్ర జలవిద్యుచ్ఛక్తి మండలి చేపట్టింది. ఎక్కడెక్కడ జలవిద్యుత్తు లభ్యం కాగలదో ఆ యా ప్రాంతాలను భౌగోళిక పటాలమీద గుర్తుపెట్టింది. అక్కడ వర్షపాతాన్ని, ప్రవాహవేగాన్ని, నదీజలాలకు సంబంధించిన సమాచారాన్ని సేకరించి, ఎంత మొత్తంలో జలాలను నీటిసాగు, వరదనిరోధక, జలమార్గాలు మొదలైన అవసరాలకు వినియోగ పడతాయో వూహించి, ఆమేరకు మినహాయింపు జేసి, మిగిలిన మొత్తాన్నుండి ఎంతమేరకు విద్యుచ్ఛక్తిని ఉత్పత్తి చేయవచ్చో భేరీజువేసింది. సాంకేతికంగానూ, ఆర్థికంగానూ మనం ఉత్పత్తి చేయడానికి అందుబాటులో వున్న విద్యుచ్ఛక్తి 410 లక్షల కిలోవాట్లు అని అంచనా వేశారు.

ఆంధ్రప్రదేశ్‌లో 30 లక్షల కిలోవాట్ల జలవిద్యుదుత్పాదక శక్తి, 40,000 లక్షల టన్నుల బొగ్గు నిధులు వున్నాయి. హైదరాబాదులో హుస్సేన్‌సాగర్ సరస్సువద్దవున్న థర్మల్‌స్టేషను ఆంధ్రప్రదేశ్‌లోకెల్లా అతి పురాతనమైనది. ఇది 1923 లో పని ప్రారంభించింది. తెలంగాణా ప్రాంతంలో విద్యుచ్ఛక్తి అభివృద్ధి అంటే ఆంధ్రప్రదేశ్‌రాష్ట్రం ఏర్పాటుఅయ్యేవరకు కేవలం జంటనగరాలకు మాత్రమే పరిమితమై వుండేది. ఆంధ్రప్రాంతంలో యిరవయ్యో శతాబ్దపు ద్వితీయ దశాబ్దంలో విద్యుచ్ఛక్తి అభివృద్ధి చాలా పరిమితంగానే– అదిన్నీ ప్రయివేటు సంస్థల అధ్వర్యంలోనే–జరిగింది. 1938 లో విశాఖపట్నం, విజయవాడ థర్మల్ స్టేషన్‌లను ప్రారంభించి రాష్ట్ర ప్రభుత్వం భారీఎత్తున విద్యుదుత్పాదనకు పూనుకుంది.

ఆంధ్రప్రదేశ్ రాష్ట్రం ఏర్పాటైన అనంతరమే ఆంధ్ర ప్రాంతంలో జలవిద్యుచ్ఛక్తి అభివృద్ధి [illegible] 1955 ఆగస్టులో మాచ్‌ఖండ్ జలవిద్యుత్కేంద్రం, 1957 లో తుంగభద్ర జలవిద్యుత్కేంద్రం నెలకొల్పబడ్డాయి. దీనితో మొత్తం ఆంధ్ర ప్రాంతమంతటికీ జలవిద్యుత్తును అందజేసే ఒక సరఫరా జోనుక్రిందకు తీసుకురావడం జరిగింది. తెలంగాణా ప్రాంతంలో 1956 లో నిజాంసాగర్ జలవిద్యుత్కేంద్రం, 1957 లో రామగుండం థర్మల్ విద్యుత్కేంద్రాలు నెలకొల్పబడ్డాయి.

## కొన్ని విశేషాలు

ఇంగ్లీషువారి పరిపాలనలో చివరి అయిదేళ్ళలోనూ మన దేశంలో ఎంత విద్యుచ్ఛక్తిని ఉత్పత్తి చేసుకున్నామో అంతశక్తిని యీనాడు మనం ప్రతి ఏటా కొత్తగా నెలకొల్పుకుంటున్నాం.

విద్యుదుత్పాదనకు మనదేశంలో 1947 లో వున్న స్థాపిత యంత్రశక్తి 14 లక్షల కిలోవాట్లు. ఈనాడు అది 101 లక్షల కిలోవాట్లు.

1951 లో భారత దేశంలో తలసరి విద్యుచ్ఛక్తి వాడకం (మొత్తం వినియోగ మవుతున్న విద్యుచ్ఛక్తిని జనాభాతో భాగించగా వచ్చిన సంఖ్య) 15 కిలోవాట్–గంటలు. ఈ నాడు అది దగ్గర దగ్గర 50 కిలోవాట్–గంటలు వుంది.

భారతదేశంలో మొత్తం 5,63,238 పట్టణాలు, పల్లెలు వున్నాయి. వీటిలో 1947 నాటికి 4000 కు మాత్రమే విద్యుచ్ఛక్తి సౌకర్యం వుండేది. ఈనాడు 54,700 పట్టణాలు, పల్లెలకు ఆ సౌకర్యం లభిస్తున్నది. 5,000 జనాభాకు మించిన ప్రతి పల్లెకు యీనాడు విద్యుచ్ఛక్తి సౌకర్యం వున్నది.

తృతీయ ప్రణాళిక ఆరంభంలో ఆంధ్రప్రదేశ్‌కు సగటున 180 మెగావాట్ల విద్యుచ్ఛక్తి కావలసివుండేది. తృతీయ ప్రణాళికాంతానికి – అంటే 1965 – 66 నాటికి – 258 మెగావాట్ల విద్యుచ్ఛక్తిని ఉత్పత్తి చేసుకోగలిగాం. అసలు తృతీయ ప్రణాళిక ఆరంభంలో రాష్ట్రంలో 213 మెగావాట్ల స్థాపిత యంత్రశక్తి ఉండేది. 1963 – 64 లో మరొక 27.2 మెగావాట్ల స్థాపిత యంత్రశక్తిని నెలకొల్పుకోగలిగాం. అంటే ఒక్కొక్కటి 10 మెగావాట్లు ఉత్పత్తి చేయగల రెండు గ్యాసుటర్బో సెట్లుల్ని హైదరాబాదులో నెలకొల్పుకున్నాం. తుంగభద్రవద్ద నెలకొల్పిన 9 మెగావాట్ల సెట్టుద్వారా మన రాష్ట్రానికి తనవంతుగా 7.2 మె. వా. విద్యుచ్ఛక్తి లభిస్తుంది. హైదరాబాదు, తుంగభద్రలవద్ద నెలకొల్పిన సెట్లద్వారా మొత్తం 27.2 మెగావాట్ల విద్యుచ్ఛక్తి లభిస్తున్నదన్నమాట. కనుక 1-4-1964 నాటికి మన రాష్ట్రంలో 240.2 మెగావాట్ల స్థాపిత యంత్రశక్తి వున్నదని తేలుతున్నది. 1964–65లో ఒక్కొక్కటి 9 మెగావాట్ల విద్యుచ్ఛక్తిని ఉత్పత్తి చేయగలిగే మరొక మూడు యూనిట్టులు – ఒకటి తుంగభద్ర ఆనకట్టవద్ద, రెండు హంపివద్ద – నెలకొల్పబడ్డాయి. ఈ మూడు సెట్టుల ఏర్పాటువల్లా మనకు మన వాటాగా 21.6 మెగావాట్ల విద్యుచ్ఛక్తి లభిస్తుంది. నెల్లూరు థర్మల్ స్టేషను శక్తి 30 మెగావాట్లు. ఇదికూడా విద్యుదుత్పత్తి ప్రారంభించింది. అందువల్ల 1964–65 లో అదనంగా ఉత్పత్తి చేసుకోగలిగిన విద్యుదుత్పాదక శక్తి 51.6 మెగావాట్లు. దీనితో మొత్తం మన విద్యుదుత్పాదక శక్తి 291.8 మెగావాట్లు అయ్యింది. 1965–66లో కొత్తగా ఏ యూనిట్టూ నెలకొల్పబడలేదు. కనుక తృతీయ ప్రణాళికాంతానికి మన రాష్ట్రంలో విద్యుదుత్పాదక శక్తి 291.8 మెగావాట్లు ఉన్నదన్నమాట.

## అదనపు నిధులు

రాష్ట్రంలో విద్యుచ్ఛక్తి అవసరానికీ, ఉత్పత్తి చేయబడుతున్న మొత్తానికి మధ్యగల అంతరాన్ని శీఘ్రగతిని తొలగించే వుద్దేశంతో తృతీయ ప్రణాళికలో సాధ్యమైనంత అదనంగా నిధులను రాష్ట్ర ప్రభుత్వం విద్యుదుత్పాదనకు తరలిస్తున్నది. తృతీయ ప్రణాళిక ఆదిలో విద్యుదుత్పాదనకు రూ. 64.94 కోట్లు కేటాయించగా దానిని 90 కోట్ల రూపాయలకు పెంచింది.

తృతీయ ప్రణాళికలో అసంపూర్తిగా వదిలివేయబడిన పథకాలను కొనసాగించే చర్యగా 60 మె. వా. కొత్తగూడెం–తొలిదశ యూనిటు 1966 జూలైలో విద్యుదుత్పాదన ప్రారంభించింది. రెండవయూనిటు 1967 సంవత్సరారంభంలో ప్రారంభించవచ్చు. ఎగువసీలేరు తొలియూనిటు 1967 ఆగస్టులోనూ, రెండవ యూనిటు 1968 మార్చిలోనూ ప్రారంభించవచ్చు. 62.5 మె. వాట్ల రామగుండం 'బి' స్టేషను 1967 నవంబరులో ప్రారంభించవలసి వున్నది. కొత్తగూడెం 2వ దశక్రింద చతుర్థ ప్రణాళికలో మరొక రెండుయూనిట్లు—ఒక్కొక్కటి 60 మె. వాట్ల ఉత్పాదక శక్తితో 1967–68 నాటికి విద్యుదుత్పత్తిని ప్రారంభించగలవు.

కనుక 1967–68 సంవత్సరాంతానికి రాష్ట్ర విద్యుదుత్పాదక శక్తి 714.3 మె. వా. వుంటుంది.

ఈ పథకాలకుతోడు చతుర్థ పంచవర్ష ప్రణాళికలో యీ దిగువ పేర్కొన్న మరికొన్ని కొత్త పథకాలుకూడా చేపట్టబడతాయి.

1. కొత్తగూడెం – రెండవదశ విస్తరణ పథకం— ఒక్కొక్కటి 60 మె. వాట్లు శక్తిగల రెండుయూనిట్లు. ఈ పథకానికి యింకా మంజూరీ లభించవలసివుంది.

2. దిగువ సీలేరు జలవిద్యుత్పథకం. ఈ పథకం మంజూరీ అయినది. తొలిదశలో ఒక్కొక్కటి 100 మె. వా. శక్తిగల నాలుగు యూనిట్లను నెలకొల్పడం ఈ పథకం ఉద్దేశం.

శ్రీశైలం జలవిద్యుత్కేంద్రంలో పనికూడా చురుకుగా సాగుతున్నది. ఈ పథకంక్రింద తొలిదశలో ఒక్కొక్కటి 110 మె. వాట్లు శక్తిగల నాలుగు యూనిట్లను నెలకొల్పడం జరుగుతుంది. అదికాక కొత్తగూడెం థర్మల్ స్టేషను విస్తరణగా 125 మె. వా. శక్తిగల నాలుగుయూనిట్లను, 250 మె. వా. శక్తిగల రెండు యూనిట్లను చతుర్థప్రణాళికలో నెలకొల్పడానికి సంబంధించిన పథకం ఒకటి రూపొందింది. దీనిని రాష్ట్ర విద్యుచ్ఛక్తి మండలి, ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం చాలా ఆసక్తితో పరిశీలిస్తున్నాయి.

## చతుర్థ ప్రణాళిక కేటాయింపు

ఆంధ్రప్రదేశ్‌కు సంబంధించిన చతుర్థ ప్రణాళిక ముసాయిదాలో విద్యుచ్ఛక్తి అభివృద్ధికి రూ. 200 కోట్లు కేటాయించబడ్డాయి. అయితే యీ మొత్తంలో చతుర్థ ప్రణాళికలో శ్రీశైలం ప్రాజెక్టు పనులకు అవసరమయ్యే రూ. 35 కోట్లు చేర్చబడలేదు.

ఈ సందర్భంలో ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర విద్యుచ్ఛక్తి మండలిని గురించి కొంత యిక్కడ ప్రస్తావించడం అవసరం. ఈ మండలి 1959 ఏప్రెలులో ఏర్పాటైనది. విద్యుచ్ఛక్తి ఉత్పత్తి ట్రాన్స్‌మిషన్, ట్రాన్స్‌మిషన్‌ల ప్రధానలైనుల నిర్వహణలను అప్పట్లో ప్రభుత్వమే చేపట్టేది. ఆ పనులన్నీ 1962 ఏప్రెల్ నుండి ఈ మండలికి బదిలీ చేసివేయడం జరిగింది. అంతర్‌రాష్ట్రీయ విషయాల కోవలోకివచ్చే పవర్‌హౌస్‌లతోసహా మాచ్‌ఖండ్, తుంగభద్ర కేంద్రాల ప్రధానమైన పనులన్నీ ప్రభుత్వమే చూసుకుంటుంది. అంతర్‌రాష్ట్రీయ విషయాల పరిశీలనతో సంబంధంలేని పథకాలన్నీ, కృష్ణా గోదావరీ నదీజలాల వివాదంతో సంబంధంలేని పథకాలను కూడా విద్యుచ్ఛక్తిమండలే 1963 ఏప్రెలు 1 నుంచి చూసుకుంటున్నది. అంతర్‌రాష్ట్ర ప్రాజెక్టుల విషయంలో ఈ మండలి, ఆంధ్రప్రదేశ్ వాటాకు పంపిణీచేసే ఏజంటుగా వ్యవహరిస్తుంది.

ఆంధ్రప్రదేశ్‌లో వున్నట్టీ, నిర్మింపబడుతున్నట్టీ థర్మల్, జలవిద్యుచ్ఛక్తి కేంద్రాలను గూర్చిన సంక్షిప్త పరిచయం యీ దిగువ ఈయడమౌతున్నది:

## మాచ్‌ఖండ్ జల విద్యుచ్ఛక్తి పథకం

(1వ దశ, 2వ దశ)

ఆంధ్రప్రదేశ్, ఒరిస్సా రాష్ట్రాలు రెండూకలిసి చేపట్టిన పథకం యిది. ఈ రెండు రాష్ట్రాలూ పెట్టుబడిని, విద్యుచ్ఛక్తిని 70:30 శాతంలో పంపిణీ చేసుకుంటాయి. ఈ పథకాన్ని ప్రభుత్వమే అమలుపరుస్తున్నది.

గోదావరికి ఒకచిన్న ఉపనది అయిన మాచ్‌ఖండ్‌నదీ జలాలను దుడుమ జలపాతంవద్ద అడ్డగించి, నదికి కుడివైపుగట్టున విద్యుచ్ఛక్తిని ఉత్పత్తిచేసేందుకు యీ పథకం రూపొందించ బడింది. ఈ పథకం క్రింద 1, 14, 750 కి. వా. స్థాపితయంత్ర శక్తికి అవకాశంవుంది. దీనిలో ఆంధ్రప్రదేశ్ రాష్ట్రంవంతు 70 శాతం.

దీనికి మొత్తం రూ. 1828 లక్షలు ఖర్చవుతుందని అంచనా. (సివిల్‌పనులు, పవర్‌స్టేషన్—సంయుక్తనిర్మాణాలు)

## తుంగభద్ర జలవిద్యుత్కేంద్ర పథకం

ఆంధ్రప్రదేశ్, మైసూరు రాష్ట్రాలు కలిసి యీ పథకాన్ని చేపట్టాయి. ఈ రెండు రాష్ట్రాలూ పెట్టుబడులను, విద్యుచ్ఛక్తిని 80:20 నిష్పత్తిలో పంచుకుంటాయి. తుంగభద్ర నదినుండి నీటిని సేద్యపు కాలువల్లోకి సాగుకై విడుదలచేసే రెండుచోట్ల—ఒకటి తుంగభద్ర ఆనకట్ట పక్క, మరొకటి తుంగభద్ర ఆనకట్టకు 14 మైళ్ళ దిగువ హంపీశిధిలాల వద్ద విడుదల నీటినుండి విద్యుచ్ఛక్తిని తయారుచేయడం పథకం లక్ష్యం.

ఒక్కొక్కటి 9 మె. వా. శక్తిగల ఎనిమిది జల విద్యుదుత్పత్తి సెట్లను (తుంగభద్ర ఆనకట్ట పవర్‌హౌస్‌వద్ద 4 సెట్లు, హంపి దగ్గర కెనాల్ పవర్ హౌస్ వద్ద 4 సెట్లు), నెలకొల్పడం యీ పథకం ఉద్దేశం. దీనిలో రెండు తుంగభద్ర ఆనకట్టవద్ద, రెండు హంపివద్దా ద్వితీయ ప్రణాళికలోనే నెలకొల్పబడ్డాయి. మిగిలిన నాలుగింటిలోనూ ఒకటి 1963–64 లోనే పూర్తయ్యింది. మిగిలిన మూడూ 1964–65 తొలి మూడు నెలల్లోనే నెలకొల్పడం జరిగింది. దీనితో యీ పథకం క్రింద గల అన్ని యూనిట్ల ఏర్పాటూ పూర్తయ్యింది.

ఈ పథకానికి మొత్తం ఖర్చు రూ. 8.46 కోట్లు అని అంచనా. (సివిల్ పనులు, పవర్ స్టేషను - సంయుక్త నిర్మాణాలు.)

## నిజాంసాగర్ జలవిద్యుత్కేంద్రం

నిజాంసాగర్ రిజర్వాయరు 1931 లో పూర్తయ్యింది. ఇక్కడ 29700 మి. ఘు. అ. నీరు నిలవ వుండే అవకాశం వుంది. రిజర్వాయరుకు దిగువ విద్యుదుత్పాదక కేంద్రం నెలకొల్పబడింది. ఇది కొన్ని ఋతువులలో మాత్రమే పనిచేస్తుంది. తొలి పంచవర్ష ప్రణాళికా కాలంలో ఒక్కొక్కటి 5000 కి. వాట్లు శక్తిగల మూడు యూనిట్లను పవర్‌హౌస్‌లో ఏర్పాటు చేశారు. నిజాంసాగర్ రిజర్వాయరు నుండి సాగుకై విడుదలయ్యే నీటిని బట్టి యీ కేంద్రం విద్యుదుత్పత్తి ఆధారపడి వుంటున్నది. ఈ కేంద్రం హుస్సేన్‌సాగర్ థర్మల్ స్టేషన్‌తో కలప బడి పనిచేస్తుంది. యర్రగడ్డ సబ్‌స్టేషనులో ఒకదానికొకటి కలపబడ్డాయి. దీనివల్ల హుస్సేన్‌సాగర్ వద్ద బొగ్గు వ్యయాన్ని యిది తగ్గిస్తున్నది.

మొత్తం ఖర్చు రూ. 2.398 కోట్లు అని అంచనా.

## ఎగువ సీలేరు జల విద్యుత్పథకం

గుంటవాడలో బాగా పల్లంలో ఒక మళ్ళింపు డియరీను నిర్మించి, ఒక్కొక్కటి 60 మె. వాట్లుగల రెండు జల విద్యుత్ యూనిట్లను ఏర్పాటుచేయడం ఈ పథకం వుద్దేశం. స్విట్జర్లాండ్ ఋణ ప్రాతిపదికమీద ఒక స్విస్ సంస్థకు ప్రాజెక్టు యంత్రాల నిమిత్తం ఆర్డరు యివ్వడం జరిగింది. విద్యుత్ ప్లాంటు, యంత్రాలు ప్రాజెక్టు స్థలానికి చేరుకున్నాయి. మరికొన్ని ప్లాంటు పరికరాలను పాకిస్తాను ప్రభుత్వం ఆ మధ్య జరిగిన సంఘర్షణ సమయంలో జప్తుచేసింది. వాటిని విడుదల చేయించేందుకు గట్టిగా ప్రయత్నాలు జరుగుతున్నాయి. గుంటవాడ వద్ద సివిల్ పనులు యించు మించు పూర్తయ్యాయి. ముందు కట్ట, ఆనకట్ట ముందుభాగం, ఇన్‌టేక్‌డాము, పెన్‌స్టాకు, పవర్‌హౌస్ భవనాల పనులు దాదాపుగా పూర్తికావచ్చాయి. విశాఖపట్నం జిల్లా, చింతపల్లి తాలూకా, చింతపల్లికి 40 మైళ్ళ దూరంలో పవర్ హౌసు వుంది. 1966 జూలై మొదటి వారంలోనే స్విట్జర్లాండు నుండి ప్రధాన యంత్రభాగం చేరుకుంది. టర్బైన్లను నెలకొల్పే



నిర్మాణంలో ఉన్న ఎగువ సీలేరు ప్రాజెక్టు

పని యిప్పుడు కొనసాగుతోంది. 1967 ఆగస్టు నాటికి 60 మె. వాట్ల శక్తిగల ఒక యూనిటును, 1968 మార్చి నాటికి మరొక యూనిటును పనిచేయించాలని భావిస్తున్నారు. సీలేరు జలాల వినియోగానికి సంబంధించిన ఒప్పందంపై 1962 సెప్టెంబరు 4 వ తేదీన ఆంధ్రప్రదేశ్, ఒరిస్సా ముఖ్యమంత్రులు సంతకాలు చేశారు.

దీనికి మొత్తం ఖర్చు సుమారుగా రూ. 17 కోట్లు అని అంచనా.

## దిగువ సీలేరు జల విద్యుత్పథకం—I వ దశ

మాచ్‌ఖండ్–సీలేరు నదీ పరీవాహక ప్రాంతంలో దిగువ సీలేరు జల విద్యుత్ ప్రాజెక్టు ఒక రకంగా కడపటి ప్రాజెక్టు అని చెప్పాలి. ఇక్కడి విద్యుత్కేంద్రంలో మొత్తం 100 మె. వాట్లు శక్తిగల 6 సెట్లను నెలకొల్పుతారు. ఈ పథకం తొలిదశలో రూ. 3500 లక్షల కేటాయింపుతో ప్రారంభించబడుతున్నది. 1965–66 లో ప్రాథమిక పనులు ఆరంభించబడ్డాయి. చతుర్థ ప్రణాళికాంతానికి యిది పూర్తవుతుంది. చతుర్థ ప్రణాళికలో యీ పథకాన్ని చేర్చడానికి ప్రణాళికా సంఘం ఆమోదం లభించింది.

డొంకరాయి వద్ద ఒక ఆనకట్టను నిర్మించడం, 9.6 మై. పొడవు కాలువను త్రవ్వడం, 1.25 మై. పొడవుగల హెడ్‌రేస్ సొరంగాన్ని త్రవ్వడం, పొల్లూరు వద్ద విద్యుత్కేంద్రం దగ్గర పెన్‌స్టాకులను నిర్మించడం యీ పథకంలోని ముఖ్య నిర్మాణాలు.

సివిల్ పనులు అప్పుడే ప్రారంభమయ్యాయి. ప్లాంటు తదితర పరికరాల నిమిత్తం సంప్రదింపులు జరుగుతున్నాయి. 1969 జూన్ నాటికి మొట్ట మొదటి సెట్టు విద్యుచ్ఛక్తిని ఉత్పత్తి చేస్తుంది. మిగిలిన సెట్లు చతుర్థ పంచవర్ష ప్రణాళిక ఆఖరు నాటికి పని ప్రారంభిస్తాయి.

దీనికి మొత్తం ఖర్చు రూ. 35 కోట్లు అవుతుందని అంచనా.

## శ్రీశైలం ప్రాజెక్టు

ఈ ప్రాజెక్టుకు ప్రణాళికా సంఘం అనుమతి, భారత ప్రభుత్వ అంగీకారం లభించాయి. రాష్ట్ర ప్రభుత్వం దాని పరిపాలనా అనుమతి 1961 సెప్టెంబరులో లభించింది. అయిదవ పంచవర్ష ప్రణాళిక ఆరంభంలో యీ ఆనకట్ట, విద్యుత్కేంద్ర నిర్మాణాలు పూర్తవుతాయని అంచనా. అయిదవ పంచవర్ష ప్రణాళిక మొదటి సంవత్సరమే 110 మె. వా. శక్తిగల ఒక యూనిటు విద్యుదుత్పత్తిని ప్రారంభిస్తుంది. మిగతా యూనిటులు 1972–73 లో ప్రారంభిస్తాయి. కాఫర్‌డామ్, మళ్ళింపు సొరంగం, మళ్ళింపు కాలువ, శాశ్వత రోడ్లు, సిబ్బంది గృహాలు, తదితర భవనాల నిర్మాణం చురుకుగా కొనసాగుతున్నాయి. 31–3–1966 నాటికి ఈ ప్రాజెక్టుపై దాదాపు రూ. 11.05 కోట్లు ఖర్చయ్యింది. ఈ ప్రాజెక్టు క్రింద ట్రాన్స్‌మిషన్ లైన్ల నిర్మాణాన్ని రాష్ట్ర విద్యుచ్ఛక్తి మండలి చేపట్టింది. ఈ ప్రాజెక్టుకు 1963 జూలై 24న ఆ నాటి ప్రధాన మంత్రి శ్రీ జవహర్‌లాల్ నెహ్రూ శంకుస్థాపన చేశారు.

దీనికి రూ. 45,75,48,000 ఖర్చవుతుందని అంచనా (నాలుగు యూనిట్లకు)

సివిల్ పనులు, విద్యుత్కేంద్రానికి రూ. 38.475 కోట్లు ట్రాన్స్‌మిషన్ లైనులకు, సబ్ స్టేషన్లకు రూ. 7.2791 కోట్లు.

నీటిపారుదల ప్రయోజనాలకు అంతరాయం కలుగకుండా తక్కువ ఖర్చుతో జలవిద్యుచ్ఛక్తిని ఉత్పత్తి చేయడానికి శ్రీశైలం ప్రాజెక్టు చక్కటి సౌకర్యాలు కలిగిస్తుంది. ప్రాజెక్టు స్థలం ఆంధ్ర ప్రదేశ్ రాష్ట్రం మధ్యన ఉన్నందున తక్కువ ఖర్చుతో విద్యుచ్ఛక్తిని వివిధ కేంద్రాలకు పంపిణీచేయడానికి వీలు కలుగుతుంది.

ఈ ప్రాజెక్టులోని ముఖ్యభాగాలు ఇవి : (1) కర్నూలు జిల్లాలోని ప్రసిద్ధ శ్రీశైలం దేవాలయం సమీపంలో కృష్ణ నది పై సదీగర్భం లోతట్టుపై దాదాపు 400 అడుగుల ఎత్తున గ్రానైట్ రాతితో ఆనకట్ట నిర్మాణం. (2) కుడివైపున



శ్రీశైలం జల విద్యుచ్ఛక్తి ప్రాజెక్టు

ఋతువులో ప్రధాన ఆనకట్టకు చెందిన లోతు పునాదుల పనిని ప్రారంభించాల్సి ఉంటుంది.

ఆంధ్రప్రదేశ్‌లోని పురాతన థర్మల్ విద్యుచ్ఛక్తి ఉత్పాదక కేంద్రాలలో రామగుండం థర్మల్ స్టేషన్, విజయవాడ థర్మల్ స్టేషన్, హుస్సేన్‌సాగర్ థర్మల్ స్టేషన్ విశాఖపట్నం పవరు హౌస్, నెల్లూరు థర్మల్ స్టేషన్ ముఖ్యంగా పేర్కొనదగినవి. హైదరాబాదులోని హుస్సేన్‌సాగర్ తీరంలో ఉన్న హుస్సేన్‌సాగర్ థర్మల్ స్టేషన్ చాలా పురాతనమైనది. ఆంధ్రప్రదేశ్ రాష్ట్రంలో ఇది రెండవ పెద్ద కేంద్రం. హైదరాబాదు, సికింద్రాబాదు జంటనగరాలకు, పరిసర ప్రాంతాల పారిశ్రామిక సంస్థలకు దీనిద్వారా విద్యుచ్ఛక్తి లభిస్తున్నది. ఒక్కొక్కటి 3000 కి. వా. శక్తిగల రెండు టర్బో సెట్టులతో యీ స్టేషన్ 1923 నుండి ఉత్పత్తి ప్రారంభించింది.

దశలవారీగా దీనిని విస్తరింపజేయడం జరిగింది. 1951లో 5000 కి. వా. శక్తిగల ఒక సెట్టును అదనంగా నిర్మించారు. ఒక్కొక్కటి 2500 కి. వా. శక్తిగల సెట్లను నెల్లూరునుండి యిక్కడికి తరలించి జంటనగరాల విద్యుచ్ఛక్తి అవసరాలను పూర్తిచేశారు. విజయవాడ థర్మల్ స్టేషన్ ఒక్కొక్కటి 1500 కి. వా. శక్తిగల రెండు సెట్లతో 1938 నుండి విద్యుచ్ఛక్తి ఉత్పాదన ప్రారంభించింది. ఆ తర్వాత దశలవారీగా 3000 కి. వా. శక్తిగల 3 సెట్లను అదనంగా యిక్కడ నెలకొల్పారు.

1939లో ప్రభుత్వశాఖ ఆధీనంలోకి తీసుకోబడిన విశాఖపట్నం హార్బర్ పవర్ హౌస్, మాచ్‌ఖండ్ జలవిద్యుచ్ఛక్తి కేంద్రం ప్రారంభమయ్యేవరకు శ్రీకాకుళం, విశాఖపట్నం జిల్లాల విద్యుచ్ఛక్తి అవసరాలను తీరుస్తూ ఉన్నది. ఈ స్టేషన్‌ను స్వాధీనం చేసుకునే సమయంలో యిక్కడ 750 కి. వా. చొప్పున శక్తిగల రెండు టర్బో సెట్లు, 1500 కి. వా. శక్తిగల మరొక సెట్టు వుండేవి. ఆ తర్వాత 1500 కి. వా. చొప్పున శక్తిగల మూడు యూనిట్లు నెలకొల్పారు. మూడవ పంచవర్ష ప్రణాళికా కాలంలో రామగుండం, కొత్తగూడెం స్టేషన్లకు సంబంధించిన విస్తరణ పథకాలను రూపొందించి అమలు జరిపారు.

## రామగుండం థర్మల్ పథకం

రామగుండం థర్మల్ స్టేషన్ 37.5 కి. వా. ఉత్పాదక శక్తితో 1957 జూన్ నుండి పని ప్రారంభించింది. ఆ ప్రాంతంలోని విద్యుచ్ఛక్తి అవసరాలకేగాక హైదరాబాదు, సికింద్రాబాదు జంటనగరాలకుకూడ దీనిద్వారా విద్యుచ్ఛక్తి లభిస్తున్నది. ఖనిజ సంపద అపారంగా లభించే ప్రాంతంలో యిది నెలకొల్పబడినందున యిక్కడ పరిశ్రమలు అభివృద్ధిచెందే అవకాశం ఉన్నది. 12,500 కి. వా. ఉత్పాదక శక్తిగల మూడు జనరేటింగ్ సెట్లు, 50,000 పౌ. హా. శక్తిగల ఆరు బాయిలర్లు యీ స్టేషన్‌లో ఉన్నాయి. 20 మె. వా. ఉత్పత్తి చేయడానికి యీ బాయిలరు ఉపయోగపడుతాయి. పూర్తి ఉత్పాదక శక్తిని వినియోగించుకోవడానికి వీలుగా 150/20,000 పౌ. హాం కొత్త బాయిలర్‌ను నెలకొల్పారు. త్వరలోనే పని ప్రారంభిస్తుంది. విద్యుచ్ఛక్తి కేంద్రానికి దాదాపు 5 మైళ్ళ దూరంలోఉన్న గోదావరి నదినుండి యీ స్టేషన్‌కు నీటి సరఫరా లభిస్తున్నది.

రామగుండంలో 62.5 మె. వా. సెట్టు నెలకొల్పడంతో 'బి' స్టేషన్‌గా రామగుండం పవర్ స్టేషన్‌ను విస్తరింపజేయాలని ప్రతిపాదించారు. టర్బో ఆల్టర్నేటర్ యీ స్థలంలోకి తేబడినది. సివిల్ పనులు చురుకుగా కొనసాగుతున్నవి. బాయిలర్ ప్లాంటు, అనుబంధ పరికరాలు, ఏర్ కంప్రెసర్, ట్రాన్స్‌ఫార్మర్, కండెన్సర్ పంపులు ఉత్పత్తి చేయబడుతున్నాయి. కూలింగ్ వాటర్ పద్ధతి పూర్తిఅయింది. స్విచ్ యార్డు పరికరాల తయారీ పురోభివృద్ధిలో ఉన్నది. అంతర్జాతీయ అభివృద్ధిక్రింద అమెరికా ఏజన్సీ యీ పథకానికి ఆర్థిక సహాయం చేస్తున్నది. 1967 నాటికి యిది ఉత్పత్తి ప్రారంభిస్తుందని ఆశిస్తున్నారు.

62.5 మె. వా. శక్తిగల యీ స్టేషన్ నిర్మాణానికి మొత్తం రు. 1080 లక్షల ఖర్చు అవుతాయని అంచనా వేశారు.

## కొత్తగూడెం థర్మల్ స్టేషన్ పథకం

మూడవ ప్రణాళికాకాలంలో చేపట్టబడిన యీ పథకం మొదటిదశ కార్యక్రమంలో ఖమ్మం జిల్లాలోని పాల్వంచలో 60 మె. వా. చొప్పున శక్తిగల రెండు సెట్లను నెలకొల్పాలని నిర్ణయించారు. స్టీంపవర్ స్టేషన్ నిర్మాణానికి పాల్వంచలో అనువైన స్థలం ఉన్నది. ఇక్కడలభించే బొగ్గు పరిశ్రమలు, లోకోమోటివ్‌లకు ఉపయోగ పడడంకన్నా విద్యుచ్ఛక్తి ఉత్పత్తికి ప్రయోజనాకారి అవుతుంది. ఇచ్చంపల్లి, సీలేరు, నాగార్జున సాగర్, శ్రీశైలం జలవిద్యుచ్ఛక్తి ప్రాజెక్టు స్థలాలకన్నా యిది మధ్యకూడలిలో ఉంటుంది. 1964 నవంబరు 28న నిర్మాణంపని ప్రారంభించారు.

మొదటిదశలోని 60 మె.వా. శక్తిగల యూనిటు నెలకొల్పే పని పూర్తిఅయింది. 1966 జులైలో యిది ఉత్పత్తి ప్రారంభించింది. 1966 అక్టోబరులో రెండవ యూనిటు ఉత్పత్తి

కొత్తగూడెం థర్మల్ కేంద్రం



ప్రారంభిస్తుందని ఆశిస్తున్నారు. పునర్నిర్మాణం, పురోభివృద్ధి కార్యక్రమం క్రింద అంతర్జాతీయ బ్యాంకు యీ పథకానికి ఆర్థిక సహాయం అందజేస్తున్నది.

మొదటిదశ నిర్మాణం పనులకు రు. 2,765 లక్షలు ఖర్చు అవుతాయని అంచనా వేశారు.

ఈ పథకం రెండవదశ కార్యక్రమంలో 60 మె. వా. శక్తిగల రెండు సెట్లను నెలకొల్పాలని ఉద్దేశించారు.

రెండవదశ కార్యక్రమంలో అవసరమైనప్లాంటు, యితర పరికరాల నిమిత్తం, మొదటిదశలో మాదిరిగానే జపాన్ ఫర్మకు ఆర్డర్ చేశారు. వాటి ఉత్పత్తి చురుకుగా కొనసాగుతున్నది. 3వ బాయిలర్ నెలకొల్పేపనికూడ చురుకుగా జరుగుతున్నది. ప్రపంచ బ్యాంకుకు చెందిన అంతర్జాతీయ అభివృద్ధిసంఘం యీ పథకం అమలుకు రు. 10 కోట్ల ఆర్థిక సహాయం అందజేస్తున్నది. 1967_68 సంవత్సరంలో యీ రెండు సెట్లు ఉత్పత్తి ప్రారంభిస్తాయని ఆశిస్తున్నారు.

రెండవదశ నిర్మాణం కార్యక్రమానికి రు. 1078 లక్షలు ఖర్చు అవుతాయని అంచనావేశారు.

గోదావరి ఉపనది కిన్నెరసానిపై ఆనకట్ట, రిజర్వాయరు నిర్మాణంద్వారా కొత్తగూడెం థర్మల్ స్టేషన్‌కు నీటి సరఫరా జరుగుతుంది. ఈ డాం నిర్మాణానికి రు. 445 లక్షలు ఖర్చుఅవుతాయని అంచనావేశారు. ఈ ప్రదేశంలో 10 లక్షల కిలోవాట్ల థర్మల్ విద్యుచ్ఛక్తి ఉత్పత్తిచేసే వనరులు ఉన్నాయని అంచనా వేశారు.

"తుంగభద్ర, నెల్లూరు హైడ్రోథర్మల్ పథకం" క్రింద రెండవ ప్రణాళికాకాలంలో పంటకాలువలకు నీరు అవసరంలేని ఋతువులో 30 మె. వా. శక్తిగల తుంగభద్ర జలవిద్యుచ్ఛక్తి కేంద్రాన్ని నెలకొల్పాలని ప్రతిపాదించారు. అయితే భారత ప్రభుత్వంనుండి సాంకేతిక విషయాలపై మంజూరీ లభించడంలో ఆలస్యమైనందువల్ల, విదేశీ మారకద్రవ్యం విడుదలచేయనందువల్ల యీ పథకం క్రింద పనులు కొనసాగలేదు. అయినా 1966 మార్చి 30న నెల్లూరులోని 30 మె. వా. థర్మల్‌స్టేషన్ ఉత్పత్తి ప్రారంభించింది. యెన్‌ఋణం క్రింద లభించే విదేశమారకం ఉపయోగించుకొని, జపాన్‌నుండి యంత్ర పరికరాలు దిగుమతి చేసుకున్నారు. నెల్లూరులోని 30 మె. వా. థర్మల్‌స్టేషన్ నిర్మాణానికి రు. 456.19 లక్షలు ఖర్చు అంచనావేశారు.

## తెలంగాణా హైడ్రో థర్మల్ పథకం

తెలంగాణా ప్రాంతంలోని హుస్సేన్‌సాగర్, రామగుండం థర్మల్ కేంద్రాలు, నిజాంసాగర్ జలవిద్యుచ్ఛక్తి కేంద్రాలలో ఉత్పత్తిఅయ్యే విద్యుచ్ఛక్తిని సమీకరించి, అభివృద్ధిపరచడానికి యీ పథకం నిర్దేశించబడినది. ఇది రెండవ ప్రణాళికతో ప్రారంభించబడి, మూడవ ప్రణాళికాకాలంలో కొనసాగించబడుతున్నది. హుస్సేన్‌సాగర్ పవర్‌హౌస్‌లో 75000 హా/హా. ల శక్తిగల



నెల్లూరు థర్మల్ కేంద్రం

ఒక బాయిలర్ నెలకొల్పబడినది. 1964 జూన్ 4వ తేదీనుండి ఇది పని ప్రారంభించింది. రామగుండంవద్ద 1,50,000 హా/హా. ల శక్తిగల బాయిలర్ నెలకొల్పబడి పని ప్రారంభించబడుతున్నది.

## ఆంధ్రప్రదేశ్‌లో జల విద్యుచ్ఛక్తి, థర్మల్ పవర్ పథకాల అమలు వివరాలు

*1. మాచ్ ఖండ్ జల విద్యుచ్ఛక్తి పథకం (మొదటిదశ, రెండవదశ)*

నిర్మాణస్థలం :—ఒరిస్సాలో కోరాపుట్ జిల్లాలోని జెయపోరే తూర్పుకనుమలలో దుడుమాజలపాతం. (విశాఖపట్నం నుండి 120 మైళ్లదూరం.)

విద్యుదుత్పాదకశక్తి :—1,14,750 కిలోవాట్లు. ఇందులో ఆంధ్రప్రదేశ్‌కు 70 శాతం వాటాఉంటుంది.

మొత్తం అంచనాఖర్చు :—రు. 1828 లక్షలు (నమిష్టినిర్వహణ)

*2. తుంగభద్ర జల విద్యుచ్ఛక్తి పథకం:—*

నిర్మాణస్థలం :— హాస్పేటకు పశ్చిమాన 3 మైళ్ళ దూరంలో మల్లాపురంవద్ద డాం, పవర్‌హౌస్ నిర్మాణం.

కెనాల్‌పవర్‌హౌస్ :—బళ్ళారి జిల్లా హంపీశిథిలాల సమీపంలో తుంగభద్ర డాంకు దిగువ 14 మైళ్లు.

విద్యుదుత్పాదకశక్తి :—మొదటిదశలో 36000 కి. వా. రెండవ దశలో 36000 కి. వా. (నీరు లభించే అవకాశాన్ని బట్టి 32000 మె. వా. కు పరిమితం.) ఆంధ్రప్రదేశ్‌కు 80 శాతం వాటాఉంటుంది.

మొత్తం ఖర్చుఅంచనా :—రు. 845 లక్షలు.

*3. నిజాంసాగర్ జల విద్యుచ్ఛక్తి కేంద్రం :—*

నిర్మాణస్థలం :—కామారెడ్డి రైల్వేస్టేషన్‌కు దాదాపు 32 మైళ్ళ దూరం.

విద్యుచ్ఛక్తి :—15000 కి. వా.

మొత్తం ఖర్చుఅంచనా :—రు. 239.80 లక్షలు.

*4. ఎగువ సీలేరు జల విద్యుచ్ఛక్తి కేంద్రం :—*

నిర్మాణస్థలం :—విశాఖపట్నంజిల్లా, చింతపల్లి తాలుకా చింతపల్లికి 40 మైళ్ళ దూరంలో పవర్‌హౌస్ ఉన్నది.

ఉత్పాదకశక్తి :—1,20,000 కి. వా. (ప్రారంభంలో.)

మొత్తం ఖర్చుఅంచనా :—రు. 17,000 లక్షలు. (సవరించబడుతున్నది.)

*5. దిగువ సీలేరు జల విద్యుచ్ఛక్తి మొదటిదశ :—*

నిర్మాణస్థలం :—డొంకరాయ గ్రామంవద్ద సీలేరునదిపై పవర్ హౌస్ నిర్మాణం.

ఉత్పాదకశక్తి :—4,00,000 కి. వా. (ప్రారంభంలో.)

మొత్తం ఖర్చుఅంచనా :—రు. 3500 లక్షలు.

*6. శ్రీశైలం జలవిద్యుచ్ఛక్తి ప్రాజెక్టు :—*

నిర్మాణస్థలం :—కర్నూలు జిల్లాలోని ప్రఖ్యాత శ్రీశైలం దేవాలయం సమీపంలో కృష్ణానదిపై నిర్మించబడుతున్నది.

ఉత్పాదకశక్తి :—4,40,000 కి. వా. (ప్రారంభంలో.)

మొత్తం ఖర్చుఅంచనా :—4575.48 లక్షలు.

*7. రామగుండం థర్మల్ పథకం :—*

నిర్మాణస్థలం :—కాజీపేట-బల్లార్షా రైల్వేమార్గంలో రామగుండం ఆర్. ఎస్. సమీపంలో నిర్మించబడుతున్నది.

ఉత్పాదకశక్తి :—37,500 కి. వా. (ప్రస్తుతం ఉన్నది.) 6,25,000 మె. వా. (నిర్మాణంలో ఉన్నది.)

మొత్తం ఖర్చుఅంచనా :—రు. 1080 లక్షలు (62.5 మె. వా. యూనిటు నిర్మాణానికి.)

*8. కొత్తగూడెం థర్మల్ స్టేషన్ (1, 2 దశలు)*

నిర్మాణస్థలం :—ఖమ్మం జిల్లాలోని కొత్తగూడెం పట్నంలో నిర్మించబడుతున్నది.

ఉత్పాదకశక్తి:—1,20,000 కి. వా. (మొదటిదశ). 1,20,000 కి. వా. (రెండవదశ).

మొత్తం ఖర్చు అంచనా :— రు. 2755 లక్షలు (మొదటిదశ), రు. 1078 లక్షలు (రెండవదశ).

*9. నెల్లూరు థర్మల్ పథకం :—*

నిర్మాణ స్థలం :—నెల్లూరుకు ఉత్తరదిశలో మైలు దూరంలోఉన్న పడుగుపాడు గ్రామంవద్ద నిర్మాణం.

ఉత్పాదకశక్తి :— 30,000 కి. వా.

మొత్తం ఖర్చు అంచనా :— రు. 456.19 లక్షలు.

ఆంధ్రప్రదేశ్‌లో పంచవర్ష ప్రణాళికలక్రింద విద్యుచ్ఛక్తి ఉత్పత్తి, ట్రాన్సిమిషన్, పంపిణీ పథకాల నిమిత్తం ఖర్చుచేసిన మొత్తాల వివరాలు దిగువ ఇవ్వడం జరిగింది.

| మొదటి పంచవర్ష ప్రణాళికా కాలంలో | రెండవ పంచవర్ష ప్రణాళికా కాలంలో | మూడవ పంచవర్ష ప్రణాళికా కాలంలో | నాలుగవ ప్రణాళిక ముసాయిదాలో కేటాయింపు |
|---|---|---|---|
| రు. (కోట్లు) | రు. (కోట్లు) | రు. (కోట్లు) | రు. (కోట్లు) |
| 37.81 | 38.53 | 89.00 | 200 |
| (39.8) | (20.4) | (25.4) | (28.6) |
| | దాదాపు | | |

గమనిక :—బ్రాకెట్లలో యిచ్చిన అంకెలు ప్రణాళిక పెట్టుబడి మొత్తంలో శాతాన్ని తెల్పుతాయి.





ఆంధ్రప్రదేశ్ గవర్నరు శ్రీ పట్టం ఎ. థానుపిళ్లై హైద్రాబాదులో అగస్టు 11వ తేదీన కలెక్టర్ల సమావేశాన్ని ప్రారంభించారు.
"ప్రణాళికా కార్యక్రమాలు సక్రమంగా అమలు జరుగునట్లుగా కలెక్టర్లు చర్యలు తీసుకోవాలి."



సమావేశానికి హాజరైన కలెక్టర్లు, ఇతర అధికార్లు.



మురికిపేటల నిర్మూలన పథకం క్రింద చాదర్‌ఘాట్‌లో నిర్మించిన అనేక అంతస్తుల భవనానికి ఆగష్టు 28వ తేదీన ముఖ్యమంత్రి ప్రారంభోత్సవం చేశారు.



హైద్రాబాదు మునిసిపల్ కార్పొరేషను రెండవ సర్కిలు భవనానికి నగరంలో ఆగష్టు 16వ తేదీన ఆర్థిక, పరిశ్రమల శాఖామంత్రి డాక్టర్ ఎం. చెన్నారెడ్డి శంకుస్థాపన చేశారు.



ముఖ్యమంత్రి ప్రారంభోత్సవంచేసిన అనేక అంతస్తుల భవనం దృశ్యం.



స్వాతంత్ర్య దినోత్సవం సందర్భంగా శ్రీకాకుళం జిల్లా కలెక్టరు పర్యవేక్షణ క్రింద నరసన్నపేటలో పేదలకు అన్నదానం జరిగింది.



కాళహస్తిలో సెప్టెంబరు 2 వ తేదీన జరిగిన అయిదవ ఆగమ శిల్ప వ్యాసధారిత జానపద ఉత్సవ సదస్సులో న్యాయ, ధర్మాదాయ శాఖల మంత్రి శ్రీ పి. వి. నరసింహారావు అధ్యక్షోపన్యాసం చేశారు. కంచి కామకోటి పీఠాధిపతి జగద్గురు శంకరాచార్యులను కూడా ఈ చిత్రంలో చూడవచ్చు.



విశాఖపట్నంలో ఆగస్టు 4 వ తేదీన టౌన్ ప్లానింగ్ ట్రస్టు ఇండ్ల కాలనీని ముఖ్యమంత్రి ప్రారంభించారు.



న్యాయ, ధర్మాదాయశాఖల మంత్రి శ్రీ పి. వి. నరసింహారావు జూలై 31 వ తేదీన కరీంనగర్ జిల్లాపై జరిగిన గోష్ఠి కార్యక్రమంలో ప్రసంగించారు. ప్రభుత్వ ప్రధాన కార్యదర్శి శ్రీ కె. ఎస్. అనంతరామన్, ఐ. సి. ఎస్. ను కూడా చిత్రంలో చూడవచ్చు.



ఇండ్ల కాలనీ దృశ్యం



ఆంధ్ర మహిళా సభకు చెందిన సంచార పౌష్టికాహార విభాగానికి ఆంధ్రప్రదేశ్ గవర్నరు ఆగష్టు 23వ తేదీన ప్రారంభోత్సవం చేశారు.



ఆగష్టు 29 వ తేదీన హైదరాబాదు జూబిలీహాలులో జరిగిన అటవీ శాఖాధికార్ల సమావేశాన్ని ముఖ్యమంత్రి ప్రారంభించారు.



ఆంధ్రప్రదేశ్ వర్కింగ్ జర్నలిస్టుల సంఘం వార్షిక సమావేశాన్ని హైదరాబాదులో ఆగష్టు 18 వ తేదీన భారత ప్రెస్ కౌన్సిలు అధ్యక్షులు జస్టిస్ జె. ఆర్. ముధోల్కర్ ప్రారంభించారు

"జర్నలిజం ప్రమాణాల పరిరక్షణకు ప్రెస్ కౌన్సిలు తోడ్పడుతుంది"



వార్షిక సమావేశంలో ప్రసంగిస్తున్న ఆర్థిక మంత్రి.



ప్రేక్షకుల దృశ్యం



కేంద్ర ప్రభుత్వ గనులు, ఇంధనముల మంత్రి శ్రీ ఎస్. కె. దే ఇటీవల సింగరేణి బొగ్గుగనులను సందర్శించారు.



ఏలూరులో రామచంద్రరావు పేటలోని వ్యవసాయ సమాచార విభాగంలో పాఠకులు.

ఇటీవలి వరదల సందర్భంలో భద్రాచలంవద్ద ఉప్పొంగిన గోదావరి







పశ్చిమ గోదావరిజిల్లా పోలవరం ప్రభుత్వ (పరిషత్తు) హయ్యర్ సెకండరీ పాఠశాల ఉపాధ్యాయుడు శ్రీ టి. వెంకన్న రాగి బంగారం కలిసిన లోహంతో అమెరికా అధ్యక్షుడు శ్రీ లిండన్ జాన్సన్ ప్రతిరూపాన్ని తయారుచేసి వైట్ హౌస్‌కు బహూకరించారు ప్రెసిడెంట్ జాన్సన్ ఈ కళాకారునికి రాయబారి చెస్టర్ బౌల్స్ ద్వారా అభినందన సందేశం పంపారు



పెరేడులో వందన స్వీకారం చేయుటానికై, పెరేడు కమాండరు లెఫ్టినెంట్ కర్నల్ పి. సి. సికంద్ వెంటరాగా, వెళ్తున్న ముఖ్యమంత్రి



పెరేడు మైదానంలో వందన స్వీకారం చేస్తున్న ముఖ్యమంత్రి



పెరేడును తిలకిస్తున్న ముఖ్యమంత్రి





పెరేడులో సైనిక, నావిక, వైమానిక దళాలు, సాయుధ పోలీసుదళం, అశ్వదళం, ఎన్. సి. సి. దళాలు పాల్గొన్నాయి



విశాఖపట్నం (దక్షిణ) జిల్లా పోలీసు ఇన్‌స్పెక్టరు
శ్రీ మహమ్మద్ ఆలీ అన్సారీ



హైద్రాబాదు సి.ఐ.డి. స్పెషల్ బ్రాంచి హెడ్ కానిస్టేబిల్
శ్రీ మహమ్మద్ అలీ (ప్రస్తుతం [illegible] గా
వ్యవహరిస్తున్నారు)



కర్నూలు జిల్లా పోలీసు ఇన్‌స్పెక్టరు శ్రీ వి. నారాయణస్వామి



హైద్రాబాదు [illegible] ఇన్‌స్పెక్టరు
శ్రీ ఆర్. వెంకటేశ్

## ❀ రేపటి పౌరులు ❀

స్వాతంత్ర్య దినోత్సవ సందర్భంగా సమాచార, పౌరసంబంధశాఖ సమాచార కేంద్రంలో బాలబాలికలకు లేఖారచన, చిత్రలేఖన పోటీలు నిర్వహించారు. ఈ పోటీలలో పాల్గొన్న బాలబాలికలను యీ చిత్రాలలో చూడవచ్చు.













స్వాతంత్ర్య దినోత్సవ సందర్భంగా ఏర్పాటుచేసిన సాంస్కృతిక ప్రదర్శన కార్యక్రమం



శ్రీ ఎం. చిత్తరంజన్ తెలుగులో పాటపాడుతున్న దృశ్యం



కుమారి మీరాసింగ్ హిందీ పాట పాడుతున్న దృశ్యం



గిల్డ్ అధ్యక్ష, ఉపాధ్యక్షులు, సమాచార శాఖ డైరెక్టరుతో



ప్రదర్శన తర్వాత కళాకారుల బృందంతో తీసిన చిత్రం



కుమారి శశికళ కథక్ నృత్యం

"స్వాతంత్ర్య దినోత్సవ సందర్భంగా సమాచార, పౌరసంబంధ శాఖ, రవీంద్రభారతిలో ఏర్పాటుచేసిన ఫిలింటేలెంట్స్‌గిల్డ్ వారి వినోద ప్రదర్శనలను ప్రజలు అధిక సంఖ్యలో పాల్గొని 180 నిమిషాలపాటు తన్మయులై తిలకించారు".



శ్రీ కె. సుబ్రహ్మణ్యం, గిల్డ్ ఉపాధ్యక్షులు వందన సమర్పణ చేస్తున్న దృశ్యం



మైక్ వద్ద హకీం రాఫీ



ముఖ్యమంత్రి, ఆర్థికమంత్రి. యితర ప్రముఖులు ప్రదర్శనను తిలకిస్తున్న దృశ్యం



ఔత్సాహిక కళాకారుల కృషి ప్రశంసనీయమైనది. అదే విధంగా డైరెక్టరేటు ప్రయత్నం కూడ శ్లాఘనీయం.



శ్రీమతి విజయలక్ష్మికన్నారావు పాడుతున్న దృశ్యం

వివిధ భాషలలో నిర్వహించబడిన లలిత సంగీత ప్రదర్శన, భిన్నత్వంలో ఏకత్వాన్ని రుజువుచేస్తుంది









కుమారి వీణాధరి కూచిపూడి నృత్యం



'జ న గ ణ మ న'

# కార్టూన్లు




నువ్వు సిగరెట్లు కాల్చడం మానేసేవని కాదు కాని నువ్వు సిగరెట్లు కాల్చడం మానినప్పటినుంచి ఎంతో బాగా ఆరోగ్యంగా ఫీలవుతున్నట్లు అందరికి చెప్పుతున్నావటగా—అందుకే నిన్ను డిస్ మిస్ చేసేస్తున్నాను.

కారణం లేకుండా మీరు నాకు పువ్వులు తీసుకొచ్చేరంటే అందుకు ఏదో కారణముందన్న మాట.






మీకప్పు ఒక సారి అప్పు ఇవ్వండి. పక్కింటికెళ్ళి ఒక కప్పు పంచదార అప్పు తెచ్చుకోవాలి.






నిన్నల్లరి చేసేవని స్కూల్లోంచి తీసేశారా? పోనీలే నీకోసం ఇంకోబడి కట్టిస్తాలే.




"నా ఉద్దేశం అదికాదోయ్ పెళ్ళయ్యాక ఆర్థికంగా నువ్వు మా అమ్మాయి బరువు బాధ్యతలు మోయగలవా?"

-అని-

సీరియల్

# అడవి మల్లె



వాసిరెడ్డి సీతాదేవి

## 18

ప్రసాదుకు ఆమె ముఖంలోకి చూసే ధైర్యం లేదు. తలవంచుకొని కూర్చున్న ప్రసాదు చెక్కిళ్ల మీద కన్నీటిబొట్లు అద్దంమీద వానజల్లు పడినట్లు దొర్లుతున్నాయి. అనూరాధ రెప్ప వేయకుండా ప్రసాదునే చూస్తూ కూర్చుంది. ఆమె ముఖంలో ఎలాటి ఆవేశంగాని, కోపంగాని లేదు. మంచివాని మనసులా అతి నిర్మలంగా వుంది ఆమె ముఖం. ఆమె కళ్ళలో మాత్రం 'ఇదంతా నిజమేనా అనే సందేహం, ఆ సందేహాన్ని నిజంగా మార్చుకోవాలనే తహతహ కనిపిస్తుంది....కలగాపులంగా నెరసిన జుట్టును, వయస్సు తెచ్చిన మార్పుతో పరిపక్వత చెందిన విశిష్టమైన వ్యక్తిత్వానికి ప్రతిరూపంగా కనిపిస్తున్న ప్రసాదు రూపాన్ని ఆనాటి యువకుడుగా తనకు పరిచయమైన ప్రసాదు రూపంతో పోల్చుకుంటూ కూర్చుంది అనూరాధ.

కళ్ళకు కండువా అడ్డంపెట్టుకొని మౌనంగా రోదిస్తున్న ప్రసాదు చెయ్యిపట్టుకొని "ఛ. అదేమిటి! అలా ఆడపిల్లలా మీరు ఏడవటం బాగాలేదు'' అంది మందలిస్తున్నట్లు. ఆ మందలింపులోని ఆత్మీయతకు ప్రసాదుకు దుఃఖం పొర్లుకొచ్చింది. కాని నిభాయించుకొని కళ్ళు తుడుచుకున్నాడు. అదోలా అనూరాధ ముఖంలోకి చూశాడు. ఆమె ముఖం చాలా ప్రశాంతంగావుంది. ప్రసాదు ఆవేశంతో ఆమె చేతిని పట్టుకొని "నన్ను క్షమించగలవా అనూ?'' అన్నాడు ప్రాధేయపడుతూ.

అనూరాధ విస్మయంగా ప్రసాదు ముఖంలోకి చూసింది. చిన్నగా తన చేతిని అతని చేతినుంచి లాక్కుంది. తను ప్రసాదును క్షమించగలదా? క్షమించే తప్పేనా అతను చేసింది? ఎంత తేలికగా క్షమించమని అడుగుతున్నాడు? ఆ మాట తను అనగలిగినా వ్యర్థమయిపోయిన తన నిండు జీవితాన్ని తిరిగి ఇవ్వగలడా? అప్పుడే రేకలు విప్పుకుంటున్న మొగ్గను నిర్దయగా నలిపి దుమ్ములో పారవేశాడు. దాన్ని మళ్లీ వికసించేలా చేసేశక్తి అతనిలోవుందా? నిండు పాలకుండలాటి తన జీవితాన్ని నిర్లక్షంగా తన్ని వెళ్లిపోయాడే! ఆ వలికిపోయిన పాలను మళ్లీ నింపగలడా? ప్రసాదు తన తప్పుకు క్షమాపణ అడుగుతున్నాడు. కాని తన నిండు జీవితాన్ని—తన ఇరవై సంవత్సరాల యౌవ్వనాన్ని—తిరిగి తనకు ఎక్కడనుంచి తెచ్చి ఇవ్వగలడు. తనలో అతన్ని క్షమించే శక్తి లేదు. క్షమించను! క్షమించలేను!

"నేను దుర్మార్గుణ్ణి. నేను నీకు తీరని ద్రోహంచేశాను. నన్ను క్షమించవా అనూ?" ప్రసాదు కంఠం బొంగురుపోయింది.

అనూరాధ అదోలా నవ్వింది. ఆ నవ్వు, ప్రసాదును "నిన్ను క్షమించాలా?'' అని సవాలు చేసినట్లనిపించింది.

"అవును. నేను చేసిన పాపానికి క్షమాపణలేదు. నన్ను క్షమించకు. శిక్షించు. నా పాపానికి పరిష్కారం చెప్పు. నన్ను నిందించు. నన్ను క్షమించవద్దు అనూ...నాకు క్షమలేదు. నన్ను తిట్టు కాని అలా చూడకు. అలా నవ్వకు. నేను సహించలేను.'' అన్నాడు అనూరాధ రెండు అరచేతులనూ పైకెత్తి తన ముఖాన్ని దాచుకుని వెక్కి వెక్కి ఏడుస్తూ.

అనూరాధ తన చేతుల్ని లాక్కుంది. కన్నీటితో తడిచిన అరచేతులను చూసుకుంటూ కూర్చుంది.

"నిజం అనూ. నామాట నమ్ము? నీకు నేను కావాలని ద్రోహం చెయ్యలేదు. నా ప్రేమను శంకించకు.''

---

### జరిగిన కథ

గౌరితో చంద్రం సినిమాకు వెళ్ళి వస్తుండగా దుండగుల బారికి గురయ్యాడు చంద్రం. ఆ వార్త పేపర్లో వచ్చింది.

చంద్రం అన్నయ్య కృష్ణారావుతో ఆ విషయం ప్రస్తావించడానికి ప్రసాదరావు అతని దగ్గరకు వెళ్ళగా అక్కడ అనూరాధ కనిపించింది. అతనిని చూడగానే ఆమె స్పృహ కోల్పోయింది. కొంతసేపటికి ఆమె తేరుకుని తన గదిలోకి వెళ్ళిపోయింది. ప్రసాదరావు కూడా ఆవెనకనే వెళ్ళి ఆమెపక్కనే కూర్చున్నాడు.

---



అనూరాధ ఆశ్చర్యంగా ప్రసాదు ముఖంలోకి చూసింది. ''ఇంకా నాదగ్గర ఏముందని అబద్ధాలాడుతున్నావు?'' అనాలని అనిపించింది.

''నా మాట నమ్మవూ? నిన్ను చూసిన క్షణంలోనే నాకు మతిపోయింది. జన్మ జన్మాంతరాలుగా నాతో వుంటూ, నన్ను విడిచి పోయిన వస్తువేదో అకస్మాత్తుగా మళ్లీ నాకు లభించినట్లనిపించింది. నేను కాలేజీలో చదివే రోజుల్లోకూడా ఆడపిల్లలవైపు చూసిన పాపాన పోలేదు. కాని నిన్ను చూసిన ఆక్షణం నాకు కలిగిన అనుభూతి చాలు ఒక జీవితానికి. నీవు లేకుండ నేనులేను, వుండను అనుకున్నాను. అందువల్లనే అప్పటికే నాకు వివాహం అయినట్లు నీకు చెప్పలేకపోయాను. అది చాలా పెద్ద తప్పే. కాని నిన్ను ఏనాడూ వ్యామోహ దృష్టితో చూడలేదు. గుడిలోని దేవతలా గుండెల్లోనే నీరూపాన్ని నిలుపుకొని పూజించుకోవాలనుకున్నాను.''

ప్రసాదు ఓక్షణం ఆగాడు. అనూరాధ మౌనంగా చూస్తూ కూర్చుంది.

''ఆనాటి రాత్రి నీ జీవితంలో కాళ రాత్రిగా మారింది. రోజూలాగే ఆనాడుకూడా నువ్వు నాగదికి పాఠం చెప్పించుకోవటానికి వచ్చావు. వర్షంలో తడిచి వచ్చావు...''

''ఆగు. ఇంక చెప్పకు. రాక్షసుడా!'' అరవాలనిపించింది. కాని అనూరాధ గొంతు పెకల్లేదు.

''ఆ నిముషంలో నాకు మతిపోయింది. ఎవరో మంత్రించినట్లు అయిపోయాను. వివేకం నశించింది. పశుత్వం విజృంభిం

చింది. నేను అవివాహితుణ్ణని అనుకుంటున్న నువ్వుకూడా అంత అభ్యంతర పెట్టలేదు. జరగరానిది జరిగిపోయింది." వాక్ప్రవాహం ఆగిపోయింది. కొద్దిసేపు కణతలు నొక్కుకుంటూ కూర్చున్నాడు. రక్తనాళాలు తెగుతాయోనన్నంతగా తలలోపోటు ప్రారంభించింది.

"అంత జరిగిన తరవాత కూడా నేను వివాహితుడినని నీకు చెప్పలేదు. కారణం నిన్ను బాధపెట్టటం ఇష్టంలేకనే."

అనూరాధ తిరస్కారంగా నవ్వింది.

"అలా నవ్వకు. కావాలంటే తిట్టు, నీచేత్తో ఇంత విషం తాగించు కాని నన్ను తిరస్కారంగా చూడకు. ఎగతాళిగా నవ్వకు. నేను చెప్పేది పూర్తిగావిను."

[illegible] నిట్టూర్చింది.

ప్రసాదు మళ్ళీ ప్రారంభించాడు—

"మరో నెలకల్లా బొంబాయిలో నా ట్రయినింగ్ పూర్తి అయి ఇంటికి వచ్చేశాను. వచ్చేప్పుడు నెల రోజుల్లో వచ్చి నిన్ను తీసుకెళతానని చెప్పాను. ఆ మాట నేను నిజాయితీతోనే చెప్పాను, అలాచేద్దామనే ఉద్దేశంతోనే చెప్పాను."

అనూరాధకు ఆశ్చర్యం కలిగింది. అప్పటికే వివాహితుడైన వాడు అలాగ చెయ్యటం సాధ్యమా? ఇది నమ్మవలసిందేనా?

"నా భార్య చాలా ఉత్తమురాలు. నాకు చిన్న తలనొప్పి వచ్చినా భరించలేకపోయేది. నిన్ను చూసేనాటివరకూ నేను ఆమెను ప్రేమిస్తున్నాననే భ్రమపడ్డాను."

అనూరాధ ముఖం చిట్లించుకుంది.

"జరిగిన విషయం నా భార్యతో చెప్పి ఆమెను వప్పించి నిన్ను తీసుకెళదామనుకున్నాను."

అనూరాధ ప్రసాదువైపు విస్మయంగా చూసింది. భార్య భర్త కోసం ఏమయినా చెయ్యగలదు. కాని ఇది మాత్రం....తనే ఆమె స్థానంలో వుంటే చస్తే ఒప్పుకోదు. తననే దైవంలా భావించి పూజించే భార్యకు ఇంత దారుణమైన విషయం చెప్పగల మగవాణ్ణి ఏమని పిలవాలి?

ఆమె ఆలోచనలకు అంతరాయం కలిగిస్తూ ప్రసాదు మళ్లీ ప్రారంభించాడు.

"అప్పటికి రెండో వివాహం మీద నిషేధంలేదు. నా భార్యను ముందు వప్పించి నిన్ను రిజిష్టరు వివాహం చేసుకొని తీసుకొనిరావాలనుకున్నాను. తీరా వివాహం అయినాక తెలిసినా నీవు నన్ను క్షమించగలవనే ఆశతోనే అలా భావించాను. నేను నీ దృష్టిలో పరమ స్వార్థపరుడిగా కనిపించవచ్చును." ప్రసాదు నిట్టూర్చి ఓ క్షణం ఆగిపోయాడు.

"ఆ విషయాన్ని ఎప్పుడు నా భార్యకు చెప్పాలనుకొని, ఎంత ధైర్యాన్ని కూడదీసుకున్నా చెప్పలేకపోయాను. ఎప్పుడు చూసినా ఆమె సంతృప్తిగా అమృత పాత్రలా కనిపించేది. అందులో విష బిందువును కలపటానికి ధైర్యం చాలేదు కాదు. ఇక లాభంలేదు. ఇద్దర్నీ మోసంచేస్తే కాని లాభంలేదనుకున్నాను. నిన్ను వివాహం చేసుకొని తీసుకొచ్చి ఇద్దర్నీ ఒకేసారి ఒకరి కొకర్ని పరిచయం చెయ్యాలనుకున్నాను. కాని ఆ సన్నివేశాన్ని ఊహించుకొంటే పెనుగాలికి ఊగే వృక్షంలా అయిపోయేవాణ్ణి. చివరకు ముందు నీ దగ్గిర నిజం ఒప్పేసుకొని నీ సలహా ప్రకారం చేద్దామని నిర్ణయించుకున్నాను. సెలవుకూడా పెట్టాను. సెలవు ఇంకా మంజూరు కాలేదు. ఈ లోపల నా భార్యకు అకస్మాత్తుగా జబ్బుచేసింది. అది మశూచిగా తేలింది. అప్పటికే నాకు మూడు సంవత్సరాల ఆడపిల్లవుంది. నా భార్య ఆ వ్యాధితోనే పోయింది. ఆమె పోయినప్పుడు నాకు కలగవలసి నంత బాధ కలగలేదేమోనని ఇప్పటికీ అనుమానం వుంటుంది.

"నన్ను చూస్తుంటే నీకు అసహ్యం వేస్తుంది కదూ? నా భార్య అలా అకస్మాత్తుగా పోవటం నేను చేసిన పాపానికి శిక్షగా భావించాను. అలా అసహ్యించుకుంటున్నట్లు చూడకు అనూ అది నేను భరించలేను. నేను చెప్పేదంతా విని నాకు ఏ శిక్ష అయినా విధించు. మరో నెలకల్లా నీకోసం బొంబాయి బయలుదేరాను. విధి నా పాపానికి అంత క్రూరంగా శిక్షిస్తాదని వూహించుకోలేను. కొత్త ఉత్సాహాన్ని కూడదీసుకొని నీకోసం బయలుదేరాను. నేను మీ ఇంటికి వెళ్ళినప్పుడు మీ నాన్నగారు ఇంట్లో లేరు. మీ అమ్మగారు నన్ను గుర్తించకపోవడం చూసి ఆశ్చర్యపోయాను. నీకోసం మొకమంతా కళ్ళుచేసుకొని వాకిలి వైపు చూస్తున్నాను. కర్టన్ కదిలింది. నా గుండెలు వేగంగా కొట్టుకోసాగాయి. కాని నీకు బదులు వంటవాడు కనిపించాడు. నిన్ను పిలవమంటే వాడే విషయమంతా చెప్పాడు. నీవు అకస్మాత్తుగా ఇల్లు వదిలి వెళ్ళిపోయావని, మీ అమ్మగారికి మతిపోయిందనీ, మీ నాన్నగారు అవమానంతో, దుఃఖంతో కుమిలి కృశించిపోతున్నారని చెప్పాడు. అది విన్న నా మానసిక పరిస్థితిని గురించి వూహించుకోవలసిందేకాని చెప్పలేను. అప్పటి నుండి దాదాపు రెండు మూడు సంవత్సరాలు నా ముఖాన్ని నేను అద్దంలో చూసుకోవడం మానేశాను. నిండా ముప్పయ్ సంవత్సరాలులేని నన్ను అందరూ మళ్ళీ వివాహం చేసుకోమని బలవంతం చేశారు. కాని ఆ మాట వినడం కూడా సహించలేకపోయాను. ఆరోజునుంచి నిన్ను తలచుకొని బాధ పడని రాత్రి, నన్ను నేను అసహ్యించుకోనిరోజు లేదు. నా బిడ్డకోసం బతకవలసి వచ్చింది." ప్రసాదు స్వరం దుఃఖంతో పూడుకుపోయింది.

"అనూ! అలా అకస్మాత్తుగా ఇల్లు వదిలి ఎందుకు వెళ్ళిపోయావు? నువ్వు ఆ విధంగా చెయ్యకుండావుంటే మన జీవితాలు ఇలా..."

అనూరాధ తల ఎత్తి ప్రసాదు ముఖంలోకి నిర్లక్ష్యంగా చూసింది. ఆ చూపునుంచి తప్పించుకోవటానికి ప్రసాదు ముఖం దించుకున్నాడు. ఓ క్షణం ఇద్దరి మధ్య మౌనం.

"జరిగింది మర్చిపో అనూ. ఇప్పటికైనా నా పాపానికి ప్రాయశ్చిత్తం చేసుకొనే అవకాశాన్ని ఇవ్వు. నేను చాలా అదృష్ట వంతుణ్ణి. ఇంత కాలానికి నాకు లభించావు."

అనురాధ ప్రసాదు ముఖంలోకి అర్థంకానట్లు చూసింది.

''మన ఇంటికి వెళదాం, లే అనూ. హేమ చాలా మంచి పిల్ల. ఆ పిల్లకు తల్లి లేని లోటు తీర్చు.''

అనురాధ ముఖం బాధతో బిగుసుకొని పోవటాన్ని ప్రసాదు గమనించలేదు. కాని ఆమె మౌనాన్ని అంగీకారంగా వూహించు కున్న ప్రసాదు ఆనందంతో "ఒప్పుకుంటున్నావా అనూ. ఇప్పుడే కృష్ణారావుగారితో చెప్పేస్తాను. ఆయన కారులోనే మనం వెళ్ళి పోదాం" అంటూ లేచిన ప్రసాదు ''ఆగు'' అన్న అనురాధ కటు స్వరానికి ఉలిక్కిపడి కుప్పకూలిపోయాడు.

''కాదనకు అనూ.'' రెండు చేతులూ పట్టుకున్నాడు.

''ఎక్కడకు ? నీ ఇంటికా ? ఏ హోదాతో'' ఒక్కసారిగా చేతులు లాక్కుంది ప్రసాదు చేతుల్లోనుంచి.

"నా ఇంటికి కాదు, మన ఇంటికి, ఇక ఏహోదాతో నంటావా ? అది నీకు నేను వేరే చెప్పాలా ?'' ఆవేశంగా అన్నాడు ప్రసాదు.

అనురాధ నిర్లక్ష్యంగా నవ్వింది.

" సరే నేను వెళుతున్నాను, కనీసం నా చావువార్త విన్న తరవాతయినా ఒక సారి మన ఇంట్లో కాలుపెట్టు, అంతేచాలు, నా ఆత్మకు శాంతి లభిస్తుంది. '' ఈ సారి ప్రసాదు స్వరంలో ఆవేశం స్థానాన్ని కోపం ఆక్రమించుకుంది.

అనూరాధ ప్రసాదు ముఖంలోకి దీక్షగా చూసింది. ఆ ముఖంలో ఆమెకు నిజాయతీ కొట్టవచ్చినట్లు కనిపించింది. అనురాధ కళ్లలో నీరు తిరిగింది.

'' అలా ఆవేశపడకు ప్రసాద్, ఈ వయస్సులో ఆవేశాన్ని అదుపులో పెట్టుకోవడం అవసరం. ''

అనురాధ చిన్నగా ఎవరిదో విషాదగాథ చెబుతున్నట్లు, తనకుతనే మాట్లాడు కుంటున్నట్లు, ఎటో దూరతీరాల్లోకి చూస్తునట్లు చూస్తూ చెప్పుకుపోతోంది.—

'' ఒకప్పుడు నీఇంటికి పెళ్లి కూతురుగా రావాలని కలలు కన్నాను. నీకోసం కళ్లల్లో వత్తులు వేసుకొని ఎదురు చూశాను. ప్రతి చిన్న వస్తువు కదలికలోనూ, ప్రతి చిన్న శబ్దంలోనూ నీ అడుగుల చప్పుడే విని కొండంత ఆశతో నీకోసం ఎదురు చూశాను. హృదయ కలశంలోని మధువునంతా వెచ్చించి, ఆకాంక్షలనే పుష్పా లలో నింపాను. జీవితాన్నే నారగాపేని ఆ ఆశల పుష్పాలను అందగా కూర్చిమాలకట్టాను. ఆ మాలతో నీకంఠాన్ని అలంక రించాలనే ఆశతో నీకోసం అనుక్షణం ఎదురు చూశాను. చూస్తుండగానే మాల వాడిపోయింది. చివరకు ఎండిపోయింది. కాని నీవు రాలేదు. ఆ మాలకు ఒకరి కంఠాన్ని అలంకరించే శక్తి ఏనాడో నశించింది. దాన్ని కదిలిస్తే ఆ పూలు రాలిపోతాయి. చివరకు మిగిలేది వట్టినార మాత్రమే, ఆ నార ఒక కంఠానికి ఉరి తాడు కాగలదేమో కాని కంఠమాల కాలేదు. నన్ను ఇలాగే బ్రతక నియ్యి. వేరే జీవితాన్ని భరించే శక్తి నాలో ఏనాడో నశించింది.'' అనూరాధ కంఠంలో నిర్లిప్తత స్పష్టంగా కనిపిస్తుంది.

" అలా అనకు అనూ, నువ్వు నాభార్యవు. ఏనాటికి కని పించినా నీకు ఆ స్థానం నీకు భద్రంగానేవుంది. నా అపరాధాన్ని క్షమించి నాతో రా. "

'' హుం, అపరాధం .......క్షమ.........నిన్ను క్షమించే శక్తి నాలో లేదు. నిన్ను క్షమించ వలసింది నేను కాదు ....." అనురాధ కంఠం రుద్ధమయింది.

'' ఎవరో చెప్పు. వారు నీ తల్లిదండ్రులేగా ? ఇప్పుడే పోదాము వెళ్ళి వారి పాదాలమీద పడి క్షమాపణ వేడుకుంటాను. వారు నన్ను క్షమిస్తారని నాకు నమ్మకంవుంది" అన్నాడు ప్రసాదు ఉద్రేకంతో.

" తల్లీ! తండ్రీ! మళ్లీ వారికి నేను బతికి వున్నట్లు తెలి యటం కూడా నాకు ఇష్టంలేదు. నాలాంటి చరిత్రహీనురాల్ని కన్నందుకు ఫలితం వాళ్లు అనుభవించి తీరాలి.'' ఆమె కంఠంలో కక్ష ఎవరి మీదో ఆమెకే తెలియదు.

ఆశ్చర్యంగా చూశాడు ప్రసాదు. ఏమీ అర్థం కాలేదు. మరయితే ఎవరా మూడోవ్యక్తి ? బుర్ర బద్దలు కొట్టుకున్నా అర్థం కాలేదు.

'' అర్థం కాలేదు కదూ ? '' హెచ్చరిస్తున్నట్లున్న ఆమె మాటలకు తెల్లబోయి చూసటం తప్ప జవాబు ఇవ్వలేక పోయాడు.

అయితే అనురాధ మళ్లీ వివాహం చేసుకుందా ? లేక, ఇంత కాలం తనకోసమే ఎదురుచూస్తూ వుంటుందనుకొనటంలో అర్థం లేదు. తనస్వార్థమే తనను అలా ఆలోచించనివ్వలేదు.

" చెప్పమంటవా ? వినేధైర్యంవుందా ?" అనురాధ స్వరం లోని కాఠిన్యానికి ఇంకా తెల్లబోయాడు ప్రసాదు. మాట్లాడలేక పోయాడు.

" ఆ మూడో వ్యక్తి ఎవరోకాదు, నువ్వూ నేనూ చేసిన పాపానికి ప్రతిఫలమైన ఒక అభాగ్యురాలు."

ప్రసాదు చెంపన ఏదో అదృశ్య హస్తం చెళ్లున కొట్టినట్లు ఉలిక్కి పడ్డాడు.

'' ఏం, అలా ఉలిక్కి పడతావు ?" ప్రసాదు అయోమ యంగా అనురాధ ముఖంలోకి చూడసాగాడు. అనురాధ ముఖంలో ఇంత సేపూ కనిపించని కాఠిన్యం ఏదో కనిపించింది. మరోక్షణంలో అనూరాధ అకస్మాత్తుగా ఇల్లువదిలి పారిపోవటానికి కారణం లీలగా కళ్లకు కట్టింది.

"అంటే......మనబిడ్డ......ఎక్కడ...ఎక్కడ వుంది?" అన్నాడు ప్రసాదు తడబడుతున్న మాటల్లో.

అనూరాధ జవాబివ్వలేదు. ప్రసాదు లేచి విసురుగా ఆమె దగ్గరకు వచ్చాడు. రెండు భుజాలనూ మొరటుగా పట్టుకొని ఊపుతు "నా బిడ్డ ఎక్కడ ? చెప్పు. నువ్వు క్షమించక పోయినా నా బిడ్డ నన్ను తప్పక క్షమిస్తుంది." అన్నాడు.

అనూరాధ అసహ్యంతో ప్రసాదు చేతుల్ని తోసేసింది. ప్రసాదు ఉద్రేకంతో పిచ్చివాడయాడు. బుర్ర పనిచేయటం మానేసింది. కేవలం ఒక పిచ్చి ఆవేశం మాత్రమే అతని ప్రతి అణువులో ఉరకలు తీస్తుంది.

"చెప్పవుకదూ ? నీకునేను బాధపడటమే కదూకావాల్సింది. నన్ను ఇలా చిత్రవధ చేస్తావా ? సరే చూడు, ఆనందించు." అంటూ ఉద్రేకం కొద్దీ నుదుటిని గోడకువేసి కొట్టుకోసాగాడు.

అనూరాధ ఒక్కసారిగా లేచివెళ్ళి ప్రసాదు తలను పట్టుకుంది బలంగా.

"ఏమిటి పిచ్చి. వచ్చి కూర్చో చెబుతాను." అంది అనూరాధ మందలింపు స్వరంతో.

"నేను కూర్చోను. అమ్మాయి ఎక్కడుందో చెప్పు. స్కూలుకు వెళ్ళిందా ? ఏ స్కూలోచెప్పు ఇప్పుడే వెళ్ళి తీసుకొస్తాను."

"అదేనాకూ తెలియదు. ఎక్కడ వుందో, ఏంచేస్తుందో ?" స్వప్నంలో కలవరిస్తున్నట్లు అంటూ మంచం మీద నీరసంగా కూలిపోయింది అనూరాధ.

ప్రసాదు నమ్మలేనట్లు చూశాడు. "నా పాపపు ముఖాన్ని మన అమ్మాయి చూడటం నీకు ఇష్టంలేదు కదూ ? నాకు మీ జీవితాల్లో జబర్దస్తీగా ప్రవేశించే అధికారం లేదు. సరే నేను వెళుతున్నాను. నేను చనిపోయినవార్త విని అయినా నువ్వు నన్ను క్షమిస్తావని నాకు నమ్మకం వుంది." విసురుగా బయటకు వెళ్ళిపోతున్న ప్రసాదు షర్టును గట్టిగా పట్టుకొని వారించింది.

"వెళుదువుగాని ప్రసాద్, కాని నేను చెప్పేది కూడా విని వెళ్ళు. నిజంగానే నా బిడ్డ ఎక్కడ వుందో నాకు తెలియదు." అనూరాధకు దుఃఖం పొర్లు కొచ్చింది. ప్రసాదు కుప్పకూలిపోయాడు. అనూరాధను ఓదార్చే శక్తికూడా లేదు. స్థాణువులా చూస్తూ కూర్చున్నాడు. అనూరాధ క్రమంగా తననుతను సంబాళించుకొని చెప్పసాగింది.—

"నువ్వు నెలరోజుల్లో వచ్చి నన్ను తీసుకెళతానని చెప్పి నన్ను ఓదార్చి వెళ్ళావు. నీమాటలు నిజమేనని నమ్మాను. ఆనెల రోజులు నాకు కాలం ఆగి పోయినట్లు అనిపించింది. ప్రతి నిముషం ఒక యుగంగా గడిపాను. రెండు నెలలు దాటింది. కాని నువ్వు రాలేదు. నాకు నెల తప్పినట్లు తెలుసుకున్నాను. ప్రకృతికికూడా అపదే అలుసు. ఆదదాన్ని ప్రపంచం క్షమించనప్పే తప్పుచేస్తే ప్రకృతికూడా క్షమించదేమో. నాకు ప్రకృతి వేసిన శిక్ష. దానికి ఎదురు లేదు. మూడోనెలకూడా వచ్చింది. అప్పటికే పని వాళ్లలో గుసగుసలు ప్రారంభమయాయి. నీవు వస్తావనే నమ్మకం నశించింది. ఈ విషయం తెలిస్తే నాన్న నన్ను క్షమించడు. అమ్మనూ, నన్నూ చంపి తను చచ్చిపోతాడు. ఆయన ఎంత మంచివారో నీకు తెలుసు. కాని ఇలాటి విషయాలను ఆయన క్షమించడం ఎరగను. పైగా నా పాపిష్టి ముఖాన్ని ఆయనకు చూపించలేక ఒక అర్ధరాత్రి ఇల్లు వదిలి వచ్చేశాను. హైదరాబాదులో నాలాటి వారికి ఆశ్రయం ఇచ్చే సదనాలు ఉన్నాయని నాకు తెలుసు. సరాసరి అక్కడకే వెళ్లాను. అక్కడ నాకు అనుకున్నట్లే ఆశ్రయం లభించింది. అక్కడే గిరిజ జన్మించింది. ఆ సదనంలో అనేక రకాలవాళ్లు వుంటారు. ఆ సంవత్సరం అక్కడ ఎలా గడిపానో నాకే తెలియదు. నాబిడ్డను నానుంచి వేరుచేసి మరొక బాలసదన్‌కు పంపించాలని అర్థరు అయింది. అది నాకు ఇష్టం లేక బిడ్డతో బయటకు వచ్చాను. ఏం చెయ్యాలో ఎక్కడకు వెళ్లాలో తెలియలేదు. అంధకారంలో ఆశాకిరణంలా నువ్వే కనిపించావు. గుంటూరువచ్చి అన్ని కాలేజీలూ తిరిగి చివరకు నీ అడ్రసు సంపాదించాను. అలాటిరోజు ఏ ఆడదాని జీవితంలోనూ రాకూడదు ఎంతో ఆశతో, బాధతో, మరోవైపు దెబ్బతిన్న అభిమానంతో నీ ఇంటిగేటుముందు నిల్చున్నాను. అదురుతున్న గుండెలకు నిద్రపోతున్న బిడ్డను అదుముకుని నిల్చున్నాను. రకరకాల పూల మొక్కలపైగా వరండాలో కూర్చొని పేపరు చదువుతున్న నీవు కనిపించావు. గుండె లయతప్పి కొట్టుకోసాగింది. అడుగు ముందుకు పడలేదు. నీకు ఎదురుగావున్న కుర్చీలో ఓ నాలుగైదేళ్ల బిడ్డ కూర్చొని బిస్కత్తులు తింటున్నది. మంచి దుస్తుల్లో చక్కగా అలంకరించబడివున్న ఆ బిడ్డ దూరానికి రబ్బరు బొమ్మలా అందంగా కనిపించింది. ఆ బిడ్డ నీ బిడ్డేమోనని అనుమానం రాగానే నాలోని చైతన్యం క్రమంగా గడ్డకడుతున్నట్లనిపించింది. అలాగే ఎంతసేపు నిల్చున్నానో నాకే తెలియదు. ఇంతలో నీదగ్గర వున్న పిల్ల గొల్లున ఏడ్వటంతో ఈ లోకంలోకి వచ్చాను. కింద పడిన బిడ్డను నువ్వు ఎత్తుకున్నావు. ఇంతలో ఓ పాతిక సంవత్సరాల అందమైన యువతి గాభరాగా లోపలనుంచి వచ్చి నీ చంకలోని బిడ్డను లాక్కుంది. నిన్ను ఏదో మందలిస్తున్నట్లు అనిపించింది నాకు. ఆమె వెనకే నీవు చిరునవ్వుతో లోపలకు వెళ్ళావు. ఆ స్త్రీ ఎవరో నాకు అర్థం అయిపోయింది. నా చేతిలోని బిడ్డవైపు చూసుకున్నాను. తన తల్లి పడుతున్న నరకయాతనను అర్థంచేసుకోలేని ఆ పసిప్రాణం హాయిగా నిద్రపోతోంది హోమువాళ్లు ఇచ్చిన గౌనులోవున్న నా బిడ్డను నీబిడ్డతో పోల్చుకున్నాను. మరుక్షణంలో గిరుక్కున వెనక్కు తిరిగాను. తెనాలి స్టేషన్‌కు వెళ్ళాను. నాలో ఆలోచించే శక్తిలేదు. యంత్రంలా స్టేషన్‌కు వెళ్ళి కూర్చున్నాను. నాలాటి అనాథలకు కన్నతల్లి వడుపులో పెట్టుకొని ఆశ్రయం ఇచ్చే ఆ సదనానికే వెళ్ళటానికి నిశ్చయించుకున్నాను. పిల్లను అనాథాశ్రమానికి పంపించడానికి నిశ్చయించుకున్నాను. గుండె రాయిచేసుకున్నాను. నేను చేసిన పాపానికి ప్రాయశ్చిత్తంగా ఏదివచ్చినా అనుభవించటానికి నిశ్చయించుకున్నాను. నామీద నాకే ఏదో పగ సాధించుకోవాలనే కోరిక కలిగింది. హైదరాబాదు బండికోసం ఎదురుచూస్తూ తెనాలి స్టేషన్‌లో కూర్చున్నాను." అనూరాధ వాక్ప్రవాహం ఒక్కసారిగా ఆగింది.

ప్రసాదు ఊపిరి బిగపట్టి వింటున్నాడు. (సశేషం)

# శ్రీ ముత్తుస్వామి దీక్షితార్

ఆర్. ఇందిరాదేవి.

సంగీతము ఒక దివ్యకళ. సంగీతము సర్వమానవ ప్రపంచమునకారాధ్యము. మోక్షసాధనమునకిది యుత్తమ మార్గము. గానామృతమును గ్రోలి తన్మయత్వము నొందని వాడుండడు. బృందావనములో శ్రీకృష్ణుడు వేణుగానముతో గోపికలను నవరసోత్పాదనచే బొంగి పొరలించి, యుర్రూత లూగించెనను విషయమందరికి విశదమే కదా! మన నిత్యజీవితమున సామాన్యమానవుడు కూడా తన దుఃఖ సమయములందు, భగవంతుని గూర్చిన కీర్తనలను విన్నప్పుడు మైమరచి తన దుఃఖమును మరచు నన్న అతిశయోక్తి కాదు.

ఇటువంటి మహత్తరమైనటువంటి, మధురమైనటువంటి సంగీతకళను, ఆయాదేశముల వారు వారివారి కనుగుణరీతుల నారాధింతురు. ఆళ్వారులు భక్తిగీతముల నెన్నియో రచించినారు. ఆళ్వారులు తమ భక్తి తాత్పర్యములను తమగీతముల ద్వారా ప్రపంచమునకు వెల్లడి చేసినారు. అవియే ''ప్రబంధము''లనబడును.

ఈ పుణ్యభూమియగు భారత దేశమున భగవత్ సాక్షాత్కారమునొంది తరించిన వేలకొలది పుణ్యాత్ముల గాథలు గలవు. కబీరు, మీరాబాయి, పురందరదాసు, రామదాసు మొదలగు మహాభక్తులు, భక్తిరస ముట్టిపడునటువంటి కీర్తనలెన్నియో రచించి భగవత్ సాక్షాత్కారమునొంది తరించిరి.

పదునెనిమిదవ శతాబ్దమున సంగీతమున కాధారభూతులు, ఆభరణమువంటి వారగు ముచ్చురు మహాత్ములు ఈ పవిత్ర భూమి యగు మన హిందూదేశమున జన్మించిరి. వారే శ్రీరామ పాద సేవా పరాయణుడగు శ్రీ త్యాగరాజు, దేవీ ఉపాసకుడగు శ్రీముత్తుస్వామి దీక్షితార్, భక్తాగ్రేసరుడగు శ్రీశ్యామ శాస్త్రి. వీరినే సంగీత త్రిమూర్తు లందురు. వీరు దైవాంశ సంభూతులు.

శ్రీ ముత్తుస్వామి దీక్షితార్ (1775–1835) పరమ భాగవతోత్తముడైన శ్రీ రామస్వామి దీక్షితార్ కుమారుడు. రామస్వామి దీక్షితార్ వేదశాస్త్రము లయందు, సంగీత శాస్త్రము నందు అగ్రగణ్యుడు. రామస్వామి దీక్షితార్‌కు చాలాకాలము వరకు సంతానములేదు. ఆయన కప్పుడు నలువది సంవత్సరములు. రామస్వామి సంతాన నిమిత్తమై పూజసల్పుటకు ''వైదీశ్వరన్ కోయిల్'' అను దేవాలయమునకు బోయి తదేక ధ్యానముతో ముత్తు కుమారస్వామిని నలువది రెండు రోజులారాధించెను. ఆయన భక్తి శ్రద్ధలతో ఆ విధముగ భగవంతు నారాధించుచుండ ఆయన సతీమణికి ఒక కల వచ్చెను. ఆ కలలో ఆమె యొక నారికేళఫలమును, తాంబూలమును, మరియు ఒక ముత్యాల హారమును స్వీకరించి నట్లయ్యెను. మరుసటి సంవత్సరమున, అనగా 1776 వ సంవత్సరము (మన్మథనామసంవత్సరము) లో ఆ పుణ్య దంపతులకు ముత్తు స్వామి జన్మించెను. తర్వాత రామస్వామి దీక్షితార్‌కు చిన్నస్వామి, బాలస్వామి యను నిరువురు పుత్రులు, బాలాంబ యనునొక పుత్రికయు కలిగిరి.

ముత్తుస్వామి జన్మస్థానము తిరువారూరు. ఇతడు వేద శాస్త్రములు, సంగీతవిద్యను తన తండ్రి వద్ద నభ్యసించెను. పదహారు సంవత్సరములు వచ్చుసరికి ముత్తుస్వామి అన్ని విద్యల యందును ప్రవీణుడయ్యెను. సకల విద్యలయందు ప్రావీణ్యత సంపాదించుటయే గాక, జగదంబ యందలి భక్తిశ్రద్ధలనుకూడా దానితోపాటు పెంపొందించుకొనెను. ఇట్లు పరాశక్తికి దాసానుదాసు డయ్యెను. చిన్నతనములోనే ముత్తుస్వామి వివాహితు డయ్యెను.

రామస్వామి దీక్షితార్ భక్తితాత్పర్యములు గలవాడు. తన పిల్లలతోజేరి దేవాలయమున ప్రతిదినము నామసంకీర్తనము జేయుచుండెను. ఆ సంకీర్తనమును విని ఆనందింపని వారు లేరు. ఒకానొక సమయమున మనాళి నివాసస్థుడగు శ్రీ ముత్తుకృష్ణ మొదలియారు తిరువారూరు యందుండు త్యాగరాజాలయమునకు తలవని తలంపుగా అరుదెంచెను. ఆ సమయమున దీక్షితార్ తన్మయుడై నామసంకీర్తనము భగవంతుని సమక్షమున గావించుచుండెను. శ్రీముత్తుకృష్ణ మొదలియారు ఆ కీర్తనలను విని ముగ్ధుడై రామస్వామిని తమ స్వగ్రామమునకు–అనగా మనాళికి–కుటుంబముతో సహా రావలయునని కోరెను. ఆయనకోరిన ప్రకారము రామస్వామి దీక్షితార్ తన కుటుంబముతో మనాళికి తరలి పోయెను. అచ్చట మొదలియారు యొక్క ఔదార్యపోషణము వలన జీవన యాత్ర సాగించు చుండెను. రామస్వామి యొక్క ప్రతిభను మెచ్చుకొని మొదలియారు ఎన్నియో బంగారు నాణెముల నొసగి సత్కరించెను. మనాళిలోనే ముత్తుస్వామికి ద్వితీయ వివాహము కూడా జరిగెను.

ఇట్లువీరు సంతోషముగా కాలము గడుపుచుండిరి. కొన్ని దినములు గడచిన తరువాత మనాళికి శ్రీచిదంబరనాథయోగి యనునొక యోగీశ్వరుడు అరుదెంచెను. ఆ యోగీశ్వరుడు రామస్వామి దీక్షితార్‌తో కొంతకాలము గడిపెను. ఆ సమయమున ముత్తుస్వామి ఆ యోగీశ్వరున కపరిమితమైన సేవజేసి ఆయనను

మెప్పించి ఆయన దయకు పాత్రుడాయెను. యుక్తవయస్కుడగు శ్రీ ముత్తుస్వామి యొక్క ప్రతిభను అవగాహన చేసుకున్నటువంటి యోగీశ్వరుడ తనకి 'శ్రీవిద్య' మంత్రమును ఉపదేశించెను. అంతియే గాక ముత్తుస్వామిని తనతోగూడ కాశీ నగరమునకు పంపవలసినదిగా ఆయన తండ్రియగు రామస్వామి దీక్షితార్ నడిగెను. రామస్వామికి తన తనయుని యోగీశ్వరుని వెంట బంపుట కిష్టము లేకపోయెను. తుదకు శ్రీముత్తుకృష్ణ మొదలియారు ప్రోత్సాహము వలన యోగీశ్వరుని వెంట బంపుట కంగీకరించెను. ముత్తుస్వామి తన జననీ జనకులకు నమస్కరించి తన ఇరువురి భార్యలతో ఆయోగీశ్వరుని వెంబడించెను. ఇట్లు వీరందరు కాశీ నగరము జేరిరి.

కాశీనగరమున యోగీంద్రులకు సేవజేయుచు, నిత్యము శ్రీవిద్య మంత్రమును తదేక ధ్యానముతోను, భక్తి శ్రద్ధలతోను పలుమారులు పఠించు చుండెను. ఇట్లు శ్రీవిద్యాఉపాసకుడై ఏడు సంవత్సరములు గడిపెను. ఇదియొక తపమేయని భావింపవచ్చును.

ఇట్లు మంత్రసిద్ధి కలిగినతోడనే ఆయోగీశ్వరుడు ముత్తుస్వామి దీక్షితారును తనస్వగ్రామమునకు వెళ్ళవలసినదిగా ఆదేశించెను. కాని ముత్తుస్వామి తన స్వగ్రామమునకు వెళ్ళుటకు సంశయించెను. తనకింకను మంత్రసిద్ధికాలేదనియు, అందులకై తనస్వగ్రామమునకు వెళ్ళుటకు సంశయించుచున్నానని యోగీశ్వరునితో వినయముగ నుడివెను. అప్పుడా యోగీశ్వరుడు "నీవు పవిత్రమైనటువంటి గంగా నదిలో స్నానముచేయుము. నీటిలోమునిగి లేచినతరువాత అర్ఘ్య ప్రధానమొనరింపుము.నీకు కావలసినది లభించును.నీకోరిక లీడేరును అని చెప్పి ఆశీర్వదించెను. గురుడాదేశించిన ప్రకారము ముత్తుస్వామి స్నాన సంధ్యాదులు జేయుటకై గంగానదీ ప్రాంతమునకు పోయెను. గంగలో స్నానముచేసి అర్ఘ్యప్రదానము జేయుచున్న సమయమున అతనికి ఒక శ్రేష్ఠమైనటువంటి వీణ కావలయునన్నకోరిక మనస్సునందుద్భవించెను. కోరుకున్న ప్రకారము ''యాళి'' ముఖముకలిగిన "రామ'' అను అక్షరములు లిఖయింప బడినటువంటి వీణ ప్రసాదింపబడెను. అమితానందము నొంది ఆవీణను తన గురువునకు జూపించెను. ఆ వీణ ఇప్పటికిని వారి సంతతివారి గృహమున విరాజిల్లుచున్నది. ఆ యోగీశ్వరుడు ముత్తుస్వామి నాశీర్వదించి సమాధినొందెను. ఆ చితంబర యోగీశ్వరుని సమాధి కాశీనగరమున ''హనుమాన్ ఘాటు" నందు జూడనగును.

యోగీశ్వరుడు సమాధినొందిన తర్వాత ముత్తుస్వామి గురువాజ్ఞ ప్రకారము కాశీ నగరమును వీడి మనాలికి వచ్చెను. ఆయన జననీ జనకులు ఆయనను జూచి చాల సంతోష పడిరి. ముత్తుస్వామి కాశీ నగరమున తాను గడపిన జీవితమునందలి వింతలు విశేషములు వారికి వివరించి చెప్పెను. అప్పుడు వారతని సిద్ధులనుగూర్చి విని మెచ్చుకొనిరి.

ముత్తుస్వామి తీర్థయాత్రలు చేయ సంకల్పించెను. తిరువరూరునందు తన తల్లిదండ్రులు వృద్ధాప్యమును గడుపుటకు తగిన సౌకర్యములన్నియు జేసెను. తన సోదరులగు చిన్నస్వామిని, బాలస్వామిని బిలుచుకొని యాత్రార్థమై బయలుదేరెను మార్గమధ్యమున చాలా కష్టములకోర్చి తుదకు తిరుత్తణి జేరెను. తిరుత్తణిలో శ్రీ సుబ్రహ్మణ్యస్వామి మంత్రమును భక్తితో జపించుచుండెను. ఒక దినము దీక్షితార్ తన సోదరులతోగూడ ఆలయ ప్రదక్షణము చేయు సమయమున నీతని కపరిమితమైనటువంటి దాహము కలిగెను. నీరు తేవలసినదిగా తన సోదరుల కాజ్ఞాపించెను. నీరు తెచ్చుటకై సోదరులు ఆ ప్రదేశమును వీడి, కొంత దూరము వెడలి పోయిరి. ఆ ప్రశాంత వాతావరణములో శ్రీ ముత్తుస్వామి దీక్షితార్ నొకచోట నాసీనుడై నిర్మలమైనటువంటి మనస్సుతో కన్నులు మూసికొని భగవత్ ధ్యానములో నిమగ్నుడాయెను. అప్పుడు స్వామియే ఒక ముదుసలి రూపమున అచ్చటి కరుదెంచి కలకండ నతని నోటిలోవేసెను. ధ్యానములో నిమగ్నుడైనటువంటి ముత్తుస్వామి కన్నులు తెరిచెను. తెరవగానే అతనికి నెమిలి వాహనుడై ఇరు ప్రక్కల వళ్ళి మరియు దైవ్వనలతో కూడిన మురుగేశు డాయనకు ప్రత్యక్షమాయెను. తక్షణమే మాయా మాళవ గౌళ రాగములో "నాథాతి గురుగుహ జయతి'' అనుపాట పాడెను. ఇదియే ఆయన యొక్క ప్రథమ కీర్తన.

తరువాత తన సోదరులతో కూడా కాంచీపురమునకు పోయెను. అచ్చట ఏకాంబరనాథుని దర్శించి '' కాంబర నాథం భజే'' అను పాటను భక్తితో పాడెను. ''కంజ దళాయతాక్షి" యను పాట ''కమలా మనోహరి'' రాగమునందత్యంత మధురముగా పాడెను. ఇచ్చటనే ముత్తుస్వామికి శ్రీ త్యాగరాజు గురువగు ఉపనిషత్ రామబ్రహ్మంహంతో పరిచయము కలిగెను. ముత్తుస్వామి ఆయనతో కొంతసేపు ఇష్టాగోష్టి జరిపెను. ఆయన ఆదేశానుసారము రామబ్రహ్మ విరచితమైన రామాష్టపదికి ఒక సొంపైన రాగమును సృష్టించెను. తరువాత తిరువాన్నామలై చిదంబరము సేవించి తుదకు తిరువారూరునకు వచ్చెను. అప్పుడాయనకు నలుబదిరెండు సంవత్సరములు. ఆసమయమున తల్లి స్వర్గస్థురాలయ్యెను. తండ్రికూడ 1817వ సంవత్సరమున స్వర్గస్థుడాయెను.

ముత్తుస్వామి జననీ జనకుల మరణానంతరము తిరువారూరులోనే వాసము చేయుచుండెను. శ్రీ లలితా పరమేశ్వరిని సేవించుచు, శ్రీ విద్యపూజలు చేయుచుండెను. శ్రీ త్యాగరాజస్వామి గురించి అయిదుగురు ఉపదేవతలను గురించి అత్యుత్తమమైనటువంటి కృతుల నెన్నియో రచించెను. ఈ సమయముననే ''శ్రీమహా గణపతి'' యను ''గౌళరాగ'' కీర్తనమును రచించెను. పదహారు కీర్తనములు పదహారు గణపతులను గురించి జేసెను. నవవర్ణ కీర్తనములు, ఇంకా తదితర కీర్తనములు కమలాంబికనుద్దేశించి రచించెను.

యాత్రచేయు నిమిత్తమై ముత్తుస్వామి తన సోదరులతో తంజావూరునకు బోయెను. అచ్చటనుండి నాగపట్టణమునకరగి అక్షయలింగ దర్శనార్థమై మరల తిరువారూరనకు

వచ్చెను. ఆయన తిరువారూరు వచ్చుసరికి రాత్రయ్యెను. అర్చకులు ఆలయపు ద్వారములు మూయువేళయ్యెను. ముత్తుస్వామి నిరాశజెందక భగవంతుని దర్శనార్థమై అర్చకులను ఆలయపు తలుపులు తెరవ వలయునని కోరెను. అర్చకులు ఆయన మాటను లెక్క పెట్టలేదు. దర్శనము జేసికొనుటకు మరునటి రోజు రమ్మని నుడివిరి. కాని మనోస్థైర్యముగల ముత్తుస్వామి ఒక అడుగైనను ముందుకు వేయలేదు. ఆ సమయమున 'అక్షయలింగ విభో' అను కీర్తనమును "శంకరాభరణ" రాగమున అత్యంత మాధుర్యముగ బాడెను. ఈ పాట ముగిసిన తరువాత భగవంతుని ప్రేరణచే తలుపులు తెరువబడెను. ముత్తుస్వామి జగదీశ్వరుని తనివి తీరునట్లు దర్శనము జేసికొనెను. అచ్చటనున్న అర్చకులు తమతప్పును దెలిసికొని దీక్షితార్‌ను శరణు వేడిరి.

ఈ సంఘటన జరిగిన తరువాత శ్రీముత్తుస్వామి తిరుచిరపల్లెకు పయనించెను. శ్రీరంగం, జంబుకేశ్వరమునకు పోయెను. ఆయన దర్శించిన దేవతలపై కీర్తనములను జేసెను. మరల తిరువారూరునకు వచ్చెను. తిరువారూరునందు దేవీ ఉపాసన ప్రారంభించెను. ఆదిశంకరు లాదేశించిన ప్రకారము, శాస్త్రములలో చెప్పిన రీతిగా ముత్తుస్వామి పరాశక్తిని సాక్షాత్కరింప జేసికొనుటకు పూజలుచేయ నుద్యుక్తుడాయెను. అట్టితరి ముత్తుస్వామి కొన్ని బాధలకు లోనయ్యెను. శిష్యబృందమధికముగ నుండెను. వారిని పోషించుటకు ధనము లేకుండెను.

ఒకనాడు ముత్తుస్వామి పూజలో తన్మయుడై పరమానందముజెందుచుండు సమయమున గ్రామమునసబు అచ్చటికేతెంచి, భూమిశిస్తు చెల్లింపవలయునని తొందర పెట్టసాగెను. గ్రామమునసబు యొక్క ప్రవర్తనకు మనస్సులో విసిగి, దీక్షితారు తానా భూమిని ఒక పురోహితునికి దానము చేసినాననియు, అచ్చటికి వెళ్ళి వసూలు చేసికొనమనియు చెప్పెను.

ఇంకొక పర్యాయము అనగా ఒక శుక్రవారమున ముత్తుస్వామి యథావిధిగా పరాశక్తి నారాధించుచుండెను. పూజచేయు సమయమున, అతని శిష్యులగు పొన్నయ్య, శివానందం, తంబియప్పన్, వడివేలు, కమలం అను వారచ్చటనుండిరి. ముత్తుస్వామి భార్య లిరువురచ్చటనే యుండిరి. ఆ సమయమున వారెందులకో చాలా దుఃఖించు చుండిరి. అది చూసిన దీక్షితార్ శిష్యురాలగు కమలం వారి యొక్క దుఃఖమునకు కారణమేమని అడిగెను. అంత వారిరువురు పూజకు సమర్పించుటకు ఇంటియందేమియు లేదని ఆమెతో చెప్పిరి. అప్పుడు కమలం తన బంగారు గాజుల నమ్ముటకు సిద్ధపడెను. ఈ విషయము ముత్తుస్వామి దీక్షితార్‌నకు దెలిసెను. దీక్షితార్ కమలంతో గాజు లమ్మవద్దనియు, ఆమె తెచ్చిన సొమ్ము ఒక్క పది రోజులకు మాత్రమే ఉపయోగపడునే కాని శ్రీ త్యాగరాజస్వామి దయయుండినచో, ఎవరికిని ఎటువంటి కష్టపరిస్థితియందును భయముండదని, కష్టములన్నియు తొలగిపోవునని జెప్పెను. ఈ విధముగ అందరి నోదార్చి మరల పూజ చేయసాగెను. మంగళహారతి ఇచ్చి "త్యాగరాజం భజరే". అనుపాట యదుకుల కాంభోజి రాగమునందు భక్తితో పాడెను. పాట ముగిసినదే తడవుగా ఒక సేవకుడు వారింటిలోనికి వచ్చి, ఆయనకు నమస్కరించి, ఒక బండినిండా భోజన సామాగ్రి తెచ్చినానని జెప్పెను. ఆసామగ్రియంతయు వడపాటి మంగళం నివాసియగు మొదలియారు ఒక ఉద్యోగి నుద్దేశించి పంపిన భోజన సామాగ్రి ఆయనకు ఉయోగ పడనందున, ఇక్కడికి బంపెనని దీక్షితార్‌తో సవినయముగ జెప్పెను. ఈ సంఘటన వలన దీక్షితార్ యొక్క భార్యలకు, శిష్యులకు ఆయనయందు అపరిమితమైన భక్తి శ్రద్ధలు పెంపొందెను. శ్రీముత్తుస్వామి దీక్షితార్‌నకు భగవంతుని యందుండు భక్తి అసమాన్యమని అందరికి విదితమైనది.

ముత్తుస్వామికి దైవభక్తి దినదినాభివృద్ధిగాంచు చుండెను. ఒకానొక సమయమందు ముత్తుస్వామి "గౌళపూజ" చేయ సంకల్పించెను. గౌళపూజయందు, ముఖ్యముగా దేవికి మద్య మాంసాదులు సమర్పణ చేయువలయును. అప్పుడప్పుడీపూజ దీక్షితార్ చేయుచుండెను. ఇట్లు ముత్తుస్వామి ఈ గౌళపూజచేయ సంకల్పించెనను వార్త తిరువారూరుయందుండు బ్రాహ్మణులకు దెలిసెను. పూజా విధానమును తిలకించుటకై, విమర్శించుటకై బ్రాహ్మణులు అచ్చటి కేతెంచిరి. ముత్తుస్వామి దీక్షితార్, ఆయన శిష్యబృందము పూజా గృహతలుపులు మూసికొని లోన దేవీ పూజచేయుచుండిరి. ఈ పూజా విధానము ఆచుట్టు ప్రక్కల నుండు బ్రాహ్మణులకెంత మాత్రము నచ్చలేదు. ఈ అభ్యాసమును మాన్పింపవలయునని బ్రాహ్మణులందరు ఏకీభవించిరి. దీక్షితార్‌ను దుర్భాషలాడిరి. కోపావేశమున తలుపులను తామే స్వయముగా తెరచిరి. అక్కడ ఆ బ్రాహ్మణులకు దేవీ సమక్షమున మద్య మాంసాదులకు బదులుగా, పుష్పములును, పాయసము అగుపించెను. బ్రాహ్మణులు తమ తప్పిదమును తెలిసికొని, తమను తాము నిందించుకొని దీక్షితార్‌ను తమతప్పిదములు క్షమియింప వలసినదిగా వేడుకొనిరి. దయార్ద్ర హృదయుడగు దీక్షితార్ వారిని కరుణించెను.

శ్రీ ముత్తుస్వామి దీక్షితార్ వద్ద కొంతమంది శిష్యులు పాఠములు నేర్చుకొనుచుండిరి. ఒకనాడు తంబియప్పన్ అను శిష్యుడు పాఠములు నేర్చుకొనుటకు రాడయ్యెను. ముత్తుస్వామది గ్రహించి, తంబియప్పన్ రాకపోవుటకు కారణమేమని మిగత శిష్యులనడిగెను, తంబియప్పన్ తీవ్రమైన కడుపునొప్పితో బాధ పడుచున్నాడని జెప్పిరి. వీరిట్లు చెప్పుచుయుండగా, తంబియప్పన్ స్వయముగా అతిప్రయాసతో నచ్చటికి వచ్చి తనబాధను గూర్చి గురువునకు జెప్పుకొనెను. ఆ బాధ నివారణ కావలయునన్న, బ్రాహ్మణులతో మంత్రములు, జపములు చేయింపవలసి యుండుననియు జెప్పెను. తాను శూద్రుడననియు, బ్రాహ్మణులు తనకై శాంతి జేయుటకు నిరాకరించిరని జెప్పి, తన బాధ నేవిధముగనైనను నివారణచేయుమని తన గురువగు దీక్షితార్‌ను, అతి దీనముగా ప్రార్థించెను. ఆయన మనస్సుకరిగి వెంటనే అఠాణ రాగములో "బృహస్పతీ" అను కీర్తన "దివాకరతనుజం" అను యదుకుల కాంభోజి రాగములో ఇంకొక కీర్తనయు పాడి భగవంతునారాధించి విభూతి నిచ్చెను. తంబియప్పన్ యొక్క బాధంతయు క్షణములో మాయమయ్యెను. నవగ్రహ కీర్తనలను ముత్తుస్వామి రచించెను.

దీక్షితార్ యొక్క మహిమ నలుదెసల వ్యాపించెను. జనులు తండోపతండములుగవచ్చి, ఆయనను దర్శించి పోవుచుండిరి. ఒకసారి మధురాపురవాసులు, దీక్షితార్‌ను సందర్శించి ఆయన ఆశీర్వాదమును పొందుటకై, తిరువారూరు వచ్చిరి. ముత్తుస్వామి దీక్షితార్ సోదరులగు చిన్నస్వామి, బాలస్వామి ఆయనచే రచింపబడిన కీర్తనములు పాడుచుండగా విని ఆనందించి, వారిని మధురాపురమునకు పంపవలసినదిగా దీక్షితార్‌ను కోరిరి. ఆయన అందుల కంగీకరించెను. మధురలో బాలస్వామి శ్రావ్యమైన కంఠముతో, అందరిని ఆకర్షించినట్లే పాడెను. కొలదికాలములోనే బాలస్వామికి పెక్కుమంది శిష్యులయిరి. దీక్షితార్ యొక్క కీర్తనములు మధుర, తిర్నల్‌వేలి జిల్లాలలో ప్రసిద్ధికి వచ్చెను. అచ్చట దురదృష్టవశాత్తు చిన్నస్వామి ఆకస్మిక మరణమునకు గురియయ్యెను. సోదరుని మరణమునకు బాలస్వామి బాధ యొందు చుండెను. సంగీతమునందు బాలస్వామి యొక్క ప్రతిభ, ఎట్టాయపాళెం రాజునకు దెలియవచ్చెను. రాజు బాలస్వామిని తన ఆస్థాన విద్వాంసునిగ జేయదలచెను. రాజు బాలస్వామిని తన ఆస్థాన విద్వాంస పదవి నలంకరింపవలసినదిగా ఆహ్వానము నంపెను. సోదరుని ఆకస్మిక మరణమునకు కుందుచున్నటువంటి బాలస్వామి కిష్టములేకపోయినను తుదకు ఆహ్వానమంగీకరించి ఎట్టాయపురమునకు అరిగెను. అచ్చట ఆయన సత్కరింపబడెను. రాజును మెప్పించి ఆయనయొక్క మన్ననకు పాత్రుడాయెను. రాజు, గౌరవ నీయులైన ధనవంతుని కుమార్తెతో బాలస్వామికి త్వరలోనే వివాహముకూడా చేయుటకు నిశ్చయించెను.

దైవారాధనయే తన జీవిత పరమావధియని తలచు ముత్తుస్వామి రామేశ్వరమునకు బయలుదేరెను. పెక్కు పుణ్య స్థలమును, సందర్శించి తుదకు మధురకు వచ్చెను. మధురలో తన సోదరుల విషయము లన్నియు తెలియవచ్చెను. చిన్నస్వామి దివంగతుడాయెననియు, బాలస్వామి ఎట్టాయపురమునకు బోయె ననియు తెలియవచ్చెను. సోదరుని జూడ నాపేక్షతో ఎట్టాయపుర మునకు పయనమయ్యెను. మార్గమధ్యమున, సత్తూరు అను గ్రామమునందు బసచేసెను. పూజచేయు నిమిత్తమై ఆ పురమునందుండు నొకదేవాలయమునకు పోయి ''వెంకటేశ్వర యాదవ'' యను పాట మకరంజిని రాగ మందు, ''బాలసుబ్రహ్మణ్యం భజేహం'' అనుపాట సురట రాగమందు శ్రావ్యముగా పాడెను. అలసట దీర్చుకొని మరల పయనింపసాగెను. అది వేసవికాలము. ప్రజలకు త్రాగుటకు కూడా నీరు లేకయుండెను. ముత్తుస్వామి దీక్షితార్ రాక విన్నతోడనే ''పేదకు దొరకిన పెన్నిధి వోలె'' ప్రజలందరు ఆయనచుట్టు గుమిగూడి నమస్కరించి వర్షమునకై వరుణదేవుని ప్రార్థింప వలయునని ఏకగ్రీవముగా వేడుకొనిరి. వారి మొరనాలకించి, కరుణార్ద్ర హృదయుడగు ముత్తుస్వామి "ఆనందామృత వర్షిణీ'' అను అమృత వర్షిణి రాగములో వరుణదేవుని మనస్సు కరుగునట్లుగా ప్రార్థించెను. వరుణదేవుని దయవలన కుంభవర్షము కురిసెను. జనులందరు సంతసించి ఆయనను వేనోళ్ళ కీర్తించిరి. ఆయన ఎట్టాయ పురమునకు బోవ సిద్ధపడగా వారొకపల్లకి సిద్ధముచేసి అందు శ్రీముత్తుస్వామిని, ఆయన ఇరువురి భార్యల నాసీనులంగావించి ఎట్టాయ పురమునకు గొనిపోయిరి.

ఈ మహాత్ముని రాకను దెలిసికొని, బాలస్వామి సహాయముతో, ఎట్టాయపురపు రాజు శ్రీముత్తుస్వామి దీక్షితార్‌ను బహువిధములుగ సత్కరించి పూజించెను. ఎట్టాయపుర పరిసరములనుండి, రాజభవనము వరకు శ్రీముత్తుస్వామి నతివైభవముగ నూరేగింపు జేసిరి. శ్రీముత్తుస్వామి దీక్షితార్ సమక్షముననే బాలస్వామి వివాహ మతివైభవోపేతముగ జరిపింపబడెను. మహారాజు మన్నన తనసోదరుడగు బాలస్వామి పొందినందులకు దీక్షితార్ అమితానందము నొందెను. బాలస్వామి దీక్షితార్ అతిమనోహరముగను, వీనులకింపౌసగునట్లుగను పాడుచుండెను. సోదరునిచే దీక్షితార్ తాను రచించిన కీర్తనలను పాడించుకొనుచు ఆనందించుచుండెను.

ఎట్టాయపురమునందు కొంతకాలము గడిపినతరువాత, ముత్తుస్వామి తన ఇరువురి భార్యలతో మరల తిరువారూరునకు వచ్చెను. కొంతకాలమునకు ఆయన ఇరువురిభార్యలు స్వర్గస్థులైరి. మరల యాత్రార్థమై దీక్షితార్ పయనింపసాగెను. మధురానగరము జేరెను. మధురయందు, మీనాక్షిని సందర్శించి ''మీనాక్షి మేముదం'' అను కీర్తన పూర్వికల్యాణి రాగమునందు పాడెను. మరల ఎట్టాయ పురమునకు అరిగెను. తనసోదరునిరాక బాలస్వామి కానందము కలిగెను. బాలస్వామి తన సోదరుడు రచించిన పాటలన్నియు నేర్చుకొనెను. బాలస్వామి ఆ కృతులను రాగయుక్తముగా ఒడుదుడుకులులేక అతి మధురముగా పాడుచుండుట విని శ్రీముత్తుస్వామి ఆశ్చర్యపడెడువాడు.

అది 1835 వ సంవత్సరము. శ్రీముత్తుస్వామి ఎట్టాయ పురములోనే యుండెను. అప్పుడు ఒక వింత జరిగెను. పట్టపేనుగకు మదమెక్కి స్మశాన వాటికకు పరుగిడెను. రాజు చాలా చింతించి, ఏమిచేయుటకు తోచక, తక్షణమే ఈ విషయము శ్రీముత్తుస్వామికి తెలియచేసెను. ముత్తుస్వామి భయపడవలదని రాజునకు ధైర్యమును జెప్పి, మరుసటి దినమున అన్నియు సరిపోవునని జెప్పి, వూరట కలిగించెను.

మరుసటి దినమే దీపావళి. శ్రీముత్తుస్వామి దీక్షితార్ ప్రాతః కాలముననేలేచి స్నానసంధ్యాదులు గావించుకొని, పూజ లన్నియు ముగించుకొని రాజు నాశీర్వదించుటకై రాజ భవనమునకు వచ్చెను. రాజాయనను సత్కరించి ప్రణమిల్లెను. అప్పుడచట బాలస్వామియు, మంత్రులు మొదలగు వారందరు యుండిరి. రాజాజ్ఞ ప్రకారమందరు ఆసీనులైరి. అప్పుడు శ్రీముత్తుస్వామి దీక్షితార్ తన సోదరుని తనచే విరచితమైనటువంటి కొన్ని కీర్తనలను పాడుమనెను. బాలస్వామి ఆయన ఆజ్ఞను శిరసావహించి కీర్తనములను చక్కగా పాడెను. కడపట శ్రీదీక్షితార్ తనతోగూడా తనసోదరుని, శిష్యులను ''మీనాక్షి మేముదం'' అను పాట పాడవలసినదిగా అనుజ్ఞనొసగెను. అందరు ఒకేసారి ఆ కీర్తనలను పాడ మొదలిడిరి.

అనుపల్లవి పాడుసమయమున దీక్షితార్ వారి శిష్యులను "మీనలోచని పాశమోచని" అను పదములను పెక్కుమారులు పాడుమని ఆదేశించెను. వారావిధముగ పాడుచున్న సమయమున శ్రీముత్తుస్వామి దీక్షితార్ తన్మయత్వముతో "శివేపాహి" యని మూడు సారులుచ్చరించి దేవునిలో ఐక్యమాయెను. అచ్చట నుండు వారందరికి ఆశ్చర్యమును, దుఃఖమును కలిగెను. బాలస్వామికిన్ని, రాజునకును చాలా బాధ కలిగెను. గత్యంతరములేక రాజు శ్రీముత్తుస్వామి దీక్షితార్‌నకు దహన క్రియలను లోటుపాటులు లేకుండా జరిపించుటకు ఏర్పాటు చేసెను. ఆ మహాత్ముని స్మశానమునకు గొనిపోవుచుండు సమయమున, ఆ మదించిన ఏనుగచ్చట గనపడెను. జనులు దానిని జూచి భయపడి శవము నచ్చట దించి కొంతదూరము పోయి ఏమి జరుగునో యని చూచుచుండిరి. ఆ ఏనుగచ్చటికి వచ్చి ముమ్మారు ఆ శవమునకు ప్రణమిల్లి సాధువై యథాప్రకారము రాజభవనమునకు వచ్చెను. ఆ పట్టపేనుగకు మదమంతయు వదలి పోయెను.

శ్రీ ముత్తుస్వామి దీక్షితార్ యొక్క దైవభక్తి అసమాన్యమైనది. అటువంటి సాధుపుంగవుడు భక్తాగ్రేసరుడగు దీక్షితార్‌ను సత్కరించినందులకు, ఆయన అనుగ్రహ ఆశీర్వాదములకు పాత్రుడైనందులకు రాజెంతయో గర్వపడెను. ఈ విధముగ శ్రీ దీక్షితార్ భగవత్ సాన్నిధ్యమును జేరి మోక్షపదవినలంకరించిన మహానుభావుడు.

# ముఖ్య వార్తలు

## రాష్ట్రంలో

ఆగస్టు 11 రెండు రోజులపాటు జరిగే కలెక్టర్ల సమావేశాన్ని గవర్నరు హైదరాబాదులో ప్రారంభించారు.

ఆగస్టు 13 ఆంధ్రప్రదేశ్ వర్కింగ్ జర్నలిస్టుల సంఘం వార్షిక సమావేశానికి ప్రెస్ కౌన్సిల్ ఆఫ్ ఇండియా అధ్యక్షుడు హైదరాబాదులో ప్రారంభోత్సవం జరిపారు.

ఆగస్టు 20 కేంద్ర వార్తా సౌకర్యాల శాఖమంత్రి హైదరాబాదులో జనరల్ పోస్ట్ ఆఫీసు కొత్త భవనాలకు ప్రారంభోత్సవం జరిపారు.

ఆగస్టు 28 హైదరాబాదు మునిసిపల్ కార్పొరేషన్‌కు మేయర్ డిప్యూటీ మేయర్లుగా శ్రీ మీర్ అక్బర్ అలీ నస్రీ, శ్రీ డి. యాదవరావుగార్లు ఎన్నికయ్యారు.

సెప్టెం. 10 హైదరాబాదులోని హిందీ ప్రచార్ సభ రజితోత్సవాలకు ముఖ్యమంత్రి హైదరాబాదులో ప్రారంభోత్సవం జరిపారు.

## భారతదేశములో

ఆగస్టు 11 శ్రీపి.షిలు ఆవో నాయకత్వం క్రిందగల నాగాలేండ్ ప్రభుత్వం అధికారంనుండి దించివేయబడింది.

ఆగస్టు 13 భారతీయ సాహిత్యకార్ పరిషత్తు తొలి సమావేశానికి కొత్తఢిల్లీలో రాష్ట్రపతి ప్రారంభోత్సవం చేశారు.

ఆగస్టు 14 శ్రీ టి. యన్. అంగమీ నాయకత్వాన పదకొండు మంది సభ్యులు గల నాగాలేండ్ మంత్రి మండలి పదవి స్వీకారం చేసింది.

ఆగస్టు 20 జాతీయ అభివృద్ధి మండలి కొత్తఢిల్లీలో సమావేశమయ్యింది.

ఆగస్టు 19 కేంద్ర ప్రణాళికా మంత్రి చతుర్థ పంచవర్ష ప్రణాళికా ముసాయిదాను పార్లమెంటుకు సమర్పించారు.

సెప్టెం. 1 మూడు రోజుల పాటు పర్యటించే నిమిత్తం సింగపూర్ ప్రధాని లీకువాన్‌యూ కొత్తఢిల్లీ చేరుకున్నారు.

సెప్టెం. 2 బంగారం నిబంధన ఉత్తర్వు ప్రకారం 14 కారెట్లకు మించిన వన్నెగల బంగారు ఆభరణాల తయారీపై విధించిన ఆంక్షలను తొలగిస్తూ పార్లమెంటులో ప్రధాని ప్రకటన చేశారు;

సెప్టెం. 3 మూడు రోజులపాటు పర్యటించే నిమిత్తం ఇండోనీసియా విదేశాంగ మంత్రి ఆదంమాలిక్ కొత్తఢిల్లీ చేరుకున్నారు.

సెప్టెం. 7 లోక్‌సభ నిరవధికంగా వాయిదాపడింది.

సెప్టెం. 10 రాజ్యసభ నిరవధికంగా వాయిదాపడింది.

సెప్టెం. 11 అఖిల భారత మేయర్ల మండలి ఆరవ సమావేశానికి పూనాలో మహారాష్ట్ర గవర్నరు ప్రారంభోత్సవం చేశారు.

## విదేశాలలో

ఆగస్టు 11 జకార్తాలో ఇండోనీసియా, మలయేసియాలు శాంతి ఒప్పందంపై సంతకాలు చేశాయి.

ఆగస్టు 14 శ్రీ మిహిర్ సేన్ జిబ్రాల్టర్ జలసంధిని అవలీలంగా ఈదారు.

సెప్టెం. 6 దక్షిణాఫ్రికా ప్రధాని డా. హెండ్రిక్ వెర్వోర్డ్ పార్లమెంటులో హత్యగావించబడ్డారు.
లండన్‌లో కామన్వెల్తు ప్రధానుల సమావేశం ఆరంభమయ్యింది.

వ్యవసాయదారులకు

అవసరమైన

## ఫాక్టంఫోస్

(అమోనియం ఫోస్ఫేటు 16:20)

## అల్ట్రాఫోస్

(పొడి చేసిన ఖనిజ ఫాస్ఫేటు)

## అమోనియం సల్ఫేటు

## సూపర్ ఫాస్ఫేటు

ఎన్‌పికె ఎరువుల మిశ్రమం

# FACT

*first in the field!*

పారిశ్రామిక వేత్తలకు

అవసరమైన

## అన్‌హైడ్రస్ అమోనియా

## సల్ఫ్యూరిక్ ఏసిడు

## సల్ఫర్ డయాక్సైడు

## అమోనియం క్లోరైడు

## సోడియం ఫ్లోరైడు

—మా వద్ద లభించును.

# ది ఫెర్టిలైజర్ అండ్ కెమికల్స్
# ట్రావన్కూర్ లి.

రిజిష్టర్డ్ కార్యాలయం: ఏలూర్, ఉద్యోగ మండల్, పి. ఒ. కేరళ

# ఆంధ్ర ప్రదేశ్ లో ప్రాథమిక, సెకండరీ విద్య

1953 లో సంయుక్త మద్రాసు రాష్ట్రంలోని 11 తెలుగు జిల్లాలతో ఆంధ్రరాష్ట్రం ఏర్పడింది. 1956 నవంబరు 1 వ తేదీన అప్పటి హైదరాబాదు రాష్ట్రంలోని 9 తెలుగు జిల్లాలను కలుపుకుని హైదరాబాదు రాజధానిగా ప్రస్తుత ఆంధ్రప్రదేశ్ ఏర్పాటు అయింది.

1961 జనాభా లెక్కల ప్రకారం ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర విస్తీర్ణం 1,06,052 చదరపు మైళ్లు; జనాభా 3,59,83,447 ఉంది. చదరపు మైలుకు 339 మంది ఉంటున్నారు

ప్రజాస్వామ్య వికేంద్రీకరణను ప్రవేశపెట్టిన తర్వాత జిల్లా, బ్లాకు స్థాయిలలో పరిపాలనను జిల్లా పరిషత్తు, పంచాయతీ సమితులకు దత్తం చేయడం జరిగింది. బ్లాకు స్థాయిలో పంచాయతీ సమితులు, ప్రాథమిక విద్య, ప్రజారోగ్యం, కమ్యూనికేషనులు, ఇతర అభివృద్ధి కార్యక్రమాలను అమలు జరుపుతాయి. జిల్లా స్థాయిలో జిల్లా పరిషత్తులు, సెకండరీ విద్య, మరి ఇతర అభివృద్ధి కార్యక్రమాలను అమలు జరుపుతాయి.

ఆంధ్రప్రదేశ్ రాష్ట్రంలో ఆంధ్ర, తెలంగాణా రెండు ప్రాంతాలు ఉన్నాయి. ఆంధ్ర ప్రాంతంలో 19వ శతాబ్దం ఆరంభంలో మిషనరీలు ఆధునిక విద్యావ్యాప్తికి కృషిచేశాయి. మద్రాసు విద్యాశాఖ (1855)ను ఏర్పాటు చేసినతర్వాత మాత్రమే విద్యావిషయంలో తమ బాధ్యతను రాష్ట్ర ప్రభుత్వం గుర్తించ నారంభించినది. ఆ తర్వాత 1857 లో మద్రాసు విశ్వవిద్యాలయం నెలకొల్పబడినది. 1921 వరకు ప్రభుత్వం, ప్రాథమిక విద్యకన్నా సెకండరీ విద్యా వ్యాప్తి పైనే తమ దృష్టిని కేంద్రీకరించినది. విద్యారంగాన్ని స్థానిక స్వపరిపాలనా సంస్థలకు మార్చిన తర్వాత ప్రాథమిక విద్యా వ్యాప్తికి కృషి జరిగింది. అనేక పట్టణ, గ్రామీణ ప్రాంతాలలో నిర్బంధ ప్రాథమిక విద్యనుగూడ ప్రవేశపెట్టారు. 1948 వరకు తెలంగాణా ప్రాంతం నిజాం డొమినియన్ లో భాగంగా ఉన్నది. ప్రభుత్వం విద్యపై చాలా తక్కువ ఖర్చు చేసెడిది. 1948 లో హైదరాబాదు రాష్ట్రంలో ప్రజాస్వామ్య పరిపాలన ఏర్పడువరకు యీ ప్రాంతంలో విద్యాభివృద్ధి చెప్పుకోదగినంత లేదు. ఆ తర్వాత 1948 నుండి 1956 వరకు 8 సంవత్సరాలలో యీ రంగంలో యితోధికాభివృద్ధి సాధించబడినది. ఈ కాలంలో చెప్పుకోదగిన అభివృద్ధి సాధించబడినప్పటికీ, యీ ప్రాంతం వెనుకబడే ఉన్నది. ఆంధ్రప్రదేశ్ రాష్ట్రం ఏర్పడిన తర్వాత ఆంధ్ర, తెలంగాణా రెండు ప్రాంతాలలో విద్యాభివృద్ధిని సమానం చేయడం, ప్రత్యేక సమస్యలలో ఒకటిగా భావించబడినది.

## ప్రాథమిక విద్య

1953 లో ఆంధ్ర రాష్ట్రం ఏర్పడిన తర్వాత ప్రాథమిక విద్యా సంస్థ, పరిపాలనలు, సంయుక్త మద్రాసు రాష్ట్రపు పద్ధతిలోనే కొనసాగినవి. పాఠశాలల యాజమాన్యం 54.2 శాతం ప్రైవేటు పరంగాను, 38.5 శాతం స్థానిక సంస్థలు, 7.3 శాతం ప్రభుత్వ అధీనంలో నిర్వహించబడినవి. సహాయక పాఠశాలలకు ఉపాధ్యాయుల జీతాలకు సమంగా బోధనా గ్రాంట్లు, బోధనా గ్రాంటుకు 15 శాతం మించకుండా నిర్వహణ గ్రాంట్లు ఇవ్వబడినాయి.

తెలంగాణా ప్రాంతంలో చాలావరకు పాఠశాలలు ప్రభుత్వ నిర్వహణలోనే ఉన్నాయి. ఆంధ్ర ప్రాంతంలో కన్నా తెలంగాణా ప్రాంతంలో ప్రాథమిక విద్యావ్యాప్తి చాలా తక్కువగా ఉన్నది. ప్రాథమిక పాఠశాలల సంఖ్య తక్కువ. ఉపాధ్యాయుల కొరత (ప్రత్యేకంగా తెలుగు ప్రాంతీయభాష తెలిసినవారు) మూలంగా విస్తరణ స్థాయి మందకొడిగా కొనసాగుతున్నది.

ప్రభుత్వానికి అదనపు ఖర్చు లేకుండా ఎలిమెంటరీ విద్యా ప్రమాణాలను అభివృద్ధిపరచే మార్గాలను సూచించడానికి పిలుగా 1954 లో అప్పటి ఆంధ్రప్రభుత్వం కుప్పుస్వామి కమిటీని ఏర్పాటుచేసింది. ఈ కమిటీ చేసిన సిఫార్సులను అనుసరించి ఆంధ్రప్రాంతంలోని ఎయిడెడ్ ఎలిమెంటరీ పాఠశాలలన్నిటిని రాష్ట్ర ప్రభుత్వం తన అధీనంలోకి తీసుకున్నది. ఆ తర్వాత స్థానిక సంస్థల (జిల్లాబోర్డులు, మునిసిపాలిటీలు) పరం చేయబడినవి. పంచాయతీరాజ్ పథకం అమలు తర్వాత ఎలిమెంటరీ విద్య పంచాయతీ సమితుల క్రిందకు తేబడినది.

ప్రాథమిక, సెకండరీ స్థాయిలలో అవసరమైన సౌకర్యాల విస్తరణను మదింపు చేయడానికి 1956-58 లో రాష్ట్రంలో విద్యా విషయక సర్వే జరిపారు. నిర్బంధ ప్రాథమిక విద్యా పథకాన్ని అమలు జరపడంలో యీ సర్వే తోడ్పడింది. 1965-66 లో యీ సర్వే కొనసాగించ బడింది.

1961 లో నిర్బంధ ప్రాథమిక విద్యా చట్టాన్ని ఆమోదించారు. 1961-62 లో యీ చట్టంలోని అంశాలను, 6-7 సంవత్సరాల వయస్సు వారికి వర్తింపజేశాయి. ఆ తర్వాత సంవత్సరాలలో మిగతా వయస్సు వారికి అమలు జరుప జేశారు. 1965-66 లో మూడవ ప్రణాళిక ఆఖరు సంవత్సరం 6-11 సంవత్సరాల వయస్సుగల బాలలందరికీ యీ చట్టం వర్తింపజేశారు.

బాలలకు ప్రోత్సాహం కలిగించడానికి వీలుగా బీదలైన, అవసరమైన బాలలకు మధ్యాహ్న భోజనవసతి కలిగించారు. దీనికి తోడు, బీద బాలలకు కొందరికి పాఠ్య పుస్తకాలను ఉచితంగా సరఫరా చేశారు. మధ్యాహ్న భోజన పథకానికి 'కేర్' సంస్థ సహాయాన్ని వినియోగిస్తున్నారు. ఈ పథకం క్రింద 9.25 లక్షల మంది బాలలకు లాభం కలుగుతున్నది.

1958-59 లో రాష్ట్రమంతటికి ఒకే పాఠ్య ప్రణాళిక, సిలబస్ వర్తించే 7 సంవత్సరాల ఎలిమెంటరీ విద్యా పథకాన్ని ప్రవేశపెట్టారు.

ప్రాథమిక పాఠశాలల సంఖ్యను 29076 (1956-57) నుండి 34040 (1960-61) వరకు పెంచడం జరిగింది. 1965-66 నాటికి యీ సంఖ్య 38000 వరకు పెరుగుతుందని అంచనా వేశారు. 1956-57 లో 1 నుండి 5 తరగతులలో విద్యార్థుల సంఖ్య 24.54 లక్షలు ఉండగా 1960-61 లో 29.76 లక్షలకు పెరిగింది. మూడవ ప్రణాళిక ఆఖరు సంవత్సరాంతం (1965-66) నాటికి యీ సంఖ్య 37 లక్షలకు (22 లక్షలు బాలలు, 15 లక్షలు బాలికలు) పెరుగుతుందని అంచనా వేశారు. 6-11 సంవత్సరాల వయస్సు గ్రూపులో 92 శాతం బాలలకు, 63 శాతం బాలికలకు యీ పథకం వర్తింప చేయబడింది. నాలుగవ ప్రణాళికా కాలంలో యీ తరగతులలోకి అదనంగా 10 లక్షల మంది బాలలకు ప్రవేశం కల్పించాలని ప్రతిపాదించారు. దీనితో నాలుగవ ప్రణాళికాంతానికి 6-11 సంవత్సరాల వయస్సు వారిలో అదనంగా 100 శాతం బాలలకు 80 శాతం బాలికలకు ప్రవేశం కల్పించబడుతుంది. మూడవ ప్రణాళిక ఆఖరుకు 6 నుండి 7 తరగతులలో 4.5 లక్షల మందిని చేర్చుకుంటారని అంచనా వేశారు. నాలుగవ ప్రణాళికా కాలంలో యీ పాఠశాలలో అదనంగా 2.5 లక్షల మందిని చేర్చుకోవాలని ప్రతిపాదించారు. దీనితో 11-13 సంవత్సరాల వయస్సు గ్రూపులో 50 శాతం బాలలకు, 20 శాతం బాలికలకు ప్రవేశం లభిస్తుంది.

ఈ విస్తరణ పథకం అమలుకు ప్రాథమిక పాఠశాలల నిర్వహణ నిమిత్తం తగినంత మంది అర్హతగల ఉపాధ్యాయులను సమకూర్చడమే క్లిష్టమైన సమస్య. అందుకుగాను ప్రస్తుతం ఉన్న శిక్షణ పాఠశాలలలో ప్రవేశ సంఖ్యను ఎక్కువ చేయడమేగాక అదనంగా కొత్త శిక్షణ పాఠశాలలను ప్రారంభించి, బోధనా శిక్షణ సౌకర్యాలను విస్తరింపజేశారు. ఉపాధ్యాయుల శిక్షణతోపాటు తెలంగాణాలోని శిక్షణ పొందని ఉపాధ్యాయుల సమస్యనుకూడ ఎదుర్కొంటున్నారు. వారికి ప్రత్యేక శిక్షణ పాఠశాలలను నెలకొల్పారు. 7-8 సంవత్సరాలలో యీ సమస్య తీరిపోతుంది. సెకండరీ సీనియర్ బేసిక్ శిక్షితులకు రు. 35/-లు; ఎలిమెంటరీ జూనియర్ బేసిక్ శిక్షితులకు రు. 30/-లు వార్షికంగా స్టయిఫండు ఇస్తున్నారు.

ఎలిమెంటరీ స్థాయిలో విద్యా ప్రమాణాలను పెంపొందింప జేయడానికి స్టేట్ ఇనిస్టిట్యూట్ ఆఫ్ ఎడ్యుకేషన్‌ను నెలకొల్పారు. 1964-65 నుండి యిది పనిచేస్తున్నది.

## సెకండరీ విద్య

1956-57 నుండి రాష్ట్రంలో సెకండరీ విద్యాభివృద్ధి వివరాలు దిగువ ఇవ్వబడినాయి :

| విద్యాసంస్థలు | సంస్థల సంఖ్య | | |
|---|---|---|---|
| | 1956-57 | 1960-61 | 1965-66. (అంచనాలు) |
| (అ) ఉన్నతపాఠశాలు. | 705 | 1,031 | 1,900 |
| (ఆ) హయ్యర్ సెకండరీ, బహుళార్థసాధక పాఠశాలలు | 28 | 140 | 234 |
| (ఇ) IX నుండి XII తరగతులలో విద్యార్థుల సంఖ్య. (లక్షలలో) | 1.76 | 1.96 | 3.41 |
| (ఈ) విద్యాసంస్థలపై జరిగిన ఖర్చు (రూ. లక్షలలో) | 273.30 | 537.16 | 800.00 |

గత 9 సంవత్సరాల కాలంలో ఉన్నతపాఠశాలలు, హయ్యర్ సెకండరీ పాఠశాలల సంఖ్య, వాటిపై ఖర్చు మూడింతలు పెరిగినట్లు పైవివరాలద్వారా తెలుస్తుంది. ఉన్నతపాఠశాలలలో విద్యార్థుల సంఖ్య (IX నుండి XII) 1.76 లక్షలనుండి 3.41 లక్షలకు పెరిగింది. వీటిలో చాలా పాఠశాలలు గత 3, 4 సంవత్సరాలలోనే ప్రారంభించబడినందువల్ల 2, 3 సంవత్సరాలలో విద్యార్థుల ప్రవేశ సంఖ్య ఇనుమడించే అవకాశాలు ఉన్నాయి. పాఠశాలల ఏర్పాటుకై ప్రజల ప్రోత్సాహం, విరాళాల సేకరణ సంతృప్తికరంగా ఉన్నది. అనేక ప్రాంతాలలో ఉన్న పాఠశాలలు నెలకొల్పబడినాయి. వాటిలో చాలా వాటికి తగిన భవనాలు, పరికరాలు లేవు.

సెకండరీ పాఠశాలల పట్టభద్రులైన ఉపాధ్యాయుల నిమిత్తం శిక్షణ సౌకర్యాలు తగినంతగా ఉన్నాయి. అయినా నాలుగవ ప్రణాళికా కాలంలో శిక్షణ సౌకర్యాల విస్తరణ అవసరమవుతుంది. రాష్ట్రంలో 9 ఉపాధ్యాయుల శిక్షణ కళాశాలలు ఉన్నాయి. ఈ సంస్థలలో వార్షికంగా 1300 మందికి ప్రవేశంలభిస్తుంది. రెండు శిక్షణ కళాశాలలో విద్యలో ఎం. ఎ. డిగ్రీ కోర్సుకూడ ఉంది. రాష్ట్రంలోని 5 కళాశాలలకు అనుబంధంగాఉన్న విస్తరణ సేవవిభాగాలు, ఇన్‌సర్వీసు శిక్షణ, సెమినార్లు, వర్కుషాపులను నిర్వహిస్తూ

న్నాయి. హయ్యర్ సెకండరీ పాఠశాలలకు ఎకడమిక్ గైడెన్సు ఇవ్వడానికీ, ప్రదర్శనాపూర్వక బోధన నిర్వహించడానికీ, ఆయావిషయాలలో ఉపాధ్యాయుల నిమిత్తం సెమినార్లు నిర్వహించడానికీ, తనఖీలకు ఐదుగురు సబ్జెక్టు ఇన్స్పెక్టర్ల బృందాన్ని నియమించారు.

విద్యార్థుల విద్యాస్థాయిని పరిశీలించడానికి అనుసరించే విధానాలను అభివృద్ధి పరచడానికి అవసరమైన చర్యలనుతీసుకున్నారు. క్యుమూలేటివ్ రికార్డు పద్ధతిని ప్రవేశపెట్టారు. పబ్లిక్ పరీక్షల సమయంలో క్లాసువర్కుకు 25 మార్కులు అదనంగా ఇస్తున్నారు. వార్షిక పరీక్షలలో క్లాసు రికార్డులకుకూడా తగినంత పరిగణన ఇవ్వబడుతున్నది. సంప్రదాయక పరీక్షా విధానాలలో మార్పులు తేవాలని ముదలియార్ కమీషన్ సిఫార్సులు చేసింది. తదనుగుణంగా 1963 ఫిబ్రవరి 21 న రాష్ట్రీయవాల్యేషన్ యూనిటును నెలకొల్పారు. ఆంధ్ర ప్రదేశ్‌లోని వివిధజిల్లాలకు చెందిన ప్రధానోపాధ్యాయులు, స్కూల్ అసిస్టెంట్లు, ఇన్స్పెక్టింగ్ అధికారులకు శిక్షణ కోర్సులు, వర్కుషాపులను యీయూనిటు నిర్వహించింది. దీనికితోడు రాష్ట్రంలోని ప్రతిజిల్లా హెడ్ క్వార్టర్స్‌లో హయ్యర్ సెకండరీ పాఠశాలల ఉపాధ్యాయులకు, సూపర్‌వైజర్లకు. టీచర్ ఎడ్యుకేటర్స్‌కు పునరుశ్చరణ తరగతులు నిర్వహించారు. కేంద్ర పరీక్షల యూనిటు వారి కొన్నిపుస్తకాలను తెలుగులోకి అనువదింపజేశారు. అంతేగాక "సెకండరీ పాఠశాలలలో ఫెయిల్ అయినవారి సంఖ్య ఎక్కువ కావడానికిగల కారణాలు," "బహుళార్థసాధక పాఠశాలలు, సెకండరీ పాఠశాలలో అంతర్గతమదింపు విధానాల ప్రయోజనాలు, అక్రమవినియోగాలు,' వంటివిషయాలలో పరిశీలనలు కూడాచేయడం జరిగింది. పరీక్షా అంశాలను అభివృద్ధిచేసే ఉద్దేశంతో వివిధ పాఠశాలలకు చెందిన ఉపాధ్యాయుల నుండి పరీక్షాంశాలను సేకరించారు. ముదలియార్ కమీషన్ చేసిన సిఫార్సులను అనుసరించి కొన్ని సెకండరీ పాఠశాలలలో వైవిధ్యంగల కోర్సులను ప్రవేశపెట్టారు. ఈ రాష్ట్రంలో 7 సంవత్సరాల ఎలిమెంటరీవిద్య, 3 సంవత్సరాల ఉన్నత పాఠశాలవిద్య, 2 సంవత్సరాల హయ్యర్ సెకండరీ విద్యతో విద్యావ్యవస్థ కొనసాగుతున్నది. ఈ విద్యా విధానాన్ని అనుసరించి 1966-67 లో VIII వ తరగతిలో సమీకృత సెకండరీ సిలబస్ ప్రవేశపెట్టారు.

సెకండరీ పాఠశాలలో శాస్త్ర విజ్ఞాన బోధనలో ప్రమాణాల పెంపుదలకు హైదరాబాదులో శాస్త్రవిజ్ఞాన యూనిటును నెలకొల్పారు. ఈ పథకంక్రింద సైన్సువిద్యా బోధనలోని ఆధునిక విధానాలలో ఉన్నత పాఠశాలల సైన్సు ఉపాధ్యాయులకు శిక్షణ ఇస్తున్నారు. హయ్యర్ సెకండరీ శాలలలో పోస్ట్ గ్రాడ్యేటు సైన్సు ఉపాధ్యాయుల కొరతను నివారించడానికి వీలుగా హయ్యర్ సెకండరీ పాఠశాలల పట్టభద్రులైన సైన్స్ ఉపాధ్యాయుల నిమిత్తం 9 నెలల డిప్లొమా కోర్సు నిర్వహిస్తున్నారు.

అనేక పాఠశాలలకు తగిన వసతి, భవన సౌకర్యాలు లేవు. నాలుగవ పంచవర్ష ప్రణాళికలో సెకండరీ పాఠశాలలకు భవనాలు పరికరాల నిమిత్తం రూ. 4.00 కోట్లు కేటాయించారు. నాలుగవ ప్రణాళికా కాలంలో ఉన్నత పాఠశాలలలో విద్యార్థుల ప్రవేశ సంఖ్యను 2.4 లక్షలకు ఎక్కువ చేయాలని ప్రతిపాదించారు. నాలుగవ ప్రణాళిక ప్రారంభంలో 3.41 లక్షలు ఉండగా ఈ ప్రణాళిక ఆఖరుకు 5.81 లక్షలకు పెంచుతారు. క్రొత్త విద్యా విధానానికి అనుగుణంగా రెండు సంవత్సరాల హాయర్ సెకండరీ పి.యు.సి. కోర్సులను ప్రవేశ పెట్టడానికి రూ. 2.00 కోట్లు కేటాయించారు.

## సాంఘిక విద్య

పంచాయతీ సమితులద్వారా సాంఘిక విద్యా కార్యక్రమాలు అమలుచేస్తున్నారు. విద్యాశాఖకు చెందిన అధికారులు సాంకేతిక విషయాలు అందజేస్తారు. పంచాయతీ సమితులు వయోజన విద్యా తరగతులను నిర్వహిస్తున్నాయి. వయోజన విద్యా పద్ధతులలో శిక్షణ పొందిన స్థానిక పాఠశాలల ఉపాధ్యాయులను వయోజన విద్యా కేంద్రాలలో నియమిస్తారు. ఈ పనికి శిక్షణ పొందిన ఉపాధ్యాయులకు నెలకు 16/- శిక్షణ పొందని ఉపాధ్యాయులకు రూ. 12/-లు ఇస్తారు. వయోజన విద్యా పద్ధతులలో ఉపాధ్యాయులకు శిక్షణ ఇవ్వడానికి ఆంధ్ర ప్రాంతంలోని పటమటలోను, తెలంగాణా ప్రాంతంలోని ఇబ్రహీంపట్నంలోను రెండు ప్రభుత్వ శిక్షణ పాఠశాలలు ఉన్నాయి.

బ్లాకు స్థాయిలో సాంఘిక విద్య ఆర్గనైజర్లు, యువజన క్లబ్బులు, మహిళామండలులు, రిక్రియేషన్ కేంద్రాలు మొదలైన వాటిలో వయోజన విద్యా కార్యక్రమాలను నిర్వహిస్తారు. ప్రతి పంచాయతీ సమితిలో ఒక సాంఘిక విద్యా ఆర్గనైజరు ఉన్నాడు.

## బాలికలవిద్యా

రాష్ట్రంలో ప్రాథమిక సెకండరి స్థాయిలలో బాలికల విద్యాభివృద్ధి వివరాలు దిగువ ఇవ్వబడినాయి.

| | విద్యార్థినుల సంఖ్య | | |
|---|---|---|---|
| | 1956-57 | 1960-61 | 1965-66 |
| I నుండి V తరగతులు | 9,10,015 | 11,35,391 | 15,00,000 |
| VI నుండి VIII ,, | 63,492 | 92,085 | 1,66,000 |
| X నుండి XII ,, | 23,258 | 30,651 | 68,000 |

ఎలిమెంటరి పాఠశాల లన్నిటిలోసహవిద్యకొనసాగుచున్నది. విద్యార్థినులు అధిక సంఖ్యలో ఉన్నప్రాంతాలలో బాలికల మాధ్యమిక, ఉన్నత పాఠశాలలు ఏర్పాటు చేశారు. ప్రతి తరగతిలో కనీసం 15 మంది విద్యార్థినులు ఉన్నచోట్ల

బాలికలకు ప్రత్యేక పాఠశాలలను నెలకొల్పారు. ప్రత్యేక పాఠశాలలు లేని ప్రదేశాలలో బాలల పాఠశాలలలో బాలికలను చేర్చుకుంటారు. ప్రతి తాలూకా హెడ్ క్వార్టర్సులో బాలికలకు కనీసం ఒక సెకండరీ పాఠశాలను నెలకొల్పడం ప్రభుత్వ విధానం.

రెండవ ప్రణాళికా కాలంలో బాలికల విద్య నిమిత్తం ప్రత్యేక కార్యక్రమాన్ని చేపట్టారు. గ్రామీణ ప్రాంతాలలో ఉపాధ్యాయినులు పనిచేయడానికి వీలుగా సెలక్టు చేసిన కొన్ని ప్రాంతాలలో వారికి వసతి సౌకర్యం కల్పించి క్వార్టర్సు నిర్మించారు. పాఠశాలవిద్య పూర్తి చేసి ఉపాధ్యాయ వృత్తిని స్వీకరించదలచిన విద్యార్థినులకు నెలకు రూ. 20 [illegible] ఎటి మంటున్నాయి బోధనా శిక్షణ [illegible] ప్రత్యేక [illegible] ఉన్నాయి. శిక్షణ పొందేవారికి శిక్షణ కాలంలో స్టయిఫండు చెల్లించ బడుతుంది.

## సైన్సు బోధన

1వ క్లాసునుండి పాఠ్య ప్రణాళికలో సైన్సును నిర్బంధ విషయంగా చేర్చారు. పాఠశాలలలో, ప్రత్యేకంగా గత కొద్ది కాలంగా సెకండరీ పాఠశాలలో తగిన పరికరాలు లేబొరేటరీలు లేని కారణంగా సైన్సు బోధన కుంటుపడింది. సెకండరీ పాఠశాలలన్నిటికీ పరికరాలు, లేబొరేటరీలు లభింప జేయడానికి కృషి చేస్తున్నారు. సెకండరీ పాఠశాలలలో అదనపు వసతి సౌకర్యాలు, పరికరాలు, లేబొరేటరీలు ఏర్పాటు చేయడానికి నాలుగవ ప్రణాళికలో రూ. 4.00 కోట్లు కేటాయించారు.

## ఫిజికల్ విద్య

రాష్ట్రంలో ఫిజికల్ విద్యను ఆంధ్ర ప్రాంతములో కాకినాడలో చీఫ్ ఇన్స్పెక్టర్, తెలంగాణా ప్రాంతంలో హైదరాబాదులో ఇన్స్పెక్టరు పర్యవేక్షిస్తున్నారు. ప్రాంతీయ ఇన్స్పెక్టర్లు వారికి తోడ్పడుతుంటారు. హైదరాబాదులో ఫిజికల్ విద్య ఇన్స్పెక్ట్రెస్ ఉన్నది. గుంటూరులోని ప్రాంతీయ ఇన్స్పెక్ట్రస్ ఆమెకు సహాయ పడుతుంది. హైదరాబాదులో ఫిజికల్ విద్యకుచెందిన ప్రభుత్వ కళాశాల ఉన్నది. పాఠశాల పాఠ్యకుచెందిన ప్రణాళికలో భాగంగా ఫిజికల్ విద్య నేర్పబడుతున్నది. సెకండరీ పాఠశాలలలో ఫిజికల్ విద్యలో శిక్షణ పొందిన ఉపాధ్యాయులను నియమించారు. ప్రతి కళాశాలలో ఫిజికల్ విద్య డైరెక్టరు, సిబ్బంది ఉంటారు.

జిల్లా, ప్రాంతీయ స్థాయిలలో వివిధ వయస్సులకు చెందిన బాల బాలికలకు ఆటల పోటీలు నిర్వహిస్తారు.

మన బాలలు బాధ్యతగల పౌరులుగా రూపొందడంలో సహాయపడే శారీరక, మానసిక, ఆలోచనా పటిమ పెంపొందే విధంగా ఉద్దేశించబడిన ప్రణాళికా యుక్త జాతీయ పునర్నిర్మాణ పథకం యిది.

ఈ లక్ష్య సాధనకు (i) డ్రిల్లు; ఫిజికల్ విద్య; ఆటలు (ii) మానసిక శిక్షణ (iii) సాంస్కృతిక కార్యక్రమాలు, జానపద నృత్యాలు, సంగీత నాటకాలు (iv) వ్యవస్థ (v) పరిపాలన, కార్యక్రమాలు అనులు జరుపుతారు.

ఈ కార్యక్రమాల ద్వారా దేశంలో సాంస్కృతిక వైవిధ్యంలోగల ఏకత్వం విద్యార్థులకు స్పష్టంగా అవగత మవుతుంది.

(2) ఈ పథకంయొక్క నిర్వహణ స్వరూపం:

## డైరెక్టరేటు, కొత్తఢిల్లి

ప్రాంతీయ [illegible], [illegible], [illegible], [illegible], [illegible] సికిందరాబాదు, పూనా, బెంగుళూరు.

దక్షిణ ప్రాంతం కార్యాలయం బెంగుళూరులో వుంది. కేరళ, మైసూరు, ఆంధ్రప్రదేశ్ రాష్ట్రాలలో ఈ పథకానికి సంబంధించిన సిబ్బంది ఈ కార్యాలయం అజమాయిషీలో వుంటుంది. 1963 సెప్టెంబరులో యీ పథకాన్ని ఆంధ్ర ప్రదేశ్‌లో ప్రవేశపెట్టడం జరిగింది. డ్రిల్లు, ఆటలు, సాంస్కృతిక కార్యకలాపాలను యీ ఇనస్ట్రక్టర్లు బోధిస్తారు. హైదరాబాదులోని విద్యాశాఖ డైరెక్టరు అనుమతితో ఈ రాష్ట్రంలోని వివిధ పాఠశాలల్లో నియమించిన 274 ఎన్. ఎఫ్. సి. ఇనస్ట్రక్టర్ల పని తీరును పరిశీలించే నిమిత్తం హైదరాబాదులో ఒక సూపర్‌వైజరు నియమింపబడ్డారు. సిబ్బంది జీత భత్యాలను భారత ప్రభుత్వం భరిస్తుంది. ఆంధ్ర ప్రదేశ్‌లోని వివిధ పాఠశాలల్లో మొత్తం 5,400 మంది విద్యార్థులకు ఎన్. ఎఫ్. సి. కార్యక్రమాలు బోధించ బడుతున్నాయి.

## ఎన్. సి. సి, ఎ. సి. సి.

1950 మే నెలలో ఉమ్మడి మద్రాసు రాష్ట్రంలో ఎన్. సి. సి. తొలిసారి ప్రవేశపెట్టబడింది. ఆంధ్రప్రదేశ్ రాష్ట్రానికి 1955 లో ఒక ప్రత్యేక సర్కిల్ హెడ్‌క్వార్టర్స్ ఏర్పాటు చేయబడింది.

## పునర్వ్యవస్థీకరణ

కళాశాలల్లోనూ, తదితర విద్యా సంస్థలలోనూ గల డిగ్రీ తరగతి విద్యార్థులలో ఆరోగ్యవంతులై దృఢ శరీరులైన వారందరికీ 1963 నుంచి నిర్బంధ ఎన్. సి. సి. శిక్షణను ప్రవేశపెట్టారు. 1964 లో ఎన్. సి. సి. లో ఒక పెద్ద మార్పు జరిగింది. ఎన్. సి. సి. కి, నేషనల్ కేడెట్ కోర్ రైఫిల్సుకునూ మధ్యగల శిక్షణ విధానంలోని అసమానతలను తొలగించే వుద్దేశంతో దీనిని పునర్వ్యవస్థీకరించడం జరిగింది. ఎన్. సి. సి. లోని వివిధ డివిజన్లలో గ్రేడ్‌లను స్థిరీకరించడం, ఎన్. సి. సి. అధికార్లకు గౌరవ వేతనాన్ని యివ్వడం, అన్ని

రకాల కంపెనీలకు——స్త్రీ కేడెట్లతో సహా- సమాన సంఖ్య (200 మంది) కేడెట్లను ఏర్పాటుచేయడంవంటి విజయవంతమైన ప్రయోజనాత్మకమైన మార్పులు చేయడం జరిగింది.

తృతీయ పంచవర్ష ప్రణాళిక ఆఖరునాటికి వివిధ డివిజన్లలోగల కేడెట్ల సంఖ్య ఈ దిగువ యివ్వడమైనది;—

| | | | |
|---|---|---|---|
| (ఎ) | సీనియర్ డివిజన్; | | కేడెట్ల సంఖ్య |
| | సైన్యం | ... .... | 61,237 |
| | నౌకాదళం | .... .... | 2,000 |
| | వైమానికదళం | ... .... | 1,000 |
| | స్త్రీలు | .... .... | 6,200 |
| | | మొత్తం | 70,437 |
| (బి) | జూనియర్ డివిజన్ | | |
| | సైన్యం | ... ... | 18,300 |
| | నౌకాదళం | .... .... | 3,900 |
| | వైమానికదళం | .... .... | 3,550 |
| | స్త్రీలు | .... .... | 7,200 |
| | | మొత్తం | 33,000 |
| (సి) | ఎ. సి. సి. | ... ... | 1,92,060 |

తృతీయ పంచవర్ష ప్రణాళికా కాలంలో హెడ్ క్వార్టర్ సర్కిల్ కెడెట్ కోర్‌ను ఎన్. సి. సి. డైరెక్టరేటుగా ప్రతి రాష్ట్రంలోనూ మార్పుచేసి ఎన్.సి.సి. ఆర్ ను ఎన్.సి.సి. తో కలిపివేసి; గ్రూపు హెడ్ క్వార్టర్సును ఏర్పాటు చేశారు 31-3-1966 నుంచి గ్లలరీ కేడెట్ కోరును రద్దుచేశారు.

## శిక్షణ

పెరేడులకు, శిబిరాలకు హాజరయ్యేవారి సంఖ్య క్రమక్రమంగా పెరుగుతున్నది. కేవలం డ్రిల్లు చేయించడమే కాకుండా తుపాకి కాల్పుల అభ్యాసం వంటి ప్రయోజనాత్మకమైన పనులలో కూడా శిక్షణ గరపబడుతుంది. ఇంచుమించు అన్ని యూనిట్లలోకూడా హాజరైనవారి సంఖ్య ఎప్పుడూ 75 శాతానికి తక్కువగా లేదు. 1964-65 సంవత్సరంలో మొత్తం 118 వార్షిక శిబిరాలు నిర్వహింపబడగా, వాటికి 47,011 మంది కేడెట్లు హాజరయ్యారు. అంటే 63 శాతం హాజరయ్యారన్నమాట. రెండు ఎ. సి. సి. సాంఘిక సేవా శిబిరాలు కూడా నిర్వహింపబడ్డాయి. సుమారు 3 కిలోమీటర్ల పొడవు రోడ్డు నిర్మించబడినది. ఒక చెరువుకు చుట్టు కట్టలువేసి, గట్టిపరిచే పని కూడా నిర్వహించారు. హార్స్లీ కొండలపై స్త్రీ కేడెట్లకు అఖిల భారత స్థాయిలో వేసవి శిక్షణ శిబిరం నిర్వహించబడింది. దేశంలోని వివిధ ప్రాంతాలనుండి 16 మంది ఎన్. సి. సి. అధికారులూ, 133 మంది కేడెట్లు యిందులో పాల్గొన్నారు. వివిధ రాష్ట్రాలకు చెందిన కేడెట్ల మధ్యగల వ్యత్యాసాలు నమసి పోవడానికి, ఒకరి అభిప్రాయాలను మరొకరు తెలుసుకోవడానికి జాతీయ సమైక్యతా భావ వికాసానికి ఈ శిబిరం ఎంతగానో తోడ్పడింది.

ప్రస్తుతం అందజేయబడిన శిక్షణ పరికరాలు- ముఖ్యంగా ఆయుధాలు- అధికారికంగా అనుమతించబడిన సంఖ్యలో లేవు. రక్షణ బలాలకు వీటి అవసరం అధికంగా వున్న కారణంచేత వాటిని అటు మళ్ళించడం జరిగింది. అయితే వున్న పరికరాలు మాత్రం మన రాష్ట్రంలోని ఎన్. సి. సి కేడెట్ల శిక్షణ అవసరాలకు పూర్తిగా సరిపోతాయి.

వైమానిక విభాగానికి చెందిన కేడెట్లకు హైదరాబాదులోనే వైమానిక శిక్షణ లభిస్తున్నది. నౌకా విభాగానికి చెందిన కేడెట్లలో కొంతమందిని ప్రతిఏటా ఎన్నికచేసి, వారికి భారత నౌకాదళంతాలూకు బోర్డు షిప్పులలో శిక్షణ యివ్వబడుతుంది.

బాలుర కేడెట్లలోకన్నా బాలికల కేడెట్లలో ఉత్సాహం ఎక్కువగావుంది. శిబిరాలు, తదితర కార్యకలాపాలలో హాజరవుతున్న కేడెట్ల సంఖ్యనుబట్టే ఈ విషయం స్పష్టమౌతున్నది. సిగ్నల్స్, వైద్యం, నర్సింగ్ కంపెనీలు బాలికల నిమిత్తం వున్నాయి. బాలికల యూనిట్లకు చెందిన నర్సింగ్, సిగ్నల్ కంపెనీలకు ఒక ఉమ్మడి సిలబస్ రూపొందించబడింది. వైద్య కళాశాలలోని బాలికల మెడికల్ కోర్‌లకు కూడా బాలుర మెడికల్ కోర్‌లకు యిచ్చే శిక్షణే యివ్వబడుతున్నది.

విద్యార్థులకు మూడేళ్ళపాటు నిర్బంధంగా ఎన్.సి.సి. శిక్షణవుడాలని ఆంధ్రప్రదేశ్‌లోని నాలుగు విశ్వ విద్యాలయాలు నిబంధనల్ని రూపొందించాయి. కేడెట్లు ఈ మూడేళ్ళలోనూ రెండు శిబిరాలకు తప్పక హాజరు కావలసివుంటుందని యిటీవలే ఆంధ్ర, ఉస్మానియా విశ్వ విద్యాలయాలు నిబంధనలను ఏర్పరచాయి.

## రిపబ్లిక్ దినోత్సవ ప్రతినిధులు:

రాష్ట్రంలో అన్ని ఎన్.సి.సి. విభాగాలనుండి కొంతమంది కేడెట్లను ప్రతిఏడాది ఎంపికచేసి క్రొత్త ఢిల్లీలో జరిగే రిపబ్లిక్ దినోత్సవాల్లో పాల్గొనే ప్రతినిధులుగా పంపిస్తూంటారు. అంతర్ రాష్ట్రపోటీలో ఆంధ్రప్రదేశ్ బృందానికి ప్రతిఏటా ప్రథమస్థానంగాని, ద్వితీయస్థానంగాని వస్తూండడం ఒక విశేషం. అంతేగాక ఢిల్లీలో జరిగే ఊరేగింపులో అనేక వాటికి వివిధ ట్రోఫీలను ఆంధ్రప్రదేశ్ బృందం ప్రతియేటా గెలుచుకొస్తోంది. ఉత్తమ కేడెట్‌కు ఆంధ్రప్రదేశ్ నుంచి యీ దిగువ పేర్కొన్న సంవత్సరాలలో ఎన్నికచేయడం జరిగింది

1960_ సీనియర్ డివిజన్ బాలికలు-అండర్ ఆఫీసర్ సుమిత్రా లక్ష్మణ్.

1962_ ఒటియు కేడెట్ మహమ్మద్ సలీం జహంగీర్.

1964_ సీనియర్ డివిజన్ బాలికలు_సీనియర్ అండర్ ఆఫీసర్ రేణుకారెడ్డి

1965_జూనియర్ డివిజన్_సార్జెంట్ బార్బరా రోవి.

## సంసిద్ధతా పథకాలు:—

ఇటీవలి సరిహద్దు సంఘర్షణల దృష్ట్యా ఎన్.సి.సి. ఎంపిక చేసిన ఎన్.సి.సి. కేడెట్లకు వేసవి శెలవల్లో ఒక నెల రోజుల పాటు సైన్యంలో పద్ధతిని తీవ్రతర శిక్షణ ఇచ్చే ఉద్దేశంతో 'సంసిద్ధతా పథకం'అనే పథకం ఒకటి ప్రారంభించ బడినది. దీనికి చాలా ప్రోత్సాహం లభిస్తోంది. వివిధ కేంద్రాలలో 3,221 మంది కేడెట్లు శిక్షణపొందారు. జంటనగరాలలో 500 మంది కేడెట్లు ఆవిధమైన శిక్షణపొందారు.

### తృతీయ పంచవర్షప్రణాళికలో ఎన్.సి సి. ఎ.సి.సి. లకు అయిన ఖర్చు—

| సంవత్సరం | | ప్రణాళిక కేటాయింపు | ప్రణాళికేతర కేటాయింపు | మొత్తం |
|---|---|---|---|---|
| 1961_62 | ... | 4,052 | 24,56,378 | 24,60,430 |
| 1962_63 | ... | 1,43,540 | 24,42,368 | 25,85,908 |
| 1963_64 | ... | 13,66,020 | 21,00,794 | 34,66,814 |
| 1964_65 | ... | 18,00,940 | 23,74,261 | 41,75,201 |
| 1965_66 | ... | 15,42,033 | 40,50,700 | 55,92,733 |

## స్కౌటు శిక్షణ:—

హైదరాబాదులోని భారత స్కౌట్స్ అండ్ గైడ్స్ ఆధ్వర్యం క్రింద రాష్ట్రంలోని వివిధ స్కౌటు కార్యక్రమాలు నిర్వహింపబడతాయి. స్కౌట్ అండ్ గైడ్ జిల్లాలు రాష్ట్రంలో వుంటాయి. దీనికి జిల్లా విద్యాశాఖాధికారి ఎక్స్ అఫిషియో డిస్ట్రిక్టు కమిషనర్ గా వ్యవహరిస్తాడు. 1965_66 లో కబ్సుగా 30,800 మంది. స్కౌట్స్‌గా 49,200 మంది నమోదయ్యారు. 640 మంది రోవెర్సుగా నమోదయ్యాయి!

### ఇంకా—

| | | | |
|---|---|---|---|
| 1. | స్కౌటు మాస్టర్లు | .... .... .... | 3,500 |
| 2. | స్కౌటు కమిషనర్లు | ... .... .... | 285 |
| 3. | బుల్‌బుల్‌లు | .... .... .... | 7,800 |
| 4. | గైడులు | ... ... .... | 8,540 |
| 5. | రేంజర్లు | ... .... ... | 265 |
| 6. | గైడ్ కెప్టెన్‌లు | ... ... .... | 640 |
| 7. | గైడ్ కమిషనర్లు | ... ... ... | 125 |

వరదలు, పండుగులు, తిరునాళ్ళు జరిగే సమయాలలో స్కౌట్సు ఎంతగానో సేవ చేస్తున్నారు, ఏడాది పొడుగునా స్కౌట్ ఊరేగింపులూ, శిక్షణ కార్యక్రమాలు నిర్వహింప బడుతున్నాయి. తూర్పుగోదావరి జిల్లా. కొత్తపేట తాలూకా వాడపల్లివద్ద గౌతమి గోదావరి నదిలో 12_4_1965న పడవ ప్రమాణం సంభవించి నప్పుడు ఆత్రేయపురంలోని ఎం.జి. హాయ్యర్ సెకండరీ పాఠశాలలోని స్కౌటు సభ్యులు వైద్య సహాయం, ప్రాథమిక చికిత్స, ఆహారసరఫరాలను అందజేసి అమోఘమైన సేవ చేశారు. నిప్పులుచెలరేగి ఎండలో, ఎర్రటి యిసుకలో నిలిచి సేవా తత్పరతతో వారుచేసిన అమోఘసేవకు చిహ్నంగా 9 వీరోచిత వెండి పతకాలు వారికి బహుకరించబడినవి.

రష్యాలోని క్రెమియాకు సంబంధించిన ఆర్టెక్‌లో జరిగిన అంతర్జాతీయ బాలుర శిబిరానికి రోవర్ ఎమ్ముయేల్ హసన్ హాజరయ్యారు. మరొక రోవర్ మహమ్మద్ సబీర్ ఖాన్ సౌదీ అరేబియాలో ఏర్పాటు చేయబడిన స్కౌటుసేవా శిబిరానికి హాజరయ్యారు.

హైదరాబాదు హెడ్ క్వార్టర్స్ బృందం తాలూకు రేంజర్ కుమారి రాకీ భగవాన్‌దాస్ 1961 అక్టోబర్ 10న హిమాలయాలలోని 22,420 అ_ఎత్తుగల మృగతుని శిఖరాన్ని అరోహించిన తొలి మహిళా బృందంలో మొట్టమొదలు నిలచిన వ్యక్తి. ఆమెభారత్ స్కౌట్సు అండ్ గైడ్స్ ఆధ్వర్యంలో జరిగిన మృగతుని శిఖరాధిరోహణలలో పాల్గొనిన మహిళ లందరిలోకి కుమారి భగవాన్‌దాస్ చిన్నవారు. ఆమె పందొమ్మిదవ పుట్టినరోజునే యీశిఖరాన్ని అధిరోహించడం ఒక విశేషం.

ఆంధ్ర ప్రదేశ్ భారత్ స్కౌట్స్ అండ్ గైడ్స్ అసోసియేషన్‌కు ప్రభుత్వం ఒకటిన్నర లక్షల రూపాయల వార్షిక గ్రాంటును మంజూరు చేస్తూవున్నది.

## సహాయ ఉద్యమం :—

విద్యా విధానంలో బహుళార్థసాధక ప్రయోజన పద్ధతిని ప్రవేశ పెట్టడంతో బాల బాలికలు తమ భవిష్యత్‌ను నిర్ణయించుకోవడంలో వారికి తగు మార్గ దర్శకత్వం అందజేయవలసిన అవసరం ఏర్పడింది. ఆ వుద్దేశంతోనే 1957 అక్టోబరులో ఎడ్యుకేషనల్ అండ్ వొకేషనల్ గైడెన్స్ స్టేట్ బ్యూరో ఒకటి నెలకొల్ప బడింది. మొదట్లో యిది రాజమండ్రిలో వుండేది, 1958 మార్చిలో దీనిని హైదరాబాదుకు తరలించారు. శిక్షణపొందిన వ్యక్తులు తగుసంఖ్యలో వుంటేనే గాని యీ సహాయ ఉద్యమం విజయవంతంకాదు. అందుకే యీ బ్యూరో శిక్షణ తరగతులను నిర్వహిస్తున్నది.

ఇది నిర్వహించే మరొక ముఖ్యమైన పనికూడావున్నది అది_మానసిక పరీక్షకు సంబంధించినది. 10—15 సం॥ వయసుగ్రూపు విద్యార్థులు 10,000 మందిని తీసుకుని, వారి

(56 వ పేజీ చూడుడు.)

# కొండా వెంకటప్పయ్య

గొట్టిపాటి బ్రహ్మయ్య

దేశభక్త కొండా వెంకటప్పయ్యగారు వెనకటి తరానికి చెందిన అతిరథులైన జాతీయ నాయకులు. ఆంధ్ర వీరులలో అగ్రగణ్యులు. స్వాతంత్ర్యానికి పూర్వం సమర శంఖాన్ని పూరించి, నిద్రాణమైన జాతిని జాగృతం చేసిన అగ్రశ్రేణి జాతీయ నాయకుల్లో వీరు

పురపాలక సంఘం వ్యవహారాలనుంచి జాతీయ కాంగ్రెసు స్థాయివరకు అన్ని ఉద్యమాలలోనూ వీరికి సన్నిహిత సంబంధం ఉంది. సంఘ సంస్కరణ కార్యక్రమాలలో పాల్గొన్నారు. జర్నలిజాన్ని చేపట్టారు. హరిజనోద్ధరణ, జాతీయ విద్యావిధానం, గ్రంథాలయోద్యమం వంటి ఉద్యమాలలో పాల్గొన్నారు. దేశానికి రాజకీయంగానే గాక ఇతరత్రాకూడా స్వాతంత్ర్యాన్ని సంపాదించు కోవడం చాలా అవసరం అని వీరు గట్టిగా నొక్కి చెప్పారు.

ఉన్నవ లక్ష్మీనారాయణ పంతులుగారు, స్వామి సీతారాం, వెలగపూడి సుబ్బారావు గారు తదితర ప్రముఖులతోకలిసి వెంకటప్పయ్యగారు 1900 సం॥లో గుంటూరులో ఒక యువక సాహిత్య సంస్థను స్థాపించారు. ఆ సంస్థే మొట్టమొదటి ఆంధ్ర మహాసభ ఆహ్వాన సంఘం ఏర్పడడానికి కారణభూతమైంది. తర్వాతకాలంలో ఆంధ్ర రాష్ట్రం ఏర్పడడానికి ఆంధ్ర మహాసభ ఎట్టి కృషి చేసినదో విడిగా చెప్పనక్కరలేదు.

1937 లో వెంకటప్పయ్యగారు మద్రాసు విధాన సభ సభ్యులయ్యారు. శాసన మండలి కాంగ్రెసు పార్టీ కార్యదర్శిగా కూడా వ్యవహరించారు. ఆ రోజుల్లోనే గ్రంథాలయాలకు ఆర్థిక వనరులను కల్పించాలని, రాష్ట్ర బడ్జెటులో అందుకు కేటాయింపు చేయాలని ఒక సూచన చేశారు. దీనికి ప్రభుత్వం అంగీకరించి ఆ ఏడాది గ్రంథాలయాల నిమిత్తం రూ. 20,000 లు కేటాయించింది.

1918 నాటికి గాంధీజీ హిందీని జాతీయ భాషగా చేయాలని ప్రతిపాదించారు. నాటినుండి వెంకటప్పయ్యగారు రాష్ట్రంలో హిందీ భాషావ్యాప్తికి, వికాసానికి తీవ్రంగా కృషిచేస్తూ వచ్చారు. 1936 లో ఆంధ్రరాష్ట్ర హిందీ ప్రచార సంఘం నెలకొల్పబడింది. ఇందుకు ప్రధానంగా అభినందింపవలసిన వ్యక్తి శ్రీ కొండా వెంకటప్పయ్య. వీరి నిరంతర కృషి, మార్గదర్శకత్వము సంఘం ఆవిర్భావానికి కారణమయ్యాయి. వీరే ఆ సంఘానికి తొలి అధ్యక్షుడిగా ఎన్నుకోబడ్డారు. అప్పట్లో భోగరాజు పట్టాభి సీతారామయ్యగారు ఉపాధ్యక్షులు. విశ్వదాత కాశీనాధుని నాగేశ్వరరావు గారి ఉదారతతో, ఆర్థిక సహాయంతో కొండా వెంకటప్పయ్యగారు విజయవాడలో ఒక ప్రచురణ సంస్థను, ఒక పుస్తక విక్రయశాలను నెలకొల్పారు.

ఖాది ఉద్యమానికి ఆ రోజుల్లో గుంటూరు కీలక స్థానంగా ఉండేది. గాంధీజీ ప్రారంభించిన అఖిల భారత నూలువడుకుదార్ల సంఘానికి గుంటూరులో ఆంధ్ర రాష్ట్ర చరఖా సంఘం పేరున ఒక శాఖ పనిచేస్తుండేది. 1929 వరకు కొండా వెంకటప్పయ్య గారు దీనికి [illegible] పనిచేశారు. ఆంధ్ర రాష్ట్ర [illegible] స్వామి సీతారాం కార్యదర్శిగా వ్యవహరించారు.

ఆంధ్రులకు విడిగా ఒక విశ్వ విద్యాలయం ఉండాలని గట్టిగా పట్టుబట్టిన వారిలో కొండా వెంకటప్పయ్య గారు ఒకరు. సర్వశ్రీ దేశభక్తకొండా వెంకటప్పయ్య, గాడిచర్ల హరిసర్వోత్తమ రావు తదితర ఆంధ్ర ప్రముఖులుసాగించిన ఉద్యమంకారణంగానే 1926లో ఆంధ్ర విశ్వవిద్యాలయం ఆవిర్భవించింది. ఆంధ్రోద్యమ చరిత్రలో యిదొక మైలురాయి.

విధాన సభ సభ్యుడిగా, రాష్ట్ర నాయకుడిగా స్త్రీల విద్యాభివృద్ధికి ఎంతగానో వీరు కృషిచేశారు.

'అస్పృశ్యతా నిర్మూలన జరిగితేనే గాని స్వరాజ్య సంపాదనకు పూర్తి ప్రయోజనం ఒనకూడదు. మనలో ఏ ఒక్క వ్యక్తిఐనా అస్పృశ్యుడుగా దూరంచేయబడితే అది మనం సిగ్గుతో తల దించుకోవలసిన చర్య' అంటూ గట్టిగా నొక్కి చెప్పారు. ఆయన. తన కార్యకలాపాలలో హరిజనోద్ధరణకు అత్యధిక ప్రాధాన్యతను ఇచ్చారు. గుంటూరులో శారదా నికేతనాన్ని ఉన్నవ లక్ష్మీనారాయణగారు నెలకొల్పటంతో ఆయనకు వెంకటప్పయ్యగారు కుడి భుజంగా నిలిచారు.

1943.లో రాయల సీమలో కరువు పరిస్థితి ఏర్పడినప్పుడు ఆంధ్ర మహాసభ చాలా ప్రశంసనీయమైన కృషిచేసింది. దీనికి అనుబంధంగా ఒకకమిటీ బొంబాయిలో నెలకొల్పబడిందికూడను. ప్రఖ్యాత చిత్రకారుడు దావలి నాగేశ్వరరావు తోపాటుదేశభక్త కొండా వెంకటప్పయ్య బొంబాయి వెళ్లి నిధుల సేకరణలో తోడ్పడ్డారు.

1,30,000 రూపాయల రొక్కం, 32,000 ధోవతులు, 1,000 చీరలు బొంబాయిలో సేకరించారు. వెంకటప్పయ్య గారు 'కృష్ణా పత్రిక' సంపాదకత్వంకూడ నిర్వహించారు, కృష్ణా జిల్లా సంఘం తరఫున 1902లో యీ పత్రికను ప్రారంభించారు. ఇదొక్కటే కాదు. చిత్రాలు, మ్యాపులు మొదలైన వాటిద్వారా రాజకీయ పరిస్థితులను వివరించడానికి ఆయన రాష్ట్రంనాలుగు చెరగులా పర్యటించారు.

కృష్ణా జిల్లాలో 1916 నీటి తీరువ రేటును 25 శాతం ఎక్కువ చేయడానికి పరాయి ప్రభుత్వం ప్రయత్నించినప్పుడు

అక్కడి కాంగ్రెసు యూనిటు వెంకటప్పయ్య గారి నాయకత్వంలో ప్రతిఘటనోద్యమం నిర్వహించింది.

ఈ విషయాన్ని సాకల్యంగా చర్చించి లార్డ్ మాంటెగ్ వద్దకు ప్రతినిధివర్గాన్ని పంపడానికి 1917లో ఆంధ్ర మహా సభ ప్రత్యేక సమావేశాన్ని ఏర్పాటు చేశారు. శ్రీయుతులు కొండా వెంకటప్పయ్య, న్యాయపతి సుబ్బారావు, పట్టాభి సీతారామయ్య, మోచర్ల రామచంద్రరావు ప్రభృతులు యీ ప్రతినిధి వర్గంలో ఉన్నారు.

శ్రీ వెంకటప్పయ్య గారు ఆంధ్ర రాష్ట్ర కాంగ్రెసు సంఘానికి ఏకగ్రీవంగా ఐదుసార్లు అధ్యక్షులుగా ఎన్నికైనారు.

1930 జనవరి 26 వ తేది. భారత దేశ చరిత్రలో సువర్ణాక్షరాలలో లిఖించదగినది. భారత దేశానికి సంపూర్ణ స్వాతంత్ర్యం కావాలని ఆరోజున కాంగ్రెసు తీర్మానం చేసింది. అదే సంవత్సరం మార్చిలో గాంధిజి చరిత్రాత్మకమైన దండి ఉప్పు సత్యాగ్రహం ప్రారంభించారు. ఆంధ్ర దేశంలో యీ ఉద్యమం తీరుతెన్నులు చర్చించడానికి గాంధీ వెంకటప్పయ్య గారిని ఆహ్వానించారు. వెంకటప్పయ్య గారు సత్యాగ్రహులను తమ ఇంటికి ఆహ్వానించి ఇంటి ఆవరణలో ఉప్పు తయారు చేశారు. 1930 ఏప్రిల్ 10 న. ఉప్పు తయారుచేసి తీసుకెళ్ల డానికి వెంకటప్పయ్య గారు శ్రీయుతులు ప్రకాశం, నాగేశ్వరరావు పంతులు, డాక్టర్ పట్టాభి ప్రభృతులతోపాటు మచిలీపట్నం సమీపంలో చిన్నాపురం సత్యాగ్రహ శిబిరానికి వచ్చారు. గృహోన్ముఖులై వెళ్లుతుండగా మార్గమధ్యంలో పోలీసులు వారిని నిర్బంధించారు.

1923 లో కొన్ని నెలలపాటు వెంకటప్పయ్యగారు ఎ.ఐ.సి.సి. తాత్కాలిక అధ్యక్షులుగా వ్యవహరించారు.

శ్రీ వెంకటప్పయ్య గారు బాల్యంనుంచి సాంఘిక సేవా కార్యక్రమాలలో ఉత్సాహంతోను, ఆసక్తితోను పాల్గొనేవారు. ఆంధ్రోద్యమానికి ఆయనను పితామహునిగా భావించేవారు. స్వాతంత్ర్యపోరాటం ముమ్మరంగా కొనసాగువరకు మహాసభ కార్యక్రమాలలో ఆయన అత్యంత ప్రముఖ పాత్ర వహించారు. గాంధీజీ సహాయనిరాకరణోద్యమం న్యాయస్థానాలబహిష్కరణను ప్రారంభించడానికి ముందుగానే శ్రీ వెంకటప్పయ్యగారు, ఆంధ్రోద్యమ కార్యక్రమాలపై పూర్తి శక్తిని వినియోగించడానికి వీలుగా ధనార్జన అవకాశంగల న్యాయవాద వృత్తిని త్యజించారు. స్వాతంత్ర్య ఉద్యమంలో ప్రముఖ పాత్ర వహిస్తున్న కారణంగా చాలసార్లు అయనను నిర్బంధించారు. 1921, 1930, 1932, 1942 సంవత్సరాలలో జైలు శిక్షలుకూడ అనుభవించారు. జైళ్ళలో ఆయన ఆధ్యాత్మిక చర్చలలోను, గ్రంథ పఠనంలోను తమకాలాన్ని వినియోగించేవారు. కడలూరు జైలులో ఉన్నప్పుడు ఆయన 'డచ్ రిపబ్లిక్' గ్రంథాన్ని రచించారు. ఆయన మరణానంతరం దానిని ప్రచురించడం జరిగింది. ఇంగ్లీషు, తెలుగు భాషలలో ఆయన మంచి వక్త.

రాష్ట్రానికి, దేశానికి ఆయన చేసిన అపారమైన సేవకు ప్రతిగా ఆంధ్ర ప్రజలు ఆయనకు 'దేశభక్త' బిరుదాన్ని యిచ్చి గౌరవించారు. ఆయన కీర్తి ప్రతిష్ఠలు ఆచంద్రతారార్కం నిలిచి ఉంటాయనడంలో ఏమాత్రం సందేహంలేదు. ★

---

(53వ పేజీ తరువాయి.)

తెలివి తేటల్ని ప్రత్యక్ష ప్రశ్నోత్తరాల ద్వారా పరీక్షించడం జరుగుతుంది.

ఇది 1959 ఆరంభంలో మొదలై 1962 లో ముగిసింది.

## పాఠ్య గ్రంథాల జాతీయకరణ :—

కుప్పుస్వామి కమిటీ సిఫారసుల మేరకు, 1957 డిశంబరులో డిల్లీలో జరిగిన రాష్ట్ర విద్యామంత్రుల సమావేశం నిర్ణయాల మేరకు అఖిలభారత సెకండరీ ఎడ్యుకేషన్ కౌన్సిల్ సిఫారసుల మేరకు పాఠ్యపుస్తకాలను జాతీయకరణచేసే పనిని ఆంధ్ర ప్రదేశ్ ప్రభుత్వం చేపట్టింది. తొలిదశలో తెలుగు భాషలోని పుస్తకాలను జాతీయం చేయడం జరిగింది. ఇందుకుగాను ఒక యూనిటు ఏర్పాటు చేయబడింది. ఈ యూనిటు విద్యా శాఖ డైరెక్టరు కార్యాలయంలో వుంటుంది. ఈ పథకం నిర్వహణ, అజమాయిషీలకు ఒక ప్రత్యేక అధికారి నియమింప బడ్డారు.

జాతీయం చేయబడిన పుస్తకాలను ప్రచురించడానికి ఒక టెక్స్టుబుక్ ప్రెస్ నెలకొల్ప బడింది. భారతదేశంలో యీ మాదిరి ప్రెస్సులలో యిదే మొదటిది. 1958లో హైదరాబాదులో యీ ప్రెస్సు రూ. 16 లక్షల పెట్టుబడితో ప్రారంభింపబడినది.



దమనకుడు పోయిన తర్వాత సంజీవకుడు ఈ విధముగ చింతించెను. ''అయ్యో! నేను ఎంత అవివేకిని? గడ్డిమేయు వాడను, మాంసము తిను సింహముతో స్నేహముచేసితిని గదా! ఇపుడేమి చేయుదును? ఎక్కడికి వెళ్ళుదును? నాకు ఏలాగు శాంతి లభించును? లేక తిరిగి ఆ పింగళకునే ఆశ్రయించెదనుగాక, శరణు పొందిన నన్ను అతడు చంపక రక్షించవచ్చును. ఇంతియేగాక ఒక వేళ నేను, మాంసముతిను మరియొక దుష్టజంతువును ఆశ్రయించినచో దానివలన కూడ నాకు మృత్యువు సంభవించియే తీరును. అట్టి మృత్యువు సింహము వలననే కలుగుగాక'' అని నిశ్చయించి తడబడుచు మెల్లమెల్లగా పోయి సింహమును చూచెను. అది దమనకుడు చెప్పిన విధముగనే భయంకరముగనుండెను. దానిని జూచి సంజీవకుడు భయపడి శరీరము ముడుచుకొని సింహమునకు నమస్కరించరాయే దూరముగ కూర్చుండెను. పింగళకుడు కూడ అట్లున్న సంజీవకుని చూచి దమనకుని మాటనే విశ్వసించియుండెను గనుక కోపముతో సంజీవకునిపై పడెను. తన కఠినములైన గోళ్ళతో సింహము ఆ ఎద్దు వీపును గాయపరచెను. ఎద్దుకూడ కొమ్ములతో సింహము కడుపును గాయపరచుచు పోరాడెను. ఆ రెంటి శరీరములు పూచిన మోదుగులవలె రక్తముచే ఎఱ్ఱబడెను. రెండుకూడ పరస్పర వధకాంక్షచే తీవ్రముగ పోరాడుచుండెను.

దానిని చూచి కరటకుడు దమనకునితో అధిక్షేపించుచు ఇట్లనెను. ''ఓయీ! మూర్ఖుడా! ఈ ఇరువురికి విరోధముకల్పించి ఎంత తప్పు చేసితివి. నీకు నీతి స్వభావము తెలియదు. దీనివలన మన ప్రభువుకే నాశనము సంభవించవచ్చును. లేదా సంజీవకుడు చావకపోయినను కష్టమే. మూర్ఖుడా! ఇంతటి అవివేకివి మంత్రి పదవిని ఎట్లు కోరుచున్నావు. నీకు సామోపాయమే తెలియదు. ఎల్లపుడు వ్యర్థముగ దండోపాయమునే యోచించుచుందువు. వివేకముతో యోచించని నీవు మంత్రి పదవిని కోరుట అయుక్తము. మంత్రాలోచన ఐదు విధములుగనుండును. (1) కార్యములు ఆరంభించుటకుముందు యుక్తినిపన్నుట, (2) సైన్యము, ధనము సమృద్ధిగ సేకరించుకొని యుండుట, (3) దేశమును, కాలమును పరిశీలించి కర్తవ్యాకర్తవ్యములను తెలిసికొని యుండుట, (4) విపత్తి, లేక వినాశము కలిగినపుడు దానిని అరికట్టు ఉపాయమును తెలిసికొని యుండుట, (5) కార్యసిద్ధి.

ఇపుడు ప్రభువుకుగాని, మంత్రికిగాని లేక ఇరువురికిని ఆపద కలుగుచున్నది. ఇపుడు నీకు శక్తి యున్నచో దీనిని అరికట్టు ఉపాయమును చూడుము. ద్వేషభావముచేత విడిపోయిన వారిని తిరిగి కలిపి, ఆ యిరువురికి మైత్రిని కల్పించుటలోనే మంత్రుల తెలివి పరీక్షింపబడును. కనుక ఇపుడు శక్తియున్నచో భిన్నసంధానము చేయుము. మూర్ఖుడా! అదిచేయుటకు నీవు సమర్థుడవు కావు; కనుక నీవు మంత్రిత్వమునకు అనర్హుడవు. నిన్ను అని ఏమిఉపయోగము? నీవంటి అవివేకి మాటను విశ్వసించిన ప్రభువుది కదా దోషము. నీవంటివాడు ఈ సింహమునకు మంత్రి అయినచో సజ్జనుడెవడు కూడా సింహము వద్ద చేరకుండును. సుజన సాంగత్యము లేనందువలన ప్రభువులకు కూడ నాశము వచ్చును. దీనికంతకు నీవే మూలకారణము; కనుక ఎంత ప్రయత్నించినను కొయ్య వంగదు. రాయి, కత్తికి తెగదు. అయోగ్యుడైన శిష్యుని బుద్ధిలో సదుపదేశము దూరదు. ఈ విషయములో సూచీ ముఖము అను పక్షిని ఉదాహరణముగ తీసికొనవచ్చును'' అని కరటకుడు చెప్పెను. ఆ కథ చెప్పుమని దమనకుడు అడిగెను. కరటకుడు ఈ విధముగా చెప్పెను:—

## వానరములు—పక్షికథ

ఒకానొక పర్వతమునందు ఒక వానర సమూహముండెను. ఆ వానరములు శీతకాలములో గాలికి, చలికి, వానకు వణకుచు బాధపడుచుండెను. ఇంతలో కొన్ని వానరములు నిప్పు కణమువలెనున్న గురిగింజలను చూచి వాటితో మంట చేసికొనదలచి, వాటిపై పుల్లలువేసి ఊదుచుండెను. ఆ కోతుల వ్యర్థ ప్రయాసమును జూచి సూచీముఖమను ఒక పక్షి యిట్లనెను.

''ఎంత మూర్ఖులు మీరు. ఇవి నిప్పులుకావు. గురిగింజలు. వీటివల్ల చలిబాధ తగ్గదు. ఎక్కడైనను గాలిదూరని ప్రదేశమునకు గాని, గుహకుగాని, లేక పర్వతపు లోయకుగాని పోయి చలి అణచు కొనుడు. ఇంకను కారు మబ్బులు ఆకాశమంతయు క్రమ్మియున్నవి.

అదివిని ఒక వృద్ధ వానరము యిట్లనెను.

''ఓయీ మూర్ఖుడా! నీకు యీ అధిక ప్రసంగము లేల. నీదారిన నీవు పొమ్ము.''

ఆ మాటవిని కూడా సూచీముఖము తిరిగి వానరములకు ఉపదేశింప దొడగెను. ఎంతకును వినకున్న ఆ పక్షి నొక వానరము పట్టుకొని దాని రెక్కలు విరిచి రాతిపై కొట్టగా అది చచ్చెను. కనుక వంచ జాలని కొయ్యను వంచగూడదు అని చెప్పితినని కరటకుడు చెప్పి, మూర్ఖులకు ఉపదేశించుట పాముకు పాలు త్రాపినట్లగును. వాటికి పాలు విషమునే పెంచును. కనుక అయోగ్యునికి సదుపదేశము చేయకూడదు. పూర్వమిట్లే యుపదేశించిన ఒక పిచ్చుక. నిరాశ్రయముగా చేయబడెను.

ఆ కథ చెప్పుమని దమనకుడు అడగగా కరటకుడు ఇట్లు చెప్పదొడగెను:—

## పిచ్చుక—వానరముకథ

ఒక వనములో ఒక జమ్మిచెట్టు ఉండెను. ఆ చెట్టుపైన పిచ్చుకల దంపతులు నివసించుచుండెను. చలికాలమందు హేమంత మేఘము మెల్లమెల్లగా వర్షింపజొచ్చెను. అప్పుడొక కోతి చలిగాలిచే బాధపడుచు గడగడ వణకుచు ఆ శమీ వృక్షమూలమును చేరెను. దానిని చూచి పెంటిపిచ్చుక, ''ఓయీ! నీవు చేతులు, కాళ్ళు కలిగి పురుషాకారములో కనపడుచున్నావు, ఈ శీతబాధ అణగుటకు ఒక యిల్లు కట్టుకొనగూడదా,'' అని అనెను. ఆమాటకు వానరము మిక్కిలికోపించి, ''ఓ నీచురాలా! నోరు మూసికొని ఉండుము. నన్ను పరిహసించు చున్నావా. నా విష

యము నీకెందుకు.'' అని ఆ పిచ్చుకను అధిక్షేపించుచు చెట్టుపై కెక్కి దానిగూడను కూలద్రోసెను.

కనుక దమనకా ! అయోగ్యులకు ఉపదేశము చేయకూడదు అని అంటిని. మూర్ఖుడా నీకింతగా నేర్పినను తెలివి రాలేదు. ఇందు నీదోష మేమున్నది. సత్పురుషులకు ఉపదేశించ వలెనేగాని నీవంటి మూర్ఖులకు కూడదు. అన్ని తెలిసినవానివలె నటించుచు నామాట వినక నీ శాంతికికూడ భంగము తెచ్చుకుంటివి. నీవు నిక్కముగా నీచుడవే. పూర్వము ఈలాగే వ్యర్థ పాండిత్యముగల పుత్రునిచేత తండ్రి చంపబడెను.

ఆ కథ చెప్పుమని దమనకుడు అడుగగా కరటకుడు ఇట్లు చెప్పెను :—

## ధర్మబుద్ధి-పాప బుద్ధి కథ

ఒక పట్టణమునందు 'ధర్మబుద్ధి, పాపబుద్ధి' అను పేర్లుగల యిరువురు మిత్రులు నివసించుచుండిరి. పాపబుద్ధి ఇట్లుచింతించెను. ''నేను మూర్ఖుడను, దరిద్రుడను. కాబట్టి యీ ధర్మబుద్ధిని తోడ్కొని దేశాంతరముపోయి ఇతని సహాయముతో ధనము సంపాదించెదను. పిదప ఇతనినికూడ వంచించి ఆ ధనమును అపహరించెదను."

ఒకనాడు పాపబుద్ధి ధర్మబుద్ధితో "ముసలితనము వచ్చిన తర్వాత నీవు యౌవనములోచేసిన పనులను స్మరించుటకుగాని, నీ పిల్లలకు దేశాంతర కథలు చెప్పుటకుగాని అవకాశము కల్పించు కొనుము. మనమిద్దరము దేశ పర్యటన చేయుదము" అనిచెప్పెను. ధర్మబుద్ధి ఆ మాటకు సంతసించి పెద్దల అనుజ్ఞ తీసుకొని వానితో కలిసి దేశాటనమునకు పోయెను. ధర్మబుద్ధి ప్రభావముచేత ఆ యిరువురు గొప్ప ధనమును ఆర్జించిరి. ఇంటికి తిరిగి బయలు దేరిరి. తన పూరు సమీపించుచుండగా పాపబుద్ధి, ధర్మబుద్ధితో ఇట్లనెను. ''మిత్రమా ! మనము ఈ ధనమంతయు ఇంటికి తీసుకొనిపోవుట యుక్తముకాదు. మన బంధువులందరు దీనిని వ్యర్థముగా వ్యయముచేసెదరు. కాబట్టి యీ వనములో ఒకగోతిని త్రవ్వి ధనమును దాచుకొని కొంతమాత్రము తీసికొని యిల్లు చేరుదము. మనకు అవసరము వచ్చినప్పుడు ఇచ్చటికివచ్చి తీసు కొనవచ్చును.''

ఆ మాటకు ధర్మబుద్ధి అంగీకరించెను. ఇరువురు అచటనే ఆ ధనమును దాచి యింటికి వెళ్ళిరి. తర్వాత ఒకనాడు పాపబుద్ధి అర్ధరాత్రమునందు అడవికిపోయి ఆ ధన మంతయు అపహరించి, ఉన్నదున్నట్లుగా గోతిని పూడ్చి తన యింటికి పోయెను. ఒకనాడు ధర్మబుద్ధి వద్దకు వచ్చి ''మిత్రమా ! మన కుటుంబము పెద్దది. ధనము లేక బాధ పడుచున్నాము కనక మన నిక్షేపమునుండి కొంత ధనము తెచ్చు కొనెదము'' అనెను. ఆ మాటకు ధర్మబుద్ధి అంగీకరించెను. ఇరువురు పోయి దాచిన చోటు త్రవ్విచూడగా అచట ధనభాండము రిక్తముగా కనపడెను. పాపబుద్ధి తలమోదుకొనుచు ధర్మబుద్ధీ! నిక్కముగా నీవే యీధనమును హరించితివి. మరి యొకడుకాడు. మూడవవానికీ ఈ సంగతి తెలియదు. అందులో నా అర్థభాగము నాకిమ్ము. లేకున్నచో న్యాయస్థానములో అభియోగము తెచ్చెదను" అని అనెను. ఆ మాటవిని ధర్మబుద్ధి "దురాత్ముడా ! అట్లనకుము. నేను ధర్మబుద్ధిని, దొంగతనము చేయను" ఇట్లు ఇరువురు వాదించుచు న్యాయాధిపతి కడకుపోయి జరిగిన సంగతి నివేదించిరి. ధర్మాధికారమందున్న పురుషులు ఈ వ్యవహారమును తీర్చుటకు తగిన సాక్ష్యములేనందున అగ్నిస్పర్శము, విషపానము మొద లైన శిక్షలను ఆ ఇరువురికి విధించి ఆ శిక్షలలో బాధపొందనవానిని దోషిగా నిర్ణయించదలచిరి. అదిచూచి పాపబుద్ధి ''అయ్యా ! మీరు న్యాయము నిర్ణయించలేకున్నారు, సాక్షి దొరకనప్పుడుకదా యీ ఉపాయములద్వారా దోషిని నిర్ణించవలెను. నాకు వన దేవతలు సాక్షులుగా ఉన్నారు. అక్కడికిపోయి వారి సాక్ష్యములు విని మీరు దోషిని నిర్ణయించుడు." అని చెప్పెను. ఆ మాటకు వారు అంగీకరించి మరునాడు ఉదయము వారి నిరువురినికూడ తమతో ఆ వృక్షము వద్దకు రమ్మని చెప్పిరి.

తర్వాత పాపబుద్ధి యింటికిపోయి తన తండ్రితో. ''తండ్రీ ! ధర్మబుద్ధియొక్క అధిక ధనమును నేను దొంగిలించితిని. నీవు అది మనకు నిలుచునట్లు చేయుము. లేకున్నచో ధనముతోపాటు మన ప్రాణములుకూడ పోవును." అని అనెను. అది విని తండ్రి ''నాయనా ! త్వరగా చెప్పుము. నీ యిష్టము ప్రకారము మెలగి ధనమును వశపరచుకొనెదను.' అని చెప్పెను. ''తండ్రీ! ఆచోట గొప్ప శమీవృక్షము ఉన్నది. చెట్టు తొర్రలో నిప్పుడే ప్రవేశించి నీవుండుము. నను ఉదయము వచ్చి అడిగినప్పుడు ''ధర్మ బుద్ధియే దొంగ అని నీవు అనవలెను.'' అనెను. దానికి అంగీకరించి పాపబుద్ధి తండ్రి, చెట్టు తొర్రలో దూరెను. ఉదయమే న్యాయాధిపతులతోపాటు అచటికిపోయి, పాపబుద్ధి, ''తల్లీ ! వన దేవతా! మా యిరువురిలో ఎవరుచోరుడో చెప్పుము'' అని బిగ్గరగా అరచెను. ఆ మాటకు పాపబుద్ధియొక్క తండ్రి చెట్టుపైనుండి '' ఓయీ ! ధర్మబుద్ధియే ధనమును అపహరించెను." అని పలికెను. ఆ ధ్వని విని ధర్మాధికారులు ధర్మబుద్ధియే దోషి అని నిర్ణయించిరి. అప్పుడు ధర్మబుద్ధి ఆచెట్టు తొర్రయందు చుట్టు గడ్డి, కసువు చుట్టి నిప్పు అంటించెను. దానివలన సగము శరీరము కాలి, కన్నులుపోయి దుఃఖించుచు పాప బుద్ధి తండ్రి బయటకు వచ్చెను. అతనిని చూచి ఎవరు నీవని అందరు అడిగిరి. ఇది యంతయు పాపబుద్ధియొక్క చెడుకార్యము అనిచెప్పి ఆ వృద్ధుడు మరణించెను. అప్పుడు రాజపురుషులు పాపబుద్ధిని ఆ చెట్టు కొమ్మకు వ్రేలాడగట్టి శిక్షించి, ధర్మబుద్ధిని ప్రశంసించి ఇట్లనిరి.

"ఉపాయముతోపాటు అపాయముకూడ చింతించవలెను. లేకున్నచో పూర్వము ఒక కొంగ చూచుచుండగనే అన్ని కొంగలను ఒక ముంగీస చంపెను."

ఆ కథ ఎట్లు చెప్పుమని ధర్మబుద్ధి వారిని అడిగెను. వారిట్లు చెప్పిరి.

## కొంగలు-ముంగీస కథ

ఒక వనమునందు ఒక మఱ్ఱిచెట్టు ఉండెను. దాని పైన '' అనేక బకములు నివసించుచుండెను. దాని తొఱ్ఱలో ఒక

కృష్ణ సర్పము ఉండెను. అది ప్రతిదినము ఆ కొంగల పసికూనలను చంపి తినుచుండెను ఒక కొంగ యీ శిశు నాశమును చూచి వైరాగ్యముతో ఆ చోటు విడిచి ఒక కొలనితీరమునకు వచ్చి దుఃఖించుచు కూర్చొనెను. దానినిచూచి ఆ సరస్సునందలి ఒక ఎండ్రకాయ ఇట్లనెను, ''మామా! ఇట్లు ఎందుకు ఏడ్చుచున్నావు.'' ఆ మాటకు కొంగ; ''మిత్రమా! యేమిచేయుదును. దురదృష్టవంతుడను. నా బాలకులను సర్పము భక్షించెను. అందుచేత దుఃఖించుచున్నాను. ఆ సర్పమును చంపుటకు ఉపాయము ఉన్నచో చెప్పుము.'' అని అనెను. అది విని ఎండ్రకాయ, ''ఈ కొంగ నాజాతికి సహజ శత్రువు. కనుక దీనితో పాటు ఒక కులమంతయు నశించు ఉపాయము మిత్రునివలె దీనికి ఉపదేశించెదను'' అని నిశ్చయించి కొంగతో ఇట్లనెను "కొంగా, అట్లైనచో ఒక ఉపాయము చెప్పెదను చేయుము:- నీవు చేపల మాంసఖండములను ముంగీస బిలద్వారమునుండి ఆ పాము తొఱటమువరకు పరచి ఉంచుము. ఆ మత్స్య ఖండములను తినుచు నకులము ఆ మార్గముగుండా పోయి సర్పమును చంపగలదు. అని చెప్పెను. ఆ విధముగానే కొంగ మత్స్యములను పరచెను. వానిని వరుసగా తినుచు నకులము చివరకు సర్పమును చంపి ఆ తర్వాత ఆ చెట్టుపై ఉన్న బకముల నన్నింటినిగూడ మెల్లమెల్లగా చంపి భక్షించెను.''

ఈ కథ చెప్పి కరటకుడు:-'' ఉపాయముతోపాటు అపాయముకూడ చింతించవలెను. పాప బుద్ధి, తన సౌఖ్యము కొరకు ఉపాయమునే చింతించెను కాని ఆ తర్వాత వచ్చు అపాయమును తలచలేదు. దానికి తగిన ఫలమును అనుభవించెను.'' అని దమనకునితో చెప్పి మరల ఇట్లనెను:- "మూర్ఖుడా! నీవుకూడ పాపబుద్ధివంటివాడవే. మన ప్రభువుకు ప్రాణాంతమువరకు తెచ్చితివి. ప్రభువునే యిట్లు చేసిన నీకు మావంటివారొక లెక్కయా? కనుక నీతో చేరి ఉండకూడదు. ఇది పూర్వము ఎలుకలు వేయి మణుగుల ఇనుప తూనికలను భక్షించిన కథవలె ఉన్నది'' దమనకుడు ఆ కథ చెప్పుమనగా, కరటకుడిట్లు చెప్పెను:-

## ఇనుపత్రాసు, బాలకుని కథ

జీర్ణధనుడు అను పేరుగల ఒక వైశ్యుడు, ఒక పట్టణములో ఉండెను. అతని ధనమంతయు నశించియుండుటచేత దేశాంతరమునకుపోయి ధనమును సంపాదించదలచెను. అతని ఇంటిలో ఇనుపతూనికములతో కూర్చబడిన ఒక పెద్ద త్రాసు పిత్రార్జితము ఉండెను. దానిని ఒక సెట్టియింటిలో దాచిపోయెను. చాలా కాలమునకు అతడు దేశాంతరమునుండి వచ్చి "ఓ శ్రేష్ఠీ, నీవద్ద దాచియుంచిన త్రాసును యిమ్ము" అని అడిగెను. "నీ త్రాసును ఎలుకలు కొరికితిన్నవి." అని సెట్టి బదులు చెప్పెను. ఆ మాటకు జీర్ణధనుడు:—"ఎలుకలు తిన్న దానికి నీవేమి చేసెదవు. పోనిమ్ము. సంసారములో ఏది శాశ్వతము, నేను నదికి స్నానార్థము పోవలెను, నా మడి వస్త్రములను తీసికొని వచ్చుటకు నీ కొడుకు, ధనదేవుని నావెంటపంపుము." అని ఆ సెట్టితోచెప్పెను. అతడు వెంటనే అంగీకరించి తన కొడుకును పంపెను. జీర్ణధనుడు నదిలో స్నానముచేసి ధనదేవుని అచ్చటి గుహలో దాచి ఉంచి ద్వారమును పెద్ద బండతో మూసి తిరిగి వచ్చెను "ఓయీ! నీ వెంట పోయిన నా కొడుకు ఎక్కడ?" అని ఆ సెట్టి అడిగెను."ఆ బాలకుని డేగ ఎత్తుకొని పోయెను." అని జీర్ణధనుడు బదులు చెప్పెను.

"ఓయీ! బొంకులాడెదవా? ఎక్కడైనను డేగబాలకుని ఎత్తుకొని పోవుటకలదా?! నా కొడుకును తెచ్చి ఇవ్వకున్నచో నీపైన న్యాయస్థానములో అభియోగము తెచ్చెదను.'' అని అనెను. ఆ మాటకు జీర్ణధనుడు ''ఓయీ! సత్యవాదీ! నా ఇనుపత్రాసును ఎలుకలు తినినప్పుడు బాలకుని డేగ ఎత్తుకొని పోదా? నీకు కొడుకు కావలసియున్నచో నా త్రాసును తెచ్చి యిమ్ము'' అని చెప్పెను. ఇట్లు వివాదము చేయుచు ఇద్దరు న్యాయస్థానమునకు పోయి మొరపెట్టుకొనిరి. ''నా కొడుకు నపహరించినా'' డని సెట్టి, చెప్పెను.'' బాలకుని ఇమ్మని ధర్మాధికారులు జీర్ణధనునికి ఆజ్ఞయిచ్చిరి. ''నదీతీరములో డేగ అతనిని ఎత్తుకొని పోయెను.'' అని జీర్ణధనుడు చెప్పెను. "ఇది అసత్యము. డేగ బాలకుని ఎత్తుకొని పోజాలదు.'' అని ధర్మాధికారులు అనిరి. ఆ మాటవిని జీర్ణధనుడు తన త్రాసును అపహరించినది మొదలుకొని సమాచారమంతయు న్యాయస్థానమునందు చెప్పెను. అది విని వారు ఆ ఇరువురిని సమాధానపరచి వారి వారి వస్తువులను వారికి యిప్పించిరి. కనుక మూర్ఖుడా! సంజీవకుని ప్రభావమునుచూచి ఓర్వలేక నీవు ఈ పన్నుగడ పన్నితివి. అహితము చేసితివి. కనుక శత్రువైనను పండితుడు కావలెను. మూర్ఖుడు హితము పచేయువాడైనను పనికిరాడు. పూర్వము ఒక వానరముచేత రాజు చంపబడెను. ఒక దొంగ, బ్రాహ్మణులను రక్షించెను. అని కరటకుడు దమనకునకు ఆ వృత్తాంతము ఈ విధముగా చెప్పదొడగెను:—

## రాజుసేవజేయు వానరము కథ

''ఒకానొక రాజువద్ద ఒక వానరము ఎల్లప్పుడు అంగసేవకుడుగా నుండి భక్తితో అతనిని సేవించుచుండెను. అది రాజగృహమునందు మిక్కిలి విశ్వాసపాత్రముగనుండి అంతఃపురమునందుకూడ అడ్డులేక తిరుగుచుండెను. ఒకనాడు రాజు నిద్రపోవుచుండగా ఆ వానరము విసనకఱ్ఱతో వీచుచుండెను. అప్పుడు రాజు వక్షస్థలముపై ఒక ఈగ వాలెను. విసనకఱ్ఱతో మాటిమాటికి ఆ వానరము తోలినప్పటికిని ఈగ తిరిగివచ్చి ఆచ్చోటనే కూర్చొనుచుండెను. అదిచూచి ఆ మూర్ఖవానరము కోపించి ఒక పదునైన కత్తితో ఈగపైన బిగ్గరగాకొట్టెను అంతతో ఈగ ఎగిరిపోయెను గాని, కత్తిదెబ్బతగిలి రాజు, రొమ్ముతెగి చచ్చెను. అందువలన దీర్ఘాయుష్యమును కోరు రాజు మూర్ఖుడైన సేవకునిదగ్గఱ ఉంచుకో కూడదు.'' అని ఆ కథచెప్పి కరటకుడు రెండవ కథనుగూడ ఇట్లు చెప్పదొడగెను :—

(సశేషం)

PRINTED BY THE DIRECTOR OF PRINTING, GOVERNMENT OF ANDHRA PRADESH, AT THE GOVERNMENT CENTRAL PRESS. HYDERABAD-24
PUBLISHED BY THE DIRECTOR OF INFORMATION AND PUBLIC RELATIONS, ANDHRA PRADESH, HYDERABAD.

